# ఆంధ్రసచిత్రవారపత్రిక




25 నయాపైసలు

9-7-195

ANDHRA PATRIKA
ILLUSTRATED WEEKLY

# ఆంధ్రపత్రిక

సచిత్ర వార పత్రిక

పలువురు రచయితల,
చిత్రకారుల, తదితర అభిమానుల
అభ్యర్థనపై



రచనల స్వీకారానికి, సంచిక ప్రచురణకు లోగడ నిర్ణయించిన తేదీని మార్చుతున్నందుకు పాఠకులు మన్నిస్తారని ఆశిస్తున్నాము. మామూలు రచనలను, చిత్రాలను, ఫోటోలను పంపడానికికూడా ఇదేగడువు.

—సం॥.

స్వర్ణోత్సవసంచిక ప్రచురణ తేదీని తర్వాత ప్రకటిస్తాము

| సంవత్సర చందా<br>రు. 13-0-0<br>విడిప్రతిక 25 న.పై. | **ఆంధ్రపత్రిక**<br>సచిత్ర వారపత్రిక | సంపుటము 52<br>సంచిక 46<br>9-7-58 |
|---|---|---|

**Founder : K. NAGESWARA RAO**

విలంబి ఆషాఢ బహుళ అష్టమి బుధవారం





ముఖచిత్రం :



హిందీనటి శ్యామ



# వినుము...వెంకటేశ!



ఏడుకొండలమీద వెలసియుండిన నీకు,
క్రిందనున్న ప్రజల కష్టసుఖము,
తెలియునో? తెలియదో? అనుమాన మాయెను,
వినుము చెప్పెదనీకు వేంకటేశ!

ధర లెక్కువై పోయె, ధర్మంబు ‘డౌ’ నాయె
బ్రతుకు తెరువు ‘రొంబ’ కష్టమాయె!
ధరలు తగ్గకున్న, ధర్మంబు అడుగంటు,
వినుము చెప్పెద నీకు వేంకటేశ!

డాబు తప్పకపోయె డబ్బేమొ లేదాయె
అప్పు తేకపోతే గడవదాయె!
అప్పు తెచ్చిననాడె హాతోస్మి! హాతోస్మి!
వినుము చెప్పెదనీకు వేంకటేశ!

గుడ్డలు కొనబోతె గుండెలు చెరువాయె
గుడ్డలు కొనకున్న, సిగ్గుపోయె!
ఇంటి అద్దెలబాధ యింతింత కాదోయి,
వినుము చెప్పెద నీకు, వేంకటేశ!

డబ్బు సంపాదిస్తె డబ్బు మీదను టాక్సు
పాత డబ్బువున్న ‘వెల్తు’ టాక్సు
ఖర్చు పెడితే టాక్సు! ధర్మమిస్తే టాక్సు!
చస్తే చచ్చేటాక్సు టాక్సు! టాక్సు!
ఏమి చెప్పుదు నా బాధ వేంకటేశ!



[వైలవరపు హనుమంతరావు.]

# పంచ

**కె. పార్థసారథి**

పంచఖండాలతో నిండిన ప్రపంచానికి మన ప్రధాని నెహ్రూ 'పంచశీల' సూత్రాలు మార్గదర్శకములైనవి. భారతదేశ పురోభివృద్ధి పంచవర్ష ప్రణాళికలతో నే అవిచ్ఛిన్నంగా కొనసాగుతోంది అప్పుడే మనం ద్వితీయపంచవర్షప్రణాళికను రూపొందించి కార్యక్రమాన్ని సాగిస్తున్నాం. ఇంతటి ప్రాముఖ్యం గల యీ 'అయిదు' అంకెనుగూర్చి ఎంతైనా చెప్పవలసి ఉంది.

గణితశాస్త్రంలో ప్రతిసంఖ్యకి కొంత చరిత్ర ఉంది. అందులో అయిదుకి ఒక ప్రత్యేకస్థానం, విశిష్టత ఉన్నది. ఇది ఒకశే స్థానము గల సంఖ్య ఇదిచేసి సంఖ్య ప్రైమ్ కూడాను. ప్రైమ్ అంటే ఆ అంకెచేతగాని, 1 చేతగాని తప్ప ఇంకేసంఖ్యచేత నిశ్శేషంగా భాగింపబడదు. నిజానికి అన్ని ప్రైమ్ సంఖ్యలు బేసి సంఖ్యలే రెండు ప్రైమ్‌సంఖ్యల మొత్తం మరో ప్రైమ్ సంఖ్య కానేరదు. ఈ ప్రైమ్‌కి ఎక్‌త్ టరమ్ కనిపెట్టడం గణితశాస్త్రంలో ఒక సాధించలేని సమస్య. ఇంతవరకు కనిపెట్టిన అతి పెద్ద ప్రైమ్ సంఖ్య $2^{125}—1$. ఏసంఖ్యైనా అయిదుచేత నిశ్శేషంగా భాగింపబడాలంటే ఆసంఖ్యచివర సున్నకాని అయిదుకాని ఉండాలి.

అయిదుని హిందీలో 'పాంచ్' అంటారు. సంస్కృతంలో 'పంచ' అని అంటారు. తెలుగు తిథులలో అయిదవదానికి 'పంచమి' అనిపేరు. ఈ పంచమితో ఋషి పంచమి అని ఒక పండుగ తెలుగునాట వినవస్తుంది.

పంచమవేదమైన 'భారతము'న నాయకులు పంచపాండవులు. వీరందరికీ భార్య ద్రౌపది. ఆమెకు మరియొక పేరు 'పాంచాలి' పాంచాలదేశపురాజుకుమార్తె కనుక. అంతే కాని పంచపాండవులభార్య కనుక పాంచాలి కాదు.

నమఃశివాయః అనేది పూర్వులు మననం చేసే పంచాక్షరీ మంత్రం. అయిదోఏడు రాగానే అక్షరాభ్యాసంచేసి పిల్లవానిచేత వ్రాయించేతొలిపలుకులు ఓంనమఃశివాయః. మనందరిఇళ్ళలోనూ ఉండే పంచాంగము తిథి, వారము, నక్షత్రము, యోగము, కరణము అనెడి అయిదంగముల కలయిక.

సృష్టికారకుడైన బ్రహ్మకు పంచబ్రహ్మ అనిపేరు. అశరీరుడై తన వాడితూపులచే ఇతరులయందు శృంగార వికారములను పుట్టించు మన్మథునికి పంచబాణుడని పేరు. అరవిందము, అశోకము, చూతము, నవమల్లిక, నీలోత్పలం—పంచబాణాలు.

సంస్కృతములో ఒక ఉద్గ్రంథము పేరు పంచతంత్రము—మిత్రలాభము, మిత్రభేదము, సంధి, విగ్రహము, అసంప్రేక్ష్యకారిత్వము. ఇవి అందులోని భాగములు. ఏ దిక్కూ లేనివానికి దేవుడే అయిదో దిక్కు.

తెలుపు—అనేకరంగుల కలయిక అని భౌతిక శాస్త్రవేత్త 'న్యూటను' సిద్ధాంతము—కాని పంచవర్ణాలు అని మన ప్రాచీనులు—తెలుపు, ఎఱుపు, నలుపు, ఆకుపచ్చ, పసిమి రంగులను ఊహించారు. పంచరంగులకీ, సప్తరంగులకీ ఉన్న సంబంధము అనూహ్యము. పంచరంగులు, చీరరంగులు—చెప్పక్కరలేదు - రకరకాల రంగులు.

ప్రపంచంలో ప్రతివ్యక్తిచేత వేనోళ్ళ మన్ననల నందుకుంటున్న మన ప్రధాని ప్రవేశపెట్టిన పంచశీల సూత్రాలు అయిదు. ఈ పంచశీలను కొందరు పంచశిల అనికూడా వ్రాశారు. మనం పంచవర్ష ప్రణాళికలను అమలు జరుపుకొనడం నిజంగా గమనింపదగది. త్రివర్ష ప్రణాళికలో, చతుర్థవర్ష ప్రణాళికలో జరుపుకొనక పంచవర్ష ప్రణాళికలను ప్రవేశపెట్టడంలోనే ఉంది మన ప్రత్యేకత. మన 'రాష్ట్రపతి' నిర్ణీతకాలం అయిదు సంవత్సరాలే. మనదేశంలో అయిదేళ్ళ కొకసారి ఎన్నికలు జరుగుతున్నాయి. పంచఖండాలతో నిండిన ఈ ప్రపంచములో అగ్రరాజ్యాలు అయిదు. ఇదివరలో ఈ అగ్రరాజ్యాలు అమెరికా, రష్యా: బ్రిటన్, ఫ్రాన్సు, జాతీయ చైనా.

కావ్యాలలో రఘువంశం. కుమార సంభవం, మేఘసందేశం, మాఘం, భారవి-పంచకావ్యాలు. చక్రం, శంఖం, గద, ఖడ్గం శార్ఙ్గము - శ్రీ మహావిష్ణుని పంచాయుధాలు. కావేరి, తుంగభద్ర, కృష్ణ, గౌతమి, భాగీరథి - పంచగంగలు. భూమి, నీరు, ఆకాశము, తేజస్సు, వాయువు అనేవి పంచభూతాలు. పంచభూతాలచేత పరివేష్టితుడైన మానవునకు పంచేంద్రియములున్నవి. వీటినే జ్ఞానేంద్రియములని కూడ అనటం పరిపాటి. అవి ఘ్రాణము, రసనము, చక్షువు త్వగింద్రియము, శ్రోత్రేంద్రియము. కర్మేంద్రియములుకూడా అయిదే. సామాన్య మానవుని కరచరణాలకి అయిదేసి వేళ్లుంటాయి.

ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము,—పంచప్రాణాలు.

మానవుని జీవితములో బాల్యము, యౌవనము, కౌమారము, వృద్ధాప్యము పిదప అయిదవ దశ అయిన మరణమునకు పంచత్వమని పేరు.

స్వర్ణస్తేయము, సురాపానము, బ్రహ్మహత్య, గురుపత్నీ గమనము, దుష్టసహవాసము. — పంచమహాపాతకములు.

మృగరాజుకు మరియొక పేరు పంచాననము.

ఉదకము, పాలు, పెరుగు, నేయి, తేనె- పంచామృతాలు. కృష్ణపక్ష అష్టమి, కృష్ణపక్ష చతుర్దశి, అమావాస్య, పౌర్ణమి, సంక్రాంతి — పర్వదినములు.

భక్ష్యము, భోజ్యము, లేహ్యము, చోష్యము, పానీయము - పంచభక్ష్యములు.

గోమూత్రము, గోమయము, గోఘృతము, గోదధి, గోక్షీరము, పంచగవ్యములు.

రాణి, వదిన, గురుపత్ని, భార్య తల్లి, తన్నుగన్న తల్లి—జననిగా పరిగణింపదగవారు.

పంచముఖేశ్వరరావు - ఒకని పేరు.

ఇంకా పంచమహాసముద్రాలు, పంచరత్నాలు, పంచరాగాలు, పంచలోహాలు, పంచాగ్నులు - కోకొల్లలు.

ఉపనయనంలో వడుగుకు పంచసిగలుంచేవారు. పెళ్ళయిన వ్యక్తిఅయితే అతని యజ్ఞోపవీతంలో పంచ సూత్రాలుంటాయి. పూర్వం పెళ్ళిళ్ళు సావధానంగా అయిదు రోజులూ జరిగేవి. - ఇప్పుడు ఒక్కరోజు కూడా అక్కరలేదు.

గ్రామ పారిశుద్ధ్యానికి, క్రమశిక్షణ, న్యాయరక్షణకి పాటుపడేవారు పంచాయితీ మెంబర్లు.

వస్త్రధారణకుపయోగపడే పంచలు అనేకరకాలు - నైనుపంచలు, లుంగీపంచలు, పొత్తుపంచలూ.

గణితంలోను, చరిత్రలోను, సారస్వతంలోను, సాహిత్యంలోను, సమాజంలోను, సాంఘికంగాను, రాజకీయంగాను, నాగరికంగాను ఇందుగల దందు లేదని ఎందెందు వెదకిన అందందే కనిపించెడి ఈ 'పంచ'లో ఏమహాత్యం, గొప్పదనం ఇమిడి ఉందోకదా! ★

# న్యూఢిల్లీ లేఖ

# కె. సి. నియోగి పదవీ విరమణం

న్యూఢిల్లీలో మళ్ళీ రద్దీ ఎక్కువవుతోంది. ప్రధానమంత్రి సెలవు నుంచి తిరిగి రావటంతో చాలామంది మంత్రులు కూడా ఢిల్లీ చేరుకుంటున్నారు.

రెండువారాల పాటు ఢిల్లీలో కొంత చల్లబడింది. ప్రాణం తెరిపిన పడింది. కాని వానలు కురిసేదాకా వడగాడ్పులు తగ్గవు. మరో రెండు వారాల్లో వానలు కురవచ్చు.

హంగరీ అంతరంగిక వ్యవహారాల్లో జోక్యం చేసుకోరాదంటూ హంగేరియన్ రాయబార కార్యాలయం పంచశీలను ఉదహరించింది. శాంతి రకరకాలుగా ఉంటుంది. శ్మశానశాంతి అనేది ఇందులో ఒక రకం. హంగరీ మాజీ ప్రధాని ప్రస్తుతం శ్మశాన శాంతి అనుభవిస్తున్నట్లున్నారు. ప్రత్యర్థులను నిర్మూలించటం కూడా శాంతికి ఒక మార్గం కాబోలు.

ఈ వివాదాస్పద రాజకీయ ప్రచారాలలా ఉంచి, ఢిల్లీలో ఈ గ్రీష్మకాలపు భిన్న పరిస్థితుల్ని కొన్నిటిని పరికిద్దాం. విదేశీ ద్రవ్యపు కొరతమీద కనబడని యుద్ధం లాంటిది జరుగుతోంది. ఈ కొరతకు బాధ్యులెవరో తేల్చేందుకు బాగా విచారణలాంటిది జరపకుండా ఉండటంలో ప్రభుత్వం తెలివైన పనే చేసింది. అలాంటి విచారణే జరిపిస్తే ఎలాంటి దారుణ సత్యాలు బయటపడేవో? ఈ సారి ఏ పెద్ద తలకాయలు కిందపడేవో! ఒకటి మాత్రం జరిగింది: రెండో పంచవర్ష ప్రణాళికను వ్యతిరేకించి అందరికీ అయిష్టులైపోయిన శ్రీ కె. సి. నియోగి రంగంనుంచి విరమిస్తున్నారు. ఈయన అయిదేళ్లనుంచీ ప్లానింగ్ సంఘంలో సభ్యులుగా ఉన్నారు. 37 ఏళ్ల రాజకీయ జీవితానికి కొద్దిరోజుల్లో ఆయన భరతవాక్యం పలుకుతున్నారు.

నాంది వాక్యం 1921 లో ప్రారంభమైంది. వృత్తిరీత్యా లాయరు. 1921 లో కేంద్ర శాసనసభలో ప్రవేశించారు. స్వతంత్రుడుగా ప్రవేశించి, చివరిదాకా స్వతంత్రుడుగానే ఉండిపోయారు. రైల్వే ఆర్థిక, పరిపాలన విషయాల్లో శ్రీ నియోగి ప్రామాణ్యం సంపాదించారు. బొగ్గుపరిశ్రమ సమస్యలు కూడా ఆయన అభిమాన సమస్యలు. ప్లానింగ్‌లో మంచి దిట్ట. 1946 సెప్టెంబరు 26న పండిట్ నెహ్రూ వేవెల్ ప్రభుత్వంలో చేరుతూ ఏర్పాటు చేసిన ప్లానింగ్ సలహా సంఘానికి శ్రీ నియోగి అధ్యక్షులయ్యారు. ఆ తరువాత మొదటి ఫైనాన్సు సంఘానికి అధ్యక్షులయ్యారు. అక్కణ్ణించి ప్లానింగ్ సంఘంలో కొచ్చారు. ఈ రెంటి మధ్యకాలంలో పునరావాస శాఖకు, వాణిజ్యశాఖకు మంత్రిగా పని చేశారు.

ప్లానింగ్ సంఘంనుంచి ఆయన తనంతట తనే మానేస్తున్నారు. సభ్యత్వానికి రాజీ

**శ్రీకృష్ణ**
[ ఆంధ్రపత్రిక ప్రతినిధి ]

నామా ఇచ్చారు. ప్లానింగ్ విధానాలతో రాజీపడలేకనే రాజీనామా ఇచ్చినట్లున్నది. రెండో ప్రణాళికలోని లోపాలను ఆయన విమర్శించి దేశానికి సేవచేసినా, ఆయన సేవను ఎవరూ హర్షించిన పాపాన పోలేదు. అందుచేతనే శ్రీ నియోగి బహుశా తప్పుకోటం మంచిదనే నిస్పృహలో పడిఉంటారు. సరిగా ఆయన జోస్యం చెప్పినట్లే, రెండో ప్రణాళిక మూలంగా భారతదేశం దివాలా తీయటానికి సిద్ధంగా ఉంది. కంపాలిని కసురుకుని వ్రడంగిని వహ్వా అన్నారు. అలా ఉంది శ్రీ నియోగి నిష్క్రమణం. ఇప్పట్లో శ్రీ నియోగి మళ్లీ ఉద్యోగి కావాలనుకోవటం లేదు.

## చప్రాసీలు

కేంద్రప్రభుత్వంలో క్రమంగా అంతరించిపోతున్న చప్రాసీల జాతిని చూస్తే నాకదొక వింతైన ఆకర్షణ. భారతదేశాన్ని పంజాబీలు, మద్రాసీలు, చప్రాసీలు పరిపాలిస్తున్నారని ఒక జోక్ ఉండేది. ఈ తరప్రజలు వచ్చి మిగతా వారందరికీ ప్రమాణం పఠించటానికి ముందు రోజుల్లో మాట. ఈ రోజుల్లో ప్రతి కాంగ్రెసువాడికీ కేంద్ర మంత్రిపదవి చేతికొచ్చిన ఇంద్రపదవి అయినట్లే, ఆ రోజుల్లో ప్రతి చప్రాసీకీ జమేదారు కావాలనేది జీవితాశయంగా ఉండేది. జమేదార్ల జీవితాశయం హోంశాఖ మంత్రికి జమేదారు కావటం. ఎందుకంటే హోంశాఖ జమేదారు జమేదార్లందరికీ నాయకుడు. కార్యదర్శుల స్థాయిలో చూస్తే విదేశాంగ, రాజకీయశాఖల కార్యదర్శులదగ్గర ఉండే జమేదార్లు మిగతావాళ్ళకంటే గొప్పవాళ్లుగా పరిగణించబడేవారు. రాజకీయశాఖ కార్యదర్శిదగ్గరుండే జమేదారు ఎంతగొప్ప మహారాజా వచ్చినా సూటిగా కళ్ళలోకి చూసేటంత ధైర్యంగా ఉండేవాడు. ఇప్పుడూ జమేదార్లు ఉన్నారు. కాని వాళ్ల పూర్వవైభవాలుగు ఆరిపోయింది.

బిహారీలాల్ అనే వృద్ధచప్రాసీ ఒకనాడు రిటైరయ్యాడు. 1926 లో ఇతడు ఉద్యోగంలో ప్రవేశించాడు. వాణిజ్యశాఖలో ఇతని కళ్ళ ఎదుట ఎందరు అధికారులో మారారు. ఐ. సి. ఎస్. వాళ్లని ఇతడు బాగా ఎరుగును.

రాజకీయ నాయకులు, ఇతర ఉన్నతాధికారుల మాదిరిగా కాక, చప్రాసీలు తమ ఉద్యోగవిరమణని పొడిగించమనీ, లేక తాత్కాలికోద్యోగం ఇమ్మనీ అడగరు. రిటైరు కాగానే మూటాముల్లె సర్దుకుని ఇంటికి పోతారు. వాళ్లలో మంచి హుందాతనం కనిపిస్తుంది. వాళ్ల జాతి క్రమంగా అంతరిస్తోంది. వాళ్ళ స్థానంలో ట్రేడ్ యూనియనిస్టులు ప్రవేశిస్తున్నారు.

## చెప్పేదొకటి, చేసేదొకటి

ప్రభుత్వం సరిగా వ్యవహరించటం లేదని యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమీషన్ తరుచు విమర్శిస్తూ ఉంటుంది. ఒక చిన్న ఉదాహరణ చెబుతాను.

కేంద్ర విద్యాశాఖకు మరి కొంతమంది

 న్యూఢిల్లీ లేఖ 

తల జాబితాతోసహా ప్రకటనలు వేశారు. అయిదువందల దరఖాస్తులు వచ్చాయి. అయిదువందలమందీ దరఖాస్తుదారిణులే. వీరిలో రెండుసార్లు పిహెచ్. డీ. లైన వారు: అమెరికాలో బ్రిటన్‌లో రిసెర్చి చేసినవారూ ఉన్నారు. తర్కశాస్త్రంలో హిందీ ఎమ్మే ప్యాసైన అమ్మాయికూడా దరఖాస్తు పెట్టింది. ఆమె సి. బి. రావు సతీమణి. ఆమె దరఖాస్తును చూస్తూనే తీసిపారేశారు. దరిమిలా ఆవిణ్ణి ఇంటర్వ్యూకు పిలిచారు. ఎందుకో పరమాత్మకే ఎరుక. మొదటిసారి ఇంటర్వ్యూలో ఆమెను నిరాకరించారు. రెండోసారి ఇంటర్వ్యూలో ఆమెను సెలెక్టుచేశారు. ఫస్టుక్లాసు ఎమ్మేలు, డబుల్ పిహెచ్. డి. లు ప్యాసైనఅమ్మాయిల్ని పొమ్మన్నారు. ఏ అర్హతలు ఆధారంగా దరఖాస్తులు పెట్టుకోమన్నారో ఆ అర్హతలన్నీ ఆ అమ్మాయికి ఉన్నాయా, ఆమెను ఏ కారణంచేత సెలెక్టుచేశారూ అని ఇప్పుడు విద్యాశాఖ సర్వీసుకమీషన్‌ను అడిగింది. కమీషన్ నాటి సమాధానం ఇంకా రాలేదు!

## పురపాలకసంఘం కథ

"స్వానుభవమున చెప్పుచున్నను వినుడు." పార్లమెంటు స్ట్రీటులోని మూడు ఇళ్ళవారు ఏ. సి. ఎలక్ట్రిసిటీకోసం దరఖాస్తు పెట్టుకున్నారు. ఎలక్ట్రిసిటీ కొరత ఇంకా ఉండటంచేత ఈ దరఖాస్తులు మంజూరు చేసే భారం ఢిల్లీ రాష్ట్ర విద్యుచ్ఛక్తి కంట్రోలు బోర్డు వహించింది. ఖర్చు అంచనాలు తయారుచేసి, ఒక మునిసిపల్ ఉపసంఘంచేత ఆమోదింపజేసి, మెయిన్ తీగలను, అందులోంచి ఇళ్ళల్లోకి కనెక్షన్ తీగల్నీ వేయించటానికి పురపాలక సంఘం ఆమోదం కూడా పొందాలి. తరవాత వీటికెంత ఖర్చు అవుతుందో దరఖాస్తుదారులకు చెప్పాలి. సెక్యూరిటీగా కొంత డబ్బు కట్టాలి. ఇదంతా అయ్యేటప్పటికి కనీసం ఆరు నెలలు పడుతుంది. ఎలాగైతేనేం ఈ కార్యక్రమం అంతా అయింది. కనెక్షన్ ఇచ్చేరోజు దగిరికి వచ్చింది. జూన్ 14 శనివారం నాడు పార్లమెంటు స్ట్రీటులోకి కార్మికుల తండా ఒకటి వచ్చింది. తీగలు వెయ్యటానికి గోతులు త్రవ్వటం మొదలుపెట్టారు. ఎండ నిప్పులు చెరుగుతోంది. త్వరలోనే కార్మికులు అలిసిపోయారు. వారు ఎండదెబ్బనుంచి కోలుకోవటానికీ, పని పూర్తిచేయటానికి ౮ రోజులు పట్టింది.

న్యూఢిల్లీ పురపాలకసంఘం ఆధునిక సంస్థ కనుక పని చేయించటంలో కొత్త పద్ధతులు ప్రవేశపెట్టింది. విద్యుచ్ఛక్తిసరఫరా పనిలో తీగలు వేసేది కొందరు, తీగల్ని స్విచ్‌బోర్డులకు కలిపేది మరికొందరు, మీటర్లు ఏర్పాటుచేసేది ఇంకొందరు, నీటి బోయిలర్ల పనిచూసేది వేరేకొందరు - ఇలా పనిజరుగుతుంది. కాని స్విచ్‌బోర్డుకు తీగల్ని కలిపే కార్మికబృందం ఎందుకనో ఈ మధ్య పనిచేయటం లేదు. జూన్ 20 శుక్రవారం మరో కార్మికుల తండా రంగంలోకివచ్చి పర్మనెంట్ తీగలు వెయ్యటానికి పట్టేంత కాలం తీసుకుని తాత్కాలికంగా తీగలు ఏర్పాటుచేశారు. అయితే వీరికి మధ్యలోనే అలసట వచ్చింది. అందుకని పని పూర్తి చెయ్యకుండానే ఇళ్ళకుపోయి విశ్రాంతి తీసుకున్నారు.

జూన్ 22 మధ్యాహ్నం మీటర్లువేసే మనిషి తొందరగా వచ్చాడు. డి. సి. తీగలు, డి. సి. మీటర్లు తీసేసి ఏ. సి. మీటర్లు పెట్టి అంతర్థానుడైపోయాడు. అతడు వెళ్ళిన తర్వాత చూస్తే ఏ. సి. తాత్కాలికపు తీగల్ని సరిగా వెయ్యకపోటంచేత అవి పనిచేయటం లేదని తెలిసింది. మొత్తం ఈ పనంతా చేయించే అధికారి గృహయజమానితో 'ఈ ఒక్క రాత్రికి కాస్త ఇబ్బందిపడితే రేపొద్దున కరెంటు తెప్పించి పెడతాను' అని చెప్పి ఓదార్చాడు. ఏ. సి. విద్యుచ్ఛక్తిరాకపోగా, ఉన్న డి. సి. విద్యుచ్ఛక్తికూడా పోయింది. అయితే న్యూఢిల్లీ పురపాలకసంఘంలో ఇంకా పాతవాళ్లు కొందరున్నారు. వారిలో ఒకాయన జాలిపడి ఆ రాత్రికే ఏ. సి. విద్యుచ్ఛక్తి ఇంట్లోకివచ్చేలాచేసి సహాయపడ్డాడు. ఇది న్యూఢిల్లీ పురపాలకసంఘం కథ.

## ఢిల్లీ పార్కుల వ్యథ

ఇక నగరోద్యానవనాల కథ చూదాం. న్యూఢిల్లీలో పార్కులు 'నానాటికి తీసికట్టు నాగంభొట్లు' అన్నట్టు తయారవుతున్నాయి. ఈ విషయాన్ని వార్తాపత్రికలేకాదు సాక్షాత్తు పురపాలకసంఘం కూడా గుర్తుపట్టింది. సచివాలయంలో మటుకు పూలకుండీలను రెండుచేత హెచ్చువేస్తున్నారు. ముఖ్యంగా ప్రధానమంత్రి కూర్చుని పని చేసుకుంటారే, విదేశాంగ కార్యాలయం— అందులోకి పోయే దోవనిండా, ఆహా, ఏమి మొక్కలు, ఏమి పూలు! మామూలుగా పార్కుల ఆరోగ్యాన్ని కాపాడవలసిన తోటమాలీ మహాశయులు, ఆ పని ఎగేసి, పూలకుండీలను అక్కడివిక్కడ, ఇక్కడివక్కడ మార్చటంలో మునిగి ఈతకొడుతున్నారు. ప్రజల సౌకర్యంకోసం వేసిన పార్కులు ఎటా మట్టికొట్టుకు పోతేనేం, మంత్రిసత్తములు 'ఏమి ఈ తోటమాలీల శ్రద్ధ, ఏమి వీరి స్వామి భక్తి' అని మెచ్చుకుంటే చాలని వారి తాపత్రయం.

పార్కులను ఇలా పాడుపెట్టడానికి మరొకటికూడా కారణమై ఉంటుంది. పూలమొక్కల పెంపకంశాఖ డైరెక్టరు పెర్సీ లాంకాస్టర్ రాజీనామా ఇచ్చి ఏడాదైంది. ఆ ఖాళీని భర్తీచేయటానికి ఇప్పటికి రెండుసార్లు అడ్వర్టయిజ్ చేశారు. లాంకాస్టర్ రాజీనామా చేసినప్పటి నుంచీ ఆ ఖాళీలో తాత్కాలికంగా వ్యవహరిస్తున్న శ్రీ జె. బి. మధుర్ అనే ఆయన కూడా ఆ ఉద్యోగానికి దరఖాస్తు పెట్టుకున్నాడు. యూనియన్ పబ్లిక్ సర్వీస్

(46-వ పేజీ చూడండి)

# ఆంధ్ర సచిత్రవారపత్రిక బాలల సంఘం

ఆంధ్ర సచిత్ర వారపత్రికలో 1958 జులై 1-వ తేదీ నుంచి 'బాలలసంఘం' స్థాపించాము. జులై 1-వ తేదీ నాటికి 15 సంవత్సరాలవయస్సు నిండని, ఆరేళ్ళ వయస్సుకు తక్కువ గాని ప్రతి తెలుగు బాలుడూ, బాలికా సభ్యత్వం పొందవచ్చు. సభ్యత్వానికి రుసుమేమీ చెల్లించవలసిన పనిలేదు. తెలుగు బాలబాలికలందరూ వెంటనే సభ్యులుగా చేరి, సచిత్ర వారపత్రిక అప్పుడప్పుడు నిర్వహించే చిన్న చిన్న పోటీలలో పాల్గొని "సంఘం" ఆశయాలను జయప్రదం చేయడానికి సహాయపడతారని ఆశిస్తున్నాము.

## గమనిక

పదకొండు మొదలు 15 సంవత్సరాలవరకూ వయస్సుగలవారిని 'A' వర్గంగానూ, ఆరు మొదలు 10 సంవత్సరాల వయస్సువరకూ గల వారిని 'B' వర్గంగానూ విభజించడం జరుగుతుంది

## ముఖ్య విషయాలు

సభ్యులుగా చేరదలచిన బాలబాలికలు చేయవలసిందొకటే. దీనితోపాటు ఒక సభ్యత్వపు దరఖాస్తును ముద్రిస్తున్నాము అందులోని ఖాళీస్థలాలను మీ వివరాలతో జాగ్రత్తగా నింపి (కొట్టివేతలు, దిద్దుపులు వుండకూడదు.) ఆ అచ్చు దరఖాస్తును తిన్నగా కత్తిరించి కవరులో

సంపాదకుడు,
ఆంధ్ర పత్రిక సచిత్రవారపత్రిక,
తంబుచెట్టివీథి, మద్రాసు-1.

అనే చిరునామాకు పంపాలి. కవరుమీద వెనుకవైపు "సచిత్ర వారపత్రిక బాలల సంఘం" అని స్పష్టంగా వ్రాయాలి. మామూలు కాగితాలమీద వ్రాసిపంపే దరఖాస్తులను స్వీకరించము.

ఒక్కొక్క దరఖాస్తుమీదా ఒక్కొక్క సభ్యుని, లేదా, సభ్యురాలి పేరుమాత్రమే వుండాలి. సభ్యత్వపు దరఖాస్తును సచిత్ర వారపత్రికలో సాధ్యమైనంతవరకు వారం వారం ప్రచురిస్తుంటాము.

సభ్యులుగా చేర్చుకున్నట్లు ఒక్కొక్కరి పేరా విడివిడిగా ఒక్కొక్క సభ్యత్వపు కార్డును పంపుతాము ఆ కార్డుమీద సభ్యత్వ క్రమాన్ని సూచించే ఒక సంఖ్య వుంటుంది. ముందు ముందు సభ్యులుగాని, సంఘంగాని జరిపే ఉత్తర ప్రత్యుత్తరాలలో ఆ సంఖ్యను ఉదహరిస్తుండడం జరుగుతుంది.

పదిహేనేళ్ళ వయస్సు తీరిపోగానే, ఆ తేదీతో బాలల సంఘంలో సభ్యత్వం దానంతటదే రద్దయిపోతుంది.

## లక్ష్యాలు

(1) సభ్యులుగాచేరే బాలబాలికలను ఆరుమొదలు పదేళ్ళవరకూ ఒక వర్గంగానూ, (B), పదకొండు మొదలు పదిహేనేళ్ళ వరకూమరొకవర్గంగానూ (A), విభజించిఉభయ వర్గాలకూ విడివిడిగా అప్పుడప్పుడు రెండురకాల పోటీలు నిర్వహించి ప్రథమశ్రేణిలో నెగ్గేవారికి మాకుతోచిన బహుమతుల నివ్వడం. (ఈ విషయంలో పోటీనిర్వహణకర్తలదే తుదినిర్ణయం)

(2) సభ్యులలో వారివయస్సుకు తగినట్లుగా రచనాసక్తినీ, పఠనాసక్తినీ, కళాభిమానాన్నీ యథాశక్తి పెంపొందచేయడం.

(3) చిత్రలేఖనం, నృత్యం, అభినయం, గాత్రం వీణ, వయొలిన్ మొదలయిన లలిత కళలలోనూ, వ్యాయామక్రీడలలోనూ ప్రత్యేక అభిరుచీ, ప్రవేశం కనబరిచే బాలబాలికలను బహుమతులద్వారానూ, తదితర విధంగానూ ప్రోత్సహించడం

(4) ఏ ప్రాంతంలో నివసిస్తున్నవారైనప్పటికీ తెలుగు బాలబాలిక లందరిమధ్యా స్నేహ సమైక్యభావాలను పెంపొందజేయడం

(5) ఉన్నత పాఠశాలలలో చదివే విద్యార్థులకు ఉచిత విద్యార్థివేతనాలను బహూకరించడం. (దీనికి సంబంధించిన వివరాలను ముందుముందు ప్రకటిస్తాము) ★

---

ఆంధ్ర సచిత్ర వారపత్రిక
**బాలల సంఘం**
[సభ్యత్వపు దరఖాస్తు]

GROUP
**A లేక B**

సభ్యుని (సభ్యురాలి) పూర్తిపేరు (విడివిడి అక్షరాలలో) ....

ఏండ్లు : నెలలు :

పుట్టినతేదీ, నెల, సంవత్సరం : జులై 1 నాటికి వయస్సు ....

తండ్రి, లేక, సంరక్షకుని పూర్తి పేరు ; ....

ఊరిపేరు, జిల్లా, తాలూకా, పోస్టు [వీధి: నెంబరు] ....

* చదువుతున్న తరగతి, లేక, ఫారము ; ....

పాఠశాల పేరు ....

ప్రధానోపాధ్యాయునిపేరు (తెలిస్తే) :

ఆర్యా :

ఆంధ్ర సచిత్ర వారపత్రిక బాలల సంఘములో నన్ను సభ్యునిగా/సభ్యురాలుగా చేర్చుకొన ప్రార్థన. పైన వ్రాసిన విషయాలన్నీ యదార్థములు.

ఇట్లు

[తేదీ : -1958]

(సంతకము)

* పరా : ఏ పాఠశాలలోనూగాక ఇంటివద్దనే ట్యూషన్ చెప్పించుకొనే బాలబాలికలు కూడా సభ్యులుగా చేరవచ్చు, 'చదువుతున్న తరగతి' అనే విషయానికి ఎదురుగా 'ప్రైవేట్ స్టడీ' అని వ్రాయాలి.

సంచిక: **9-7-58** | ఈ దరఖాస్తు **12-7-58** నాటికి మాకు చేరాలి



పరిచయం

రూపమతి, బాజబహద్దూరు, వీరి ప్రేమగాథ ఆదర్శప్రాయమైనట్టిది. మాళవదేశపు గాథ—గాథేమిటి, చరిత్రే. రూపమతి సంగీత సాహిత్యాల్లో అధిక కృషిచేసి సాహిత్యానికి అఖండ సేవచేసిన వ్యక్తి. ఈమె వ్రాసిన గీతాలూ, పాడిన పాటలూ, నాటినుండి నేటివరకూ ప్రజావాహాళ్యంలో అమితమైన కీర్తిని అర్జించుకొంటూవున్నవి. మీరాబాయి పాటలలాగే ఈమె వ్రాసిన పాటలు ప్రతివారి రసనపైన తాండవిస్తూ వుంటయ్—బాజబహద్దూరు గొప్ప సంగీతవేత్త, కవికూడాను. మాండూ అనే నగరానికి చెందినవారు వీరు. రూపమతి శీలం సీత, అనసూయ, అరుంధతులవలె లోకంలో వాసికెక్కింది—రూపమతి బాజబహద్దూరుల ప్రణయానికి పాశ్చాత్యులే ముగ్ధులయ్యారు. పాశ్చాత్యసందీతులు ఈ చరిత్ర రచించి, రూపమతి గేయాలను ఆంగ్లానువాదంకూడా చేశారు. లోకప్రసిద్ధమైం దీ గాథ—

గుణవతి రూపమతి
నిరుపమాన సతి
కళా సరస్వతి.
నీ పాటలు, నవనవ
మధువులు కురిసే
దివ్యవనులు... ॥ గుణ ॥

నీ ప్రణయం-నీహోరాద్రి తనుజ
పాదప్రక్షాలిత దివ్యలాతు...
॥ గుణ ॥

నీ కంఠం కుసుమశరుని కోదండం
ఇక్షుశరుని అక్షయతూణీరం.
॥ గుణ ॥

*　　*　　*

రూప: బాజా, ఈ సంధ్యాకాంతులు ఎంత రమణీయంగా ఉన్నాయో చూడండి!

బాజ: నీ అధర రాగంకంటె సంధ్య ఏమంత బాగుంది?

రూప: మీకు యమన్ రాగం అంటే ఎంతో యిష్టంకదూ. ఆ రాగం ఏ అప్సరస్త్రీయో ఆలాపిస్తే స్వర్గాన్ని ఖాళీచేసి, ఆకాశాన్ని పరుగులు గట్టింది.

బాజ: మనస్సు రాగరంజితమైతేగాని గొంతు శ్రుతిపక్వం కాదు.

రూప: నా వీణ అట్లుకాదు. ఎప్పుడూ మనస్సుని ఒక రాగంమీద లగ్నంచేసుకొని, పలికిన సంగతి పలుకకుండా అనంతరీతుల్లో ఆలపిస్తుంది.

బాజ: నీ దంతపు వీణమీటిన పురాకృత సుకృతంచేత చేయబడినది. నీవు ధన్యవు. స్పృశించవా!

రూప: అదిగో సంధ్యాకాంతులు లేత గులాబిరేకలా పరిమళాలుకూడా విరజిమ్ముతున్నాయి.

బాజ: అంచేతనే కాబోలు నీ దంతపు చెక్కిళ్లు నొక్కులు పోతున్నాయి!

రూప: నాకు సంధ్య అంటే ఎందుకింత యిష్టమో తెలుసా? ఒకానొక అసుర సంజలో అమునిమేళ మీ దర్శనం నాకయింది, మీయందు నా హృదయం లగ్నమయింది, ఆనాడే నా అయిగుణరేఖం ఆకాశంమీద కుంకుమెండ పోతుంది.

బాజ: కాదు, నీతోనే కలుపుకున్న రక్తసంబంధం.

రూప: తురుష్కులు, పరపురుషుడూ అయిన మిమ్ములను రెప్పవాల్చక చూచినందుకు నా చెలికత్తెలు మా తండ్రితో చెప్పి నాకు మరణదండన విధించేటట్లు చేశారు.

బాజ: అయితే బ్రతుకుతీసే బడబానల మందామా యీ సంధ్యను?

రూప: ఎంతమాటన్నారు! మా వృద్ధ మంత్రి నా లావణ్యంచూచి, కారుణ్యం వహించి మా తండ్రితో యీమె వసంత లక్ష్మి, ఆమని ప్రవేశిస్తున్న ఈరోజైన యీమెను బ్రతకనివ్వండి అన్నాడు.

బాజ: ప్రేమ బ్రతుకు చీల్చుకొని పైకుబుకుతుంది. ఆ బాధ్యత వ్యక్తులమీద ఉండదు - వ్యక్తులను ఎందుకో నిందించి హింసించడం?

రూప: పైగా మీరు తురుష్కులని.

బాజ: నీవా హిందూ స్త్రీవైతివి.

రూప: మతం మానవ జీవితాన్ని మహిమాన్వితం చెయ్యాలిగాని, వ్యక్తిహింసకు దిగకూడదు.

బాజ: హృదయాలకి మతాలుండవని తెలియదు.

రూప: మనస్సులు కలిసినచోట మతాలకు, కులానికి తిలోదకాలె!

బాజ: కామితానికే కాదు మోక్షానికీ, స్త్రీ నిశ్రేణిలాంటిది పురుష జీవితానికి.

రూప: స్త్రీ హృదయానికి ప్రేమించిన పురుషుడు అద్దంలాంటివాడు, స్త్రీ నిజస్వరూప సందర్శనం చేసుకోనేందుకు.

బాజ: కవులకు, గాయకులకు, కళాకారులకు సర్వసంగపరిత్యాగం చేసిన యోగులకు కులం మతం ఏమిటి?

రూప: ఎవరి ఆత్మసందర్శనం వారు చేసుకునేందుకు, ఆటంకాలు కల్పిస్తే, తండ్రివనీ, తల్లివనీ, బంధనాలు తెంచుకుంటుంది, ఎంతటి అభిమానమున్నా.

బాజ: తండ్రికూడా ఒకప్పుడు యువకుడనని పురుషుడనని, మరిచిపోతాడు, తండ్రి తనం వచ్చాక.

రూప: అపురూపంగా కని, ముద్దుగా పాలి, గోముగా పెంచి, పెండ్లివిషయం వచ్చేసరికి, యింత క్రౌర్యం చూపెడతారెందుకు చెపుమా తల్లిదండ్రులు!

బాజ: మతం, సంఘం కట్టిన గోడల మధ్య ఎన్నెన్ని హృదయాలు ప్రవహించలేని నదుల్లా, ఘూర్ణిల్లుతున్నాయో తెలుసుకున్న వారెవరి?

రూప: హృదయము త్తరించు కొని ఆకాశగంగలా అవతరించిన ప్రణయప్రవాహానికి ఇవన్నీ నిలుస్తాయా? గంగాభవాని మన ప్రణయానికి జీవన ప్రదాత అని మీకు తెలియదనుకుంటా.

బాజ: నాకుకూడా గంగచేసిన మేలు తల్లికూడా చేయలేదు. గంగమ్మ తల్లికి నా కైమోడ్పు.

రూప: నన్ను చెరమంచి, ప్రత్యూష కాంతులు వచ్చేసరికి ప్రాణాలు విడిచేం

శ్రీరంగం నారాయణబాబు

 

# రూపమతి



డుకు సిద్ధంకమ్మని చెప్పి మా తండ్రి వెళ్ళి పోయాడు. కంటికిమంటికి ఒకటే ధారగా రాత్రంతా ఏడుస్తున్నాను. కావలివారు ప్రాణంమీద తీపిచేత కామోసు అని అనుకున్నారు. ఆ రోదించడం మీ సమాగం కోసం అని వారికేమి తెలుసు! అర్ధరాత్రి దాటాక, రేవా నది వృద్ధముతయిదువ వేషంలో వచ్చి హృదయగగన చుంబితయై అభయమిచ్చింది.

బాజ్: అదే రాత్రి అదే సమయానికి సుషుప్తిలో స్వప్నసుందరియై రేవానది, నీవు ఆపదలో ఉన్నావని, నన్ను ప్రేమిస్తున్నావని, ఉదయభానుడు తోచక ముందె రక్షించమని చెప్పబట్టేకదా. అర్ధరాత్రి మీ తండ్రితో పోరి, నిన్ను చెరబాపి, నేనిక్కడకు తెచ్చుకున్నది.?

రూప: జ్ఞాపకముందా, మా తండ్రిని మీరు జయించాక రెండు శ్వేతవర్ణపు అశ్వాలమీద, మీ రాజ్యంలో దినోదయ వేళకు గృహప్రవేశం చేశాం? చెంగావి దాల్చినముగ్ధప్రణయినిలా, మౌనప్రత్యూషం మనకు బరాబరు లిచ్చింది. అందుకే, ఈ సంధ్యాకాంతులకు నా జీవితానికి ఏదో ఒక అవినాభావముంది.

బాజ్: అందుకే నీవన్నా సంధ్య అన్నా నేను ప్రేమించకుండా ఉండలేను.

రూప: ఈ కాంతుల రక్తచందనంలా వంటికి పూసుకోనా లేక మందారులా, శిరోజాల్లో దాచుకోనా?.

బాజ్: అప్పుడు, నీ శిరోజాలతో నా ముఖాన్ని కప్పుకొని మందార మధువు రుచిచూస్తా.

రూప: ఈ అనంత సంధ్యా రాగాన్ని నా మునివేలితో అంటె, లలాటాన, చిన్న కుంకుమబొట్టులా ధరిస్తా — కాలవిశాల విహాయసాన్న ఆచంద్రతారార్కం నాసీమంతినీత్వం నిలిచిపోయేట్టు.

బాజ్: గగనమంతా నిండిన ఇంగిలీకపు ఛాయను - పేని నా తంబురాకు జీవాళిగా అమర్చి, ప్రళయాంతంవరకు ప్రేమ గానంచేస్తా.

రూప: ఎంత సుఖం ప్రభూ...

బాజ్: జీవితమంతా, జీవితాంతానా కూడా?

రూప: పరవశ్యతమిచ్చే ఈ సింధూర కాంతులను, మన ప్రేమను, తలచుకుంటే, మమకారం భయం కూడా వేస్తున్నాది- ఎందుచేతనో!

బాజ్: మన అత్యంత ప్రణయానికి ప్రబల తార్కాణం.

రూప: ఏమమ్మో మునిమాపా, మా జీవిత భవిష్యతు నీ చేతిలో ఉంది. విరిసే ప్రేమలతో కూడిన వెండి రేయినీ ప్రసాదిస్తావో! ఘోరగుఃఖంతో కుమిలిపోయే కారు నల్లని కాళరాత్రినిసావో? ఏం చెప్పగలం!

బాజ్: ఏవో మనకష్టాలు గట్టెక్కాయి. సుఖంగా ఉన్నాం. ఆ ఉన్న రవంత పెండ్లి కూడా అయిపోతే బాగుండును. నీకు ఇంకా ఏదో నిదర్శనం అవుపిసుంది. అంతవరకు ఆగాలి అని గట్టుపట్టు అనకుండా నన్ను తిప్పి నీవు కష్టపడుతున్నావు. ఎప్పుడైనా కావలసిందే అయినదానికి, కానిదానికి లోకం చేత ఎందుకు అనిపించుకోవాలి?

రూప: ఏమంటుంది లోకం? అనవలసినదేదో ఇదివరకే అంది. కులహీనులరాలను; జాతిభ్రష్టను. తండ్రిమాట పాటించలేదని అంటూనే ఉంది. ఇప్పుడు కులటనని, ఉంపుడుకత్తెనని అంటుంది. అననీండి. ఈ పెండ్లిచేసుకున్న వారందరినీ తలదన్నే ఆదర్శపతి ననిపించుకుంటాను. ఇవాళ ఈ పూవులుగల చెట్లక్రింద బాసచేస్తున్నాను.

బాజ్: నిజమే; హృదయప్రీతితో పాటు బాహ్యలాంఛనాలు కూడా జరగడం మంచిదిగా. నా పట్టమహిషివి అవుతావని ఉవ్విళ్ళూరుతున్నా. ఏమో ఎంతకాలం పడుతుందో?

రూప: ఇంక ఎంతో కాలం పట్టదు ప్రభూ. అమృత ఘడియలు దగ్గరపడ్డాయని నా హృదయం చెబుతున్నాది.

బాజ్: రూపా, దూరాన్ని ఏమది చూడు ఆ చింతతోపులో, ఉవ్వెత్తుగా పడగెత్తిన పాములా లేచి, వయ్యారంగా దిగి ప్రవహించి వెడల్పై, రేవానది పులినతలానికి వేగంగ ప్రవహిస్తున్నాది, చూస్తూఉండగా యింతలో.

రూప: అది నా నోములపంట. ఆ నిదర్శనంకోసమే ఎదురుచూస్తున్నా. పాతాళం నుంచి చింతతోపులో భూతలాన్ని చీల్చుకొని పైకివచ్చి వాగై ప్రవహించి, రేవా నదీ జలాల్లో కలుస్తానని, అంతవరకు మన వివాహం ఆపమని, గంగ నాతో ఆనాడే చెప్పింది. ఆ పాతాళగంగ రేవా నది కలిసినచోటున నాకుండాలని ఉంటుంది, యీ రెంటి సమాగమస్థలానికి రేవాకుండ పేరు పెట్టమని కూడా చెప్పింది.



"ఏ...య్...! బోయ్ !! కాఫీలో ఈగేమిటి ?"
"అలాగాండీ! తమరిచ్చే బేడాడబ్బులకి ఈగలు గాక ఏనుగ లొస్తాయా బాబూ!"

నాకు తల్లిలాంటిది, రేవానది. చెల్లెలాంటిది వాగ్ప్రవహించిన పాతాళగంగ. ఈ రెండు నా కంటి కెల్లప్పుడు కనబడేటట్టు యిక్కడొక మహల్ కట్టించు ముహూర్తం పెట్టించు. నిరవధికమైన ఆనందంలో తేలిపోదాం. పాటలు పాడుకుంటూ, కవిత్వం కట్టుకుంటూ.

బాజా: గగనమంతా కవలిపోయిరక్తపు కేణములా కనపడుతున్నాది. పొగలు చిమ్ముతున్న మంటల్లా పొడచూపుతున్నాది.

రూప. సంధ్యారాగమే అనలమైతే, అనురాగమే అగ్నిపరీక్ష అవుతుందేమో,

బాజా: ఘడియకిందట, పాటలాధరంలా కనిపించిన నీ ముక్తపథం, నల్లపడని పెదిమలట్లు మారిపోయిందే.

రూప: తరుముకువచ్చే చీకటులు మన కాపదను సూచిస్తున్నాయి. అదిగో ఒకటే చుక్క తోచింది. అమ్మయ్యో, ఏమిటా చుక్క అల్లా కనపడుతున్నాది!

పాంచభౌతిక దేహంబు పతితమగుట
హుతవహునిభూతి జిహ్వ కాహుతిగనిచ్చి
పరమ పదశాంతి పర్వాలపరి, మడించి
వెలుగుమానినీ శీలంపు వెన్నపూస.

[క్షణమాత్రం విషాద సంగీతం]

అదం: రూపమతీ, నీ సౌందర్యం, నీ రసికత, నీ గాన మాధుర్యం, నీ కవితా వ్యాసంగం, యెన్నని చెప్పగలను? సమస్తమైన కళలకు నీవు కళానిధివని వేనోళ్ల విన్నాను. నీ సౌందర్యం వీక్షించేసరికి నా కనులు మిరుమిట్లు గొల్పుతున్నాయి. ప్రజలు నిన్ను గురించి అనుకున్నవన్నీ యథార్థాలనుటకు, ప్రబలసాక్షి నేనే...

రూప: ఆదంజీ, మీ రాకకు సంతోషిస్తున్నాను. వచ్చిన కార్యమేమిటో తెలిపితే నేను చేయగలిగినదైతే తప్పక చేస్తా.

ఆదం: తలుచుకుంటే స్త్రీ చేయలేని కార్యం యేదీ వుండదు. హిందూ మతస్థుడైన తండ్రి కెదురు తిరిగి, బాజ బహదూరుతో లేచివచ్చిన నీవేమి చేయలేవు?

రూప: మీ మాటలు నా కర్థం కాలేదు. నేను బాజా బహదూరును ప్రేమించాను. పెండ్లి చేసుకున్నాను. పురుషులలో బాజా అంత అందమైనవాడూ, రసార్ద్ర హృదయులూ, సంగీత సాహిత్యకోవిదులూ, వుండటం దుర్లభం. అది నేను పూర్వజన్మాన చేసుకొన్న పుణ్యం.

ఆదం. నేనుకూడా తురుష్కుణ్ణే. క్షాత్ర తేజం కలవాణ్ణే నీ పాటలన్నా, నీవన్నా ప్రాణం యిస్తాను. బాజాను ధన్యుణ్ణి చేసినట్టే నన్నుకూడా చేస్తావనే నమ్మకంతో నీ సన్నిధానం చేరుకున్నా.

రూప: ఆదంజీ. నీమాటలవరస బాగు లేదు. నన్ను ఎవతెనిగా భావిస్తున్నావో నాకు తెలియదు. రూపమతిఅంటే రూపాజీవ అనుకొంటివా? స్త్రీకి ఒకే పురుషుడు భర్తగా ఉంటాడు. వనుక జన్మలో అతడే భర్త. ముందుజన్మలోకూడా అతడే భర్త కావాలని ప్రతిహిందూ స్త్రీ పరమేశ్వరుణ్ణి పూజిస్తుంది. ఇచ్ఛాసుఖంకోసం మానాభిమానాలుపోగొట్టుకునే వనితలు కులీనులైన హిందూమతంలో లేరు.

ఆదం: నీవు నన్ను పెండ్లాడితే, పెండ్లికి సిద్ధంగావున్నాను. రూపా, రా.

రూప: ఎంతమాటన్నారు? బాజాను రానివ్వండి. మీకు తగిన బుద్ధిచెప్పిస్తా.

ఆదం: బాజావుండగా నిన్ను వివాహం చేసుకోమని నేనంటానా రూపా?

రూప: ఆఁ. ఏమిటా మాట?...నిజం చెప్పు. బతిమాలుకుంటున్నా...నా బాజా యేమయ్యాడో వెంటనే చెప్పు...నా తల తిరిగిపోతోంది. శరీరం కంపిస్తోంది... భూమ్యాకాశాలు యేకమైనట్టు కనిపిస్తున్నాయ్.

ఆదం: (నవ్వు) యుద్ధంలో బాజా బహద్దరును నీకోసం సంహరించి, వివాహం చేసుకుందామని......

రూప: అయ్యో, దుర్మార్గుడా, నా పతిని జంపి, నా ప్రేమను విషభాండంలో కలిపి, నా జీవితం సుడిగుండంలో తిరుగుతూ వుంటే నన్ను వివాహమాడతానంటావా? హిందూ స్త్రీ తన మానసంరక్షణ చేసుకో గలదు. సతులకు పతులే గతి. నాపతి మార్గగామినినై ఇహ పరములు సాధిస్తా!

దాక్షిణ్యమును జూపు!
దక్షిణాగ్నీ, నీవు!
పావనము చేయగా!
రావయా పావకా!
కుపిత దాక్షాయణీ!
కోపానలమా రమ్మ!
పూత చరిత్ర మా
సీతమ్మ శీలమ్ము
ఖ్యాతిచాటిన వేల్పు
లే లేమ్మ.
మహిత లావణ్యవతి
సాధుమతి వేదవతి
తనువున జనించిన
తపాగ్ని నీకు జేజేలు!

### ఒకే పోలిక!

"పూర్తిగా మీలా వుండే మరో వ్యక్తిని నేను, బాగా ఎరుగున్నాను. మీ ఇద్దరు ఒకరిప్రక్క ఒకరు నిలబడితే ఎవరు ఎవరో గుర్తించటం చాలా కష్టం"

"పొరబాటున నేను మీకు అప్పు ఇచ్చిన పది రూపాయలు ఆయనగారికి ఇవ్వలేదు కదా?"

—బోసుబాబు]

ఇచ్చి ఒప్పందాలూ అయిన తర్వాత ఆపరేషన్ చేయడానికి సిద్ధమైనాడు. డాక్టరు అలవాటు ప్రకారం అసిస్టెంట్‌ను అడిగినట్లు కత్తులు వగైరా స్టెరిలైజ్ చేయి అన్నాడు పెరల్ బక్‌ను ఆజ్ఞాపిస్తూ. స్టెరిలైజ్ చేయడం ఎలాగో తెలీక పెరల్ బక్ తెల్లమొగం వేసింది కాని ఆ సమయంలో ప్రశ్నలతో డాక్టర్ని విసిగించ రాదనుకుని తెలిసినంత వరకూ ఆపరేషన్ చేసే సామగ్రి అంతా వేడినీళ్లలో వుంచింది. పేషంట్‌కి 'క్లోరోఫారం' యివ్వు అన్నాడు. యీసారి భయపడిపోయింది పెరల్ బక్. 'క్లోరోఫామ్' ఎంతివ్వాలో ఏమో? తనకేం తెలుసు! ఎక్కువైతే ప్రమాదం అనిమాత్రం తెలుసు.




భయపడుతూ డాక్టర్ని అడిగింది ఎంతివ్వాలి! ఎలా ఇవ్వాలి! అని శ్వాస చూస్తూ ఇవ్వు అన్నాడు మోతాదు చెప్పి. ఆపరేషన్ మధ్యలో పేషంట్ శ్వాస ఆగిపోయింది.

"డాక్టర్! ఆమె చచ్చిపోయింది" అంది భయపడుతూ.

ఆ మాట విని గుండె గతుక్కుమన్న డాక్టరు చటుక్కున పేషంట్ చేతిమీద తట్టాడు. మళ్ళీ నాడి, శ్వాసా పనిచేయడం మొదలెట్టాయి. చివరకు ఆపరేషన్ విజయవంతంగా అయిపోయి తల్లి ప్రాణందక్కింది. పెరల్ బక్ సంతోషించింది—మృత్యువువాతనుండి తప్పించుకున్న ఆ బీదయింటి యిల్లాలిని చూసి. కడుపులోనే చనిపోయిన బిడ్డ, మగబిడ్డ అని తెలిసి వంశోద్ధారకుడు పోయాడే అని అత్తగారు ఏడ్చింది. "ఫర్వాలేదు వచ్చేసంవత్సరం మళ్ళీ వస్తాడులే" అన్నది నవ్వుతూ.

నిజంగా మరుసటి సంవత్సరం అబ్బాయి కనుకుంది ఆ యింటి యిల్లాలు.

ఒకసారి పెరల్ బక్ వుండే నాలుగుగదుల ఇంటికి చేరినట్లుగా మరొక కట్టడం మగపిల్లల స్కూలునిమిత్తం కట్టించే బాధ్యత పెరల్ బక్ నెత్తిమీద పడింది. మిషనరీవాళ్ల డబ్బుతో, పెరల్ బక్ అధ్వర్యాన ఆ యిల్లు తయారైంది. చైనీయుల యిల్లులాగా మేడమీద గదులు లేకుండా అంతా నేలమీదనే ఎక్కువ గదులతో కట్టించాలనుకుంది పెరల్ బక్. కాని మిషనరీవాళ్ళు అలా వీల్లేదు, మేడమీద కూడా ఒకటి రెండు గదులు విధిగా వుండాలన్నారు. అందువల్ల మేడమీద రెండు గదులు కట్టించింది పెరల్ బక్—ఎన్నడూ చూడని తెల్లవాళ్ళ మేడను చూటానికి పట్నంనుండి పల్లెలనుండి చాలామంది వచ్చారు—మేడమీదకెక్కే మెట్లుచూసి హడలి పోయారట

(గతవారం తరువాయి)

చైనీయులంతా—పైకి వెళ్లడం ఎల్లాగా! అసలు దిగడం ఎల్లా అనే సమస్య పట్టుకుందట వాళ్లకు—ఆ వూళ్ళో శాస్త్ర చదువూ, సంస్కారం కలిగిన మరొక స్నేహితురాలు వుంది. మదామ్ చాంగ్ అనే ఆవిడ-ఆవిడ మాటంటే ఆ వూరంతా శిరసావహించి వింటారట. ఆవిడ ఏం చెబితే అది చేస్తారు కండ్లుమూసుకుని. చివరకు ఆవిడవచ్చి అందరికీ భయంలేదని చెప్పి మొదట తను మేడ మెట్లెక్కి పైకి వెళ్ళింది. మిగతా చైనీయులంతా ఆమె వెనకనే మెట్లెక్కి వెళ్లారు—కాని దిగిరావడానికి భయపడి పోయారు.మళ్ళీ మదామ్‌చాంగ్ నెమ్మదిగా దిగుతూ "యీలాదిగాలి" అని చెబితే తడబడుతూ ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకుని మెట్లు దిగివచ్చారట నెమ్మదిగా. మగపిల్లలకోసం కట్టిన ఆ మిషను స్కూలు పక్కనే తనుండే ఆవరణలోనే ఆడపిల్లల కోసంకూడా ఒక స్కూలు ఏర్పాటు చేసింది పెరల్ బక్.

ఆ స్కూలుకు ఒక హెడ్ మిస్ట్రెస్ కావలసి వచ్చింది-చిన్నప్పుడు తనతో బాటు చదువుకున్న చైనా యువతిని ఒకతెను పిలిపించింది పెరల్ బక్.

దక్షిణ చైనానుండివచ్చిన ఆ స్త్రీకి ఈ ఉత్తర చైనా నచ్చలేదు-అన్నం తినడానికి అలవాటుపడ్డ ఆమెకు, రొట్టె వగైరా రుచించలేదు. భోజనం మానేసిన ఆమె కొద్ది రోజుల్లోనే చిక్కిపోయింది_దానికి మరొక కారణం ఆమె భర్త ఆమెను వదిలేసి ఫ్రాన్సు వెళ్ళిపోయాడు. యుద్ధం సమయంలో చాలామంది యువకులు చైనానుండి కూలీలుగావెళ్ళి ఫ్రాన్సులోనే స్థిరపడిపోయి భార్యలను మర్చిపోయి వేరే పెళ్లిళ్లు చేసుకున్నారు. తన భర్తకూడా అలాగే ఒక ఫ్రెంచిస్త్రీని పెళ్లాడాడని తెలిసి, ఆ హెడ్‌మిస్ట్రెస్ ఏడుస్తూ కూర్చొంది—

## 'మైగుడ్‌ఫర్ నథింగ్'

ఏమిటని విచారించిన పెరల్ బక్ దగ్గిరతన గాథ యిలా చెప్పకొంది: "(మైగుడ ఫర్ నథింగ్") నన్ను విడిచి ఫ్రాన్సు వెళ్ళాడు. యుద్ధ సమయంలో, వెళ్లినవాడు నన్ను మర్చిపోయి అక్కడే మరొక స్త్రీని పెళ్ళాడాడు. అదే మాదేశపు స్త్రీ అయితే నాకు సంతోషమే, కాని ఫ్రెంచి స్త్రీ అట. ఆమె ఒకవేళ నా భర్త వెంట మా యింటికివస్తే మాయింట్లో భోజనం ఆమెకు నచ్చుతుందో లేదో, ఆమె ఏంతింటుందో! ఎల్లావుంటుందో అని కళ్లనీళ్ళు పెట్టుకుందట హెడ్‌మిస్ట్రెస్—

మంచీ చెడ్డా ముందూ వెనకా ఆలోచించకుండా బేఖాతరీగా నిష్ప్రయోజకుడుగా తిరిగే భర్తను ఎంతో ఓర్పుతోనూ సహనంతోనూ పూజిస్తూ, 'ఇల్లుగడిపే స్త్రీలు భర్తను "మై, గుడ్ ఫర్ నథింగ్' అనేవారట—

ఆ కాలంలో చైనీయుల కుటుంబాల్లో ఎక్కువగా మగపిల్లకాయలే చెడిపోతుండే వాళ్లట—అందుకే మగవాళ్ళను ఎప్పుడూ, శీలం విషయంలో ఆడవాళ్ళకంటే చాలా తక్కువగా చూసేవారట చైనాలో. హిందూ సంప్రదాయంలాగే, చైనా యువతులు పతిభక్తి కలిగి, పాతివ్రత్యమే పరమధర్మంగా భావించి ఎంత చెడ్డవాడైనా భర్తకు బదులు పలికేవారు కారట. భర్తకు తనవల్ల సుఖం, శాంతీ లేదని తెలిసిన మరుక్షణం భార్యే స్వయంగా వెళ్ళి మరొక యువతిని తీసుకొచ్చి పెళ్ళి చేసేదట ఆ కొత్తగ వచ్చిన సవతినీ, భర్తనూ కూర్చోబెట్టి తను వూడిగం చేయడంలో తృప్తిపడేదట—అలాంటి కుటుంబాలు చైనాలో ఎన్నో చూసిందట పెరల్ బక్.

ఒకరోజు అనుకోకుండా పెరల్ బక్ ఉత్తరచైనా విడిచిపెట్టాల్సి వచ్చింది. భర్తకు 'నాన్‌కింగ్' యూనివర్సిటీలో వుద్యోగం దొరికింది. నాలుగువేల సంవత్సరాలనుండీ పురాతన పద్ధతుల్లో నడుస్తున్న చైనీయుల వ్యవసాయ సంప్రదాయాన్ని ఆధునిక పద్ధతుల్లోకి మార్చడానికి కష్టపడుతూ, ఒంటరిగా పాటుపడడంకంటే, ఏదోఒక యూనివర్సిటీలో వ్యవసాయపరీక్షకెళ్లే విద్యార్థులకు





చేర్పించడం సులభమని నిశ్చయించుకున్న పెరల్ బక్ భర్త 'నాన్‌కింగ్' యూనివర్శిటీలో ఉద్యోగం సంపాదించుకున్నాడు—

'యాంగ్ సీ' నదికి ఏడుమైళ్ళదూరంలో పర్‌పుల్ కొండలపక్కనవున్న అందమైన పట్టణం 'నాన్‌కింగ్', ప్రకృతి సౌందర్యాన్ని ఆరాధించే పెరల్ బక్ ఎప్పుడు పని లేకపోయినా దగ్గిర్లో వున్న పర్‌పుల్ కొండలమీదికి వెళ్ళిపోయేది.

## కంచుగంట కథ

ఎన్నో అందమైన పెగోడాలువున్న పర్‌పుల్ కొండల్లో 'పార్ సిలీన్' పెగోడా చాలా అందంగావుండేదట. ఆ పెగోడా మీదవున్న కంచుగంటకథ చాలా ప్రసిద్ధికెక్కినగాథ.

ఆ చిన్నదేవాలయాన్ని "టెంపుల్ ఆఫ్ త్రీ సిస్టర్స్" (ముగురు అక్కచెల్లెండ్ల దేవాలయం) అనేవారట అందరూ. అసలు ఆ దేవాలయానికి ఆ పేరు ఎందుకొచ్చిందని అక్కడేవున్న పూజారిని అడిగిందట పెరల్ బక్. ఆ పూజారి యీలా చెప్పాడు:

ఆ కంచుగంట చేసిన అతనికి ముగ్గురు కూతుళ్ళు వుండేవారట. ఒకరోజు రాజుగారి ఆజ్ఞమీద కంచుగంట చేయడానికి ఆరంభించాడా అమ్మాయిలతండ్రి. తయారయిన కంచుగంటలోనుండి అపశ్రుతి వినిపించింది. నాదం సరిగాలేనందువల్ల ఒకటికి నాలుగుసార్లు కంచు కరిగించి గంటచేశాడు. ప్రయోజనం లేకపోయింది. మర్నాడు రాజుగారు గంటకోసం కబురుపెట్టారు. నాదంలేని గంట తీసికెళ్లితే రాజుగారు తప్పకుండా తల తీసేస్తాడు. భయంతోనూ దిగులుతోనూ ఆ రాత్రి ఆ కుటుంబం అంతా పడుకుని నిద్రపోతూండగా ఆ ముగ్గురు అక్కచెల్లెళ్లకూ ఒక స్వప్నంవచ్చింది. స్వప్నంలో ఆ దేవాలయంలోని దేవత ఆ అమ్మాయిలకు కనబడి "మీ నాన్న మళ్ళీ రేపు కంచు కరిగించేటప్పుడు మీరు ముగ్గురు అక్కచెల్లెళ్లూ ఆ లోహకుండంలో దూకితే ఆ గంటలోనుండి సంగీతంలాంటి నాదం వస్తుంది. మీపేరు చిరస్థాయిగా వుంటుంది" అని చెప్పి అదృశ్యమైంది. మర్నాడు ప్రొద్దుటే ఆ ముగ్గురూ స్వప్నవృత్తాంతం తండ్రికి చెప్పకుండానే తమ ప్రాణాలను తండ్రికోసం బలిచేయదలచుకున్నారు. తండ్రి గంపెడు దిగులుతో ఆఖరుసారిగా గంటకోసం లోహం కరిగించుతూన్న సమయంలో ముగ్గురు అక్కచెల్లెళ్ళూ లోహకుండంలో దూకారు. ఆ దృశ్యంచూచిన ఆ అమ్మాయిల తండ్రి కొయ్యబారిపోయాడు.

కాని ఆశ్చర్యం ఏమిటంటే తయారయిన గంట కొడితే సంగీతంలాంటి శ్రావ్యమైన నాదం నలుమూలలకూ వినిపించింది. ఆనాటినుండీ త్యాగమూర్తులైన ఆ ముగ్గురు కన్యల పేరుతోనే ఈ దేవాలయం వ్యవహారింపబడుతోంది' అని చెప్పాడు పూజారి. పర్‌పుల్ కొండలమీద అలాంటి వింతలూ, విశేషాలూ ఎన్నో చూసింది పెరల్ బక్.

నాన్‌కింగ్‌లో ఇల్లూ వాకిలీ దక్కించుకొని స్థిరపడ్డ పెరల్ బక్‌కు తల్లి చనిపోయే స్థితిలో వుందని తెలిసింది-వెంటనే బయలుదేరి తల్లిదగ్గరకు పోయింది.

## రచనా వ్యాసంగం

చనిపోతున్న తల్లిని చూడలేకపోయింది పెరల్ బక్. తండ్రిమీద కంటే తల్లిమీదే పెరల్ బక్ పంచప్రాణాలూ వుండేవి చిన్నప్పట్నుంచీ—అలాంటి తల్లి శాశ్వతంగా తన్ను వదిలిపోతున్నప్పుడు ఆమెను చూసే ధైర్యంలేక పెరల్ బక్ బయట వరండాలో యేడుస్తూ నిలబడ్డది. తను యిన్నాళ్లూ నవలా రచన మొదలెట్టాలని ఎన్నోసార్లు అనుకున్నది. కాని జీవితంలో మెదడుకు కావలసినంత మేత సంపాదించడంతోనే సరిపోయింది. కనీసం తనకు ముప్పయి సంవత్సరాల యవసురాందే నవలా రచనకు పూనుకోకూడదని తీర్మానించుకున్న పెరల్ బక్ మనసులో తల్లి చనిపోయిన క్షణంలో కలిగిన షాక్‌తో మెదడులో ఏదో మెరిసినట్లయింది. వెంటనే నవలా రచన ఆరంభించాలని తనలో ఏదో చెపుతున్నట్టనిపించింది. అంతవరకు తను జీవితంలో సంపాదించిన అనుభవాలు గజిబిజిగా బుర్రంతా నిండివుండేవి. అవన్నీ రచన రూపంలోకి రావడం మొదలెట్టాయి.

తల్లి చనిపోయిన కొన్నాళ్ళకు నాన్‌కింగ్ వెళ్ళిపోయింది. మొట్టమొదట తల్లి జీవితాన్ని గురించే వ్రాయాలనుకున్నది. ఎప్పటికైనా తనపిల్లలు పెద్దవాళ్ళై అమ్మ అమ్మమ్మనుగురించి వ్రాసిన జీవిత విశేషాలు చదివి ఆనందిస్తారనే అభిప్రాయంలో. పెరల్ బక్ తనతల్లిని గురించి ది ఎక్సైల్ అనేపేరుతో వ్రాసింది. కాని ప్రచురణకివ్వకుండా పిల్లలు పెద్దవాళ్ళయిందాకా దాచాలనే వుద్దేశ్యంతో అటకమీద వుంచింది.

ఆ సంవత్సరమే ఏవో కొన్ని వ్యాసాలు వ్రాసి అట్లాంటిక్ అనేపత్రికకు పంపింది. తర్వాత అన్ని పత్రికలనుండి వ్యాసాలు కావాలని ఆమెకు వుత్తరాలు రావడం మొదలెట్టాయి. తను వ్రాసే ప్రతి వ్యాసం కూడా చైనానుగురించి చైనాయొక్క ప్రకృతిసౌందర్యాన్నిగురించే. పత్రికలవాళ్లు మెచ్చుకుంటు వుత్తరాలు వ్రాయడంతోనే, పెరల్ బక్‌కు తనమీద తనకు నమ్మకం కలిగింది.

స్త్రీగా ఒకవైపు యింటిపనీ, వంటపనీ చూసుకుంటూ రచనలు సాగించాలంటే కష్టంగానే వుండేది. కాని రచన తన జీవితలక్ష్యంగా పెట్టుకున్న పెరల్ బక్ యింటిపనులన్నీ చూసుకుంటూనే వ్రాయడాని కూర్చునేది ప్రతిరోజూ—

ఒకరోజు మధ్యాన్నం వ్రాసుకుంటూ ఉండగా ఎవరిదో స్త్రీ పిలుపు విని లేచి వాకిట్లోకి వెళ్ళిచూసింది. తను ఉత్తర చైనాలో వుండగా తనయింట్లో ఒకతోటవాడు వుండేవాడు. వాడు పట్టె టక్కరి వెధవ. ఆదేమంటే భార్యను వదిలేసీ, చేతులో పనివదిలేసీ, పారిపోతుండేవాడు. ఈవచ్చినస్త్రీ ఆతోటవాడి భార్య...ఆమె పేరు 'లూ' పెరల్ బక్‌ను చూడగానే 'లూ' నమస్కరించి. "తల్లీ నీవే కాపాడాలి మళ్ళీ నాభర్తయథాప్రకారం నన్ను విడిచిపెట్టి పారిపోయాడు. మా దేశంలో కాటకం వచ్చింది. తొమ్మిదినెల్ల గర్భంతో వున్నాను. తింటానికి తిండిలేదు. నిన్ను వెదుక్కుంటూ యీవూరొచ్చాను. నన్ను నీవే కాపాడాలని పెరల్ బక్ కాళ్ళమీద పడ్డదట 'లూ'. పెరల్ బక్ వెంటనే తన యింటికి వెనకవున్న కొళ్ళగుడిసెను శుభ్రం చేయించి, అన్ని సౌకర్యాలూ కుదిర్చి ఆ గుడిసెలో కన్నదాకా 'లూ' ను వుంచే ఏర్పాటు చేసింది. కన్నతర్వాత 'లూ' కు ఏదైనా పనిచూపించాలనే వుద్దేశ్యంతో—

## 'మటన్ బాల్'

ఒకరోజు 'లూ' మగబిడ్డను కన్నది. బిడ్డబొడ్డు కోయడానికి శుభ్రమైన కత్తి మొదలుకొని బాలెంతరాలి పథ్యం వరకూ ముందుగానే 'లూ' కోసం అన్నిసామాన్లు పంపింది. పెరల్ బక్ 'లూ' కన్నదని తెలిసిన వెంటనే ఎర్రచక్కెర కలిపిననీళ్ళూ, వేడి వేడి కోడిచారూ తీసుకుని 'లూ'కు యివ్వడానికి వెళ్ళింది పెరల్ బక్. సాధారణంగా చైనాలోని మారుమూల పల్లెటూళ్ళలో అప్పుడు పుట్టిన బిడ్డల బొడ్డు కోయడానికి తుప్పుపట్టిన కత్తులు ఏవంటే అవి వుపయోగిస్తారట.

దానివల్ల 'సెప్‌టిక్' అయి పురుట్లోనే పిల్లలు దక్కకుండా పోయేవారట. ఆసంగతి కనిపెట్టలేని అమాయక చైనీయులు, బిడ్డలు అలాపోవడానికి కారణం 'టెన్ డే మేడ్‌నెస్' అనేవారట- 'లూ'కు పుట్టిన పిల్లవాడు బొద్దుగా ముద్దొస్తూ వుండడం చూసి పెరల్ బక్ వాడికి 'మటన్‌బాల్' అని పేరు

(55 వ పేజీ చూడండి)

అప్పుడే గేటుదాటిలోపలకువస్తున్న రాజారావు, సింహాద్రిని చూసి "ఏమోయ్! మేనేజరుగారులోపలవున్నారా!" అన్నాడు అధికార స్వరంలో

"ఉన్నారండి—దయచెయ్యండి" అన్నాడు సింహాద్రి వినయంగా నమస్కరిస్తూ.

రాజారావు అప్పుడప్పుడు ఆయనకోసం వచ్చి పోతూవుంటాడు వచ్చినప్పుడల్లా కంపెనీవిషయాలు క్లుప్తంగా మాట్లాడిపోతూ వుంటాడు. అతనికి వ్యాపారంలో అనుభవమేమీ లేదు—చాలాచిన్నవాడు వయస్సు పాతికేళ్ళకంటే వుండదు—పిత్రార్జిత మైన ఆస్తి, డబ్బూ చాలా వుండటంవలన, ఎది యెలా వినియోగించుకోవాలో తోచక చివరికి వొకమందులషాపు పెట్టాడు. రాజశేఖరంగారు ఆ కంపెనీకి మేనేజరుగా వుంటున్నారు ఆయనంటే రాజారావుకు మంచి విశ్వాసంవుంది.

సింహాద్రి, రాజారావుకు యిచ్చిన సమాధానం, గదిలోకూర్చున్న రాజశేఖరంగారు విన్నారుకాబోలు! అందుకనే కుర్చీలోనుంచిలేచి ఎదురువచ్చి

"రండి, రాజారావుగారూ! మీకోసమే ఎదురుచూస్తున్నాను" అన్నాడు ఆప్యాయంగా.

రాజారావు గదిలోవేసివున్న కుర్చీలలో, వొకటి దగ్గరకులాక్కుని కూర్చున్నాడు. రాజశేఖరంగారు, సిగరెట్ కేస్ తెరిచి, రాజారావుకు వొకసిగరెట్ యిస్తూ

"ఏమిటండీ! విశేషాలు" అన్నాడు చిరునవ్వుతో

"మీరే చెప్పాలి—కంపెనీ యెలాగుంది?"

"కంపెనీకేమి? బాగానే వుంది—ఈ మధ్య సేల్సుకూడా ఎక్కువయినాయి." అన్నాడు గర్వంగాచూస్తూ

"నాకు తెలుసునండి! మీలాంటి అనుభవశాలి మేనేజరుగా వుంటే కంపెనీ వృద్ధిలోకి రాకేమి చేస్తుంది."

"ఈ పొగడ్తలకేమిలెండి.. "

"పొగడ్తలుకాదు. నిజంగానే! మీకు వ్యాపారంలో వున్న అనుభవమూ, శ్రద్ధా నాకు తెలుసు."

"మీరలా అంటారుగానీ, నేను మాత్రం పెద్దయేమి చేస్తున్నానండీ!"

"ఇంకేమి చేయాలి? అనుభవంలేని నాలాంటి వాడిని వ్యాపారంలోకిదించి, కంపెనీ వృద్ధిలోకి తీసుకొస్తున్నారు"

"మీకు నామీదవున్న అభిమానంవల్ల అలా అంటున్నారు కానీ, నిజానికి నేను, చేస్తున్నది యేముంది?"

"అహం! అలా అంటే వొప్పుకోను. మీరు లేకపోతే, కంపెనీ యింత వృద్ధిలోకి వచ్చేదికాదు"

"ఏమిటీవేళ నన్ను తెగ పొగిడేస్తున్నారు" అని నవ్వుతూ, రాజశేఖరంగారు బయటకువచ్చి,

"ఒరే! సింహాద్రి! లోపలకువెళ్లి అమ్మగారితో చెప్పు—త్వరగా కాఫీ, టిఫిన్ తీసుకునిరా!—ఆలస్యం అవుతుందంటే వొకపనిచేయి ఫాస్కు తీసుకుని హోటల్లో కాఫీ పోయించుకుని, టిఫిన్ పొట్లాలు కట్టించుకునిరా!—వూ! త్వరగా రావాలి" అంటూ సింహాద్రికి నెమ్మదిగా చెప్పి లోపలకు పంపించాడు.

ఓ. విద్యాసాగర్

మళ్ళీ గదిలోకి వచ్చి చూసేసరికి, రాజారావు బల్లమీద వున్న మేగజైను ఏదో తీసి చదువుకుంటున్నాడు రాజశేఖరంగారు చిరునవ్వు నవ్వుతూ,

"ఈమధ్య మళ్ళీ క్రొత్తకంపెనీలనుంచి కేటలాగ్సు తెప్పించాను. ఇంకా ఎవరికీ అర్డరు యివ్వలేదు"

"అహా!" అన్నాడు రాజారావు

"ఇదివరకు తెప్పిస్తున్న మందులకు పెద్ద కమీషన్ యివ్వటంలేదు. అందుకని క్రొత్త కంపెనీలకు వ్రాశాను .. ఏదీ! ఈ మధ్యనే కేటలాగ్సు వచ్చినాయి. నేను యింకా సరిగా చూడలేదు" అంటూ అలమర తీస్తూ, కేటలాగ్సు చూస్తారా?" అని ప్రశ్నించాడు.

"ఎందుకండి—నాకేమి తెలుసు—మీరు బాగా తెలిసినవారు—అన్నీ చూసుకుని మీరే ఆర్డరు యివ్వండి" అన్నాడు రాజారావు పుస్తకంవంక చూస్తూనే.

"అదేమిటి—మీరు కూడా చూడండి—మీకు తోచిన అభిప్రాయ మేమిటో చెపుదురు కానీ ."

"నా అభిప్రాయానికేమిలెండి!... నేను చూసినా వొకటే—చూడకపోయినా వొకటే!"

"అదేమిటి! అలాగన్నారు—మీకు తోచిందేదో చెప్పండి"

"చెప్పేదేముంది—మీరే అన్నీ ఆలోచించుకుని, ఆర్డర్లు యివ్వండి—సరేనా! మీమీద నాకు ఆమాత్రం నమ్మకం లేకపోలేదు."

"అహం! నా వుద్దేశం అదికాదు—మీరుకూడా చూస్తారేమో ననుకున్నాను. అంతే!—సరేకానీ యింతవరకూ వ్రాసిన అకౌంట్సు చూసుకుంటారా!"

"రాజశేఖరంగారూ! మీరు కూడా నాకు అకౌంట్సు చూపించాలిటండీ! నాకామాత్రం మీమీద నమ్మకం లేదంటారా!"

"అదికాదు! చూసుకుంటే మీకుకూడా తెలిసి వుంటుందికదా అని . "

"ఇప్పుడు వచ్చిన యిబ్బంది యేమీలేదులెండి—మీ అకౌంట్సు ఎప్పుడూ సరిగానే వుంటాయి చూడకపోయినా యిబ్బంది లేదు"

"అవుననుకోండి, అయినా, నాకెందుకో తృప్తిగా వుండదు—మీకు అకౌంట్సు చూపిస్తేకానీ " అని అలమర తెరిచి అకౌంట్సు పుస్తకాలు బయటకు తీశాడు.

రాజారావు నిర్లక్ష్యంగా, ఆసక్తిలేని చూపులు పుస్తకంమీదికి ప్రసరింప చేశాడు. రాజశేఖరంగారు, ఏ పద్దు కాపద్దు వివరంగా చెపుతున్నాడు. రాజారావు వినిపించుకోవటంలేదు. అయినా, ఆయన చెప్పటం మానలేదు

"బాగుంది—అకౌంట్సు అన్నీ బాగానే వున్నాయి—అయినా మీదంతా పిచ్చి కానీ, మీరు చేసే ఖర్చులలో, అనవసరమైనవే వుంటాయండీ!" అన్నాడు రాజారావు అంతా అయినాక.

రాజశేఖరంగారు తృప్తిగా తనలో నవ్వుకుని, పుస్తకాలు తీసి మళ్ళీ అలమరలో పెట్టారు.

"షాపులో క్రొత్తగా ఎవరినయినా వేసుకోవాలా!" అని ప్రశ్నించాడు రాజారావు.

"ఎందుకూ—యిప్పుడున్న వాళ్ళతోనే సరిపోతున్నది ఇంకా ఎక్కువ మందిని వేసుకున్న కొద్దీ పనిసాగదు-కబుర్లు చెప్పుకుంటూ కూర్చుంటారు." అన్నారాయన నవ్వుతూ

 

# విశ్వాసపాత్రుడు



"అవునులెండి-మీరు చెప్పినది, నిజమే" అని అది కొస్త ఆగి "మరి, వస్తానండీ!" అన్నాడు లేస్తూ.

"కూచోండి—కాఫీ త్రాగి పోదురుగాని"

"ఎందుకూ—యింతకు ముందే త్రాగి వచ్చాను"

"ఫరవాలేదు-కాఫీకేమి-ఎన్నిసార్లయినా త్రాగ వచ్చును" అన్నారు రాజశేఖరంగారు తలుపువంక చూస్తూ.

ఇంతలోనే సింహాద్రి, వొక ట్రేలో కాఫీ. టిఫిన్ తీసుకుని గదిలోకి పట్టుకొచ్చాడు.

"తీసుకోండి, రాజారావుగారూ!" అంటూ ఆయన వంక చూశాడు. రాజారావు మొహమాటపడుతూనే ఫలహారం, కానిచ్చాడు

"వస్తానండీ!-మళ్ళీ ఎప్పుడయినా వీలున్నప్పుడు కలుసుకుంటాను" అంటూ రాజారావు వెళ్ళిపోయాడు.

బజారులో మెల్లిగా అతను నడిచి వెళుంటే, మనస్సులో ఎన్నో ఆలోచనలు చెలరేగిశాయి. రాజశేఖరంగారు, ఈ వూరు వచ్చిన దగ్గరనుంచీ, తనంటే చాలా ఆప్యాయంగా వుంటున్నారు. ఆయనవంటి నమ్మకస్థులు చాలా కొద్దిమంది వుంటారు. ఆయనకున్న అనుభవమూ, వ్యవహారపరిజ్ఞానమూ, మెచ్చుకోతగింది. వ్యాపారంలో అనుభవం యేమాత్రం లేని తనచేత వొక మందులషాపు పెటించి, దానిని వృద్ధిలోకి తీసుకువచ్చాడంటే, నిజంగా గొప్ప విషయమే! —ఇలా అనుకుంటూవుండగానే, రాజారావు తన యింటిని సమీపించాడు.

రాజశేఖరంగారియింట్లో కూర్చోడానికి తోచక. షాపువైపు వెళ్దామనే వుద్దేశంతో, అప్పుడే జరీ కండువామీద వేసుకుని బయలుదేరాడు దారిలో పరంధామయ్య కనిపించాడు. రాజశేఖరంగారు, చిరునవ్వుతో పలకరించాడు.

"ఏమిటి—ఎక్కడనుంచి వస్తున్నారు"

"బజారునుంచేనండీ! — అవును కానీ, నేను చెప్పిన విషయం యేమిచేశారు"

"చెప్పాను కదుటండీ! నాలుగురోజులు ఆగితే 'సెటిల్' చేస్తాను"

"ఏమిచేయుడమో! ఇప్పటికి నెలరోజుల నుంచి, అదేమాట చెపుతున్నారు"

"కాదులెండి! ఈసారి తప్పకుండా చేసేసాను"

"సరే! — మళ్ళీ నాలుగురోజులు ఆగి కలుసుకుంటాను — జ్ఞాపకం పెట్టుకోండి" అంటూ పరంధామయ్య వెళ్ళిపోయాడు.

రాజశేఖరంగారు పరంధామయ్యగారి విషయానికి పెద్దప్రాధాన్యం ఈయనట్లు. తనలో చిరునవ్వు నవ్వుకుని, ముందుకు సాగిపోయాడు. ఆయన షాపు చేరుకునేటప్పటికి, పనివాళ్ళు ఎక్కడివాళ్ళు అక్కడ, హడావుడిగా పనిలో నిమగ్నులయివారు. రాజశేఖరంగారు, ఈ తొందరపాటు గమనించారు కానీ, యేమి మాట్లాడకుండా వూరుకున్నారు.

"ఎంతసేపయింది, షాపు తెరిచి..." తాపీగా అడిగారు.

"ఒక పావుగంట అవుతుందండి"

"సేల్సు యేమయినా వున్నాయా?"

"ఇంతకుముందే, ఇంజక్షన్ బాటిల్సు రెండు పాకెట్లు అమ్మాను" అంటూ గోపాలం, డబ్బుతెచ్చి యిచ్చాడు.

డ్రాయరు తెరిచి, డబ్బులు అందులో పడేసి, రాజశేఖరంగారు అప్పుడేవచ్చిన పేపరుతీస చదవటం మొదలుపెట్టారు. మధ్యలో ఏదో జ్ఞాపకంవచ్చి

"రాజారావుగారు, యింతకుముందు వచ్చివెళ్లారా!" అని అడిగాడు.

"రాలేదండీ" అన్నాడు గోపాలం.

రాజశేఖరంగారు, పేపర్లోని ప్రకటనల వంక, వొకసారి పరీక్షగా చూసి, వార్తలు చదవటం మొదలుపెట్టారు. ఇంతలో వెంకట్రామయ్య వచ్చి

"నమస్కారమండి, రాజశేఖరంగారూ! అన్నాడు లోపలకువస్తూ. చదువుతున్న పేపరు తొలగించి, రాజశేఖరంగారు




శ్యామల కోమలి
—చిత్రకారుడు: ఎమ్. వెంకటరామయ్య.

"రండి, రండి, కూర్చోండి" అంటూ ఆప్యాయంగా పిలిచారు.

"ఎంతసేపయింది మీరు వచ్చి — యిందాక వస్తే లేరు."

"ఇప్పుడే—యింటికుముందే వచ్చాను."

"నేను చెప్పిన విషయం యేమిచేశారు"

"అదే, నేనూ ఆలోచిస్తున్నానండి — నేను యింకా ఆయనతో మాట్లాడలేదు ఈ విషయం."

"ఏదో తొందరగా తేల్చేస్తే మంచిదిగా—"

"అందుకే నేనూ చూస్తున్నాను—ఆయనతో రేపు మాటాడుతా లెండి—ఇవేళ మా యింటికి వచ్చాడు—మీ సంగతి చెప్పటం మరిచిపోయాను"

"పోనిలెండి—రేపు జ్ఞాపకం పెట్టుకుని చెప్పండి — మాకూ అవతల తొందరగా వుంది"

"ఓ, అలాగే" అన్నారు రాజశేఖరం గారు. కొంత ఆగి "రాత్రికి మా యింటికి వచ్చి కలుసుకోండి — వివరాలు మాట్లాడుకుందాము"

"ఆయన అభ్యంతరమేమి పెట్టరుకదా!"

"అదంతా నేను చూసుకుంటానుగా! మీ కెందుకు? — మీరు నన్ను కలుసుకోండి — రేపు ఆయనతో నేను మాట్లాడుతాను."

"అయితే, ఆయన వప్పుకుంటాడంటారా!"

"వప్పుకోక యేమిచేస్తాడండీ — నేను చెపితే కాదంటాడా! — అయినా, ఆయనకు దీనివల్ల వచ్చే నష్టమేమిలేదుకదా! ఇదివరకు వచ్చేలాభం కొంత తగుతుంది"

"ఆ, ఆ, అంతేగా!" అన్నాడు వెంకట్రామయ్య.

"రేపు మిమ్మల్ని భాగస్థులుగా కలుపుకుంటే, అదృష్టం బావుండి, కంపెని వృద్ధిలోకి రావచ్చు."

"ఇప్పుడుమాత్రం వృద్ధిలోకి రాలేదుటండీ- మీ షాపుకేమి మహారాజులాగుంది".

ఈ మాటలకు రాజశేఖరంగారు కొద్దిగా ఖంగారు పడ్డాడు. కానీ మరుక్షణంలోనే సంతోషించాడు.

"అయితే, మీకు మనస్ఫూర్తిగా మాతో చేరాలని వుందన్నమాట" అన్నారు రాజశేఖరంగారు ఆయన యేమంటాడో చూదామని

"ఉందికనుకనే, మీకోసం తిరుగుతున్నది."

"అయితే సరే!—రాత్రికి మా యింటికి రండి. అన్ని విషయాలూ మాట్లాడుకుందాము."

"అలాగే వస్తాను- మరి ఆయనను రేపు కలుసుకుందామా?"

"మీ రెందుకు- నేను కలుసుకుని మాట్లాడుతాను."

"అయితే సరే- మరి వాటావిషయం" అని వసిగాడు.

"చెప్పానుకదుటండీ-మీకు వొకపావలా వాటా యిప్పిస్తాను సరేనా!"

"ఆ మాత్రం సహాయం చెయ్యండి- మీకు పుణ్యంవుంటుంది."

"ఇందులో పుణ్యమేముంది లెండి- చేతిలో వున్న పనికనుక, చేయగలుగుతున్నాను."

"అదయినా అందరూ చేసారుటండీ!"

"చేయటానికి యిదొక పెద్దవిషయమేమీ కాదుగా! ఏదో కాస్తంత సహాయం అంతేగా!"

"అంతే లెండి - మరి నేను వసాను. రాత్రికి మిమ్మల్ని కలుసుకుంటాను" అంటూ వెంకట్రామయ్య వెళ్ళిపోయాడు

ఆయన అటు వెళ్ళగానే, రాజశేఖరంగారు, పేపరు మళ్ళీ తీశారు. కానీ ఎందుకో చదవ బుద్ధికాలేదు. వెంకట్రామయ్య విషయం, 'మనస్సును ఆక్రమించుకుని, మరో విషయంగురించి ఆలోచించటానికి వీలులేకుండా చేసింది. ఆలోచించిన కొద్దీ ఈ సమస్య ఎలా పరిష్కరించాలో. రాజశేఖరంగారికి కాసేపు తోచలేదు. మళ్ళీ యింతలోనే, మనస్సుకు ఏదో తట్టి, ఆ విషయం ఆలోచించడం మానేశాడు.

ఇంతలోనే కేశవరావు, షాపులోకి వచ్చాడు. అతను రావటం చూసి, రాజశేఖరంగారు, ఆప్యాయంగా

"రండి కేశవరావుగారూ!... - మీ విషయమే ఆలోచిస్తున్నాను" అన్నారు.

"ఏమి చేశారు?" ఆదుర్దాగా అడిగాడు.

"మీకు మాటయిచ్చిన తరువాత, వూరుకుంటానుటండీ! ఆయనతో మాట్లాడాను"

"ఏమన్నారు-ఆయన వప్పుకున్నారా?"

"వప్పుకోక యేమి చెస్తాడండీ! - నేను చెపితే, ఆయన మాత్రం, కాదంటాడుటండీ!"

అవును లెండి - ఆయనకు మీ మాటంటే గురి"

"కాదు మరి - నేనేగా ఆయనచేత ఈ షాపు పెట్టించింది."

"నాకు తెలియదూ! మీరుండబట్టే కంపెనీ యింత వృద్ధిలోకి వచ్చింది."

"ఇందులో నాదేముందిలెండి-ఏదో నాకు చేతనయినవిధంగా నడుపుకొచ్చాను."

"అదేమిమాటలెండి-కంపెనీ మీ మూలంగానే, వృద్ధిలోకివచ్చింది-అందుకేగా. నేను కూడా పార్ట్నర్‌గా చెరాలని వుబలాటపడుతున్నది" అన్నాడు కొంత పొగడుతున్నట్లు.

"ఈ వ్యాపారంలోవున్న లోటుపాటులు మీకు తెలియవండీ!"

"తెలియకపోయినా పెద్ద యిబ్బందేమీ లేదు-మీలాంటివారు, మేనేజరుగా వుంటే యేమి ఫరవాలేదు."

ఏమిటో నామీదవున్న అభిమానంకొద్దీ మీరలా అంటున్నారు..." రాజశేఖరం గారు కొద్దిగా మొహమాటపడ్డారు.

"అదేమికాదులెండి! క్రిందటి యేడు వొచ్చిన లాభాలసంగతి మీరే చెప్పారుగా! పోతే. ఈ ఏడు వచ్చిన లాభాల సంగతి యింకా తెలియదనుకుంటాను."

"అంతేగా! లెక్కలు చూసుకుంటేగాని తెలియదు...సరే! రేపు వుదయం మా ఇంటికి రండి-అన్ని విషయాలూమాట్లాడుకుందాము" అన్నారు రాజశేఖరంగారు.

"అలాగే!" అని చెప్పి కేశవరావు వెళ్ళిపోయాడు. రాజశేఖరంగారు, మధ్యాహ్నం పన్నెండుగంటలదాకా షాపులో నేకూర్చుని యింటికి వెళ్ళిపోయారు.

* * *

నాలుగు రోజులు గడిచాయి. ఒకరోజు వుదయం కేశవరావు, రాజశేఖరం గారింటికి వెళ్తే తలుపు తాళం వేసి వుంది. పక్క



# విశ్వాసపాత్రుడు



భాగంలో అడిగితే, ఆ క్రిందటిరోజు రాత్రి ఆయన యిలు ఖాళీచేసి వెళ్లిపోయారని తెలిసింది. కేశవరావుకు గుండె ఆగినంత పనయింది.

ఇంతలోనే వెంకట్రామయ్య అక్కడకు వచ్చి, "రాజశేఖరంగారు యింట్లో లేరా!" అని అడిగాడు.

కేశవరావు దిగాలుపడి "నేనూ ఆయన కోసమే వచ్చాను. ఆయన యింట్లోనే కాదు—వూళ్ళోనే లేరట! రాత్రి యిల్లు ఖాళీచేసి వెళ్ళిపోయాడట" అన్నాడు.

"అదేం! ఆశ్చర్యంగా వుందే! నిన్న సాయంత్రంకూడా నాకు కనపడ్డాడే!"

"అదే విచిత్రంగావుంది—నాకూ కనపడ్డాడు. నాతో చాలాసేపు మాట్లాడాడు కూడా!"

"అయితే, ఆయన వున్నట్లుండి లేచిపోవలసిన అవసరమేమిటో తెలియకుండా వుందే!" అన్నాడు వెంకట్రామయ్య ఆలోచిస్తూ.

"అదేనండీ! నాకూ అర్థంకాకుండా వుంది—చాలా మంచివాడు, మర్యాదస్థుడు. ఆయనకీ దుర్బుద్ధి యేమిటో..."

"ఏదైనా పనివుండి వెళ్ళాడేమో!"

"పనీ లేదూ పాడూ లేదూ—పనివుంటే సామాన్లు ఎందుకు తీసుకు వెళ్తాడంట—ఇందులో మోసమేదోవుంది" కోపంగా అన్నాడు.

"నాకూ అలాగే కనిపిస్తోంది- ఏమయినా రాజారావుగారి దగ్గరకు వెళ్ళివద్దాము రండి - ఆయన కేమయినా తెలుసేమో ఈ విషయం" అంటూ నడక సాగించాడు.

ఇద్దరూ నెమ్మదిగా రాజారావు యింటికి వెళ్లారు. రాజారావు పేపరు చదువుకుంటూ హాలులో కూర్చుని వున్నాడు.

"నమస్కారమండీ రాజారావుగారూ! మీతో వొక విషయం మాట్లాడాలని వచ్చాము" అన్నాడు కేశవరావు.

రాజారావు చదువుతున్న పేపరు బల్లమీద పడేస్తూ "ఏమిటి విషయం—చెప్పండి" అన్నాడు.

కేశవరావు, వెంకట్రామయ్య చెరొక కుర్చీలో కూర్చున్నారు. ఎవరు ముందర ప్రస్తావన తేవాలనే విషయం తేలక, ఇద్దరూ వొకరి ముఖాలు వొకరు చూసుకున్నారు. చివరికి కేశవరావే మొదలు పెట్టాడు.

"రాజశేఖరంగారు నా విషయం మీతో మాట్లాడారట?"

"ఏ విషయం?" అన్నాడు రాజారావు అర్థంకాక.

"అదేనండి—నన్ను పార్ట్నర్ గా కలుపుకునే విషయం. రాజశేఖరంగారు నాకో వాటా యిస్తానన్నారు. దాని విషయమై మీతో మాట్లాడానన్నారు"

"బాగుంది—ఆయన నాకెప్పుడూ ఈ విషయం చెప్పందే!"

"చెప్పానన్నారే!—పోనీలెండి. ఇప్పుడయినా నేను చెపుతున్నాను. మీ అభిప్రాయమేమిటి?" ప్రశ్నార్థకంగా అతని వంక చూశాడు.

"రాజశేఖరంగారు ఇదివరలో ఎప్పుడో, భాగస్థులను కలుపుకునే విషయం ఎత్తారు. నేను అప్పుడే చెప్పాను. ఎవరూ వద్దు—యిలాగే సాగనీయిండని"

"అయితే, యిప్పుడు నా విషయం లాభం లేదంటారా!"

"ఇంకా వేరే అడుగుతా రెందుకు? నాకు ఎవరినీ కలుపుకోవడం యిష్టం లేదు - ఎదో యిలాగే సాగిపోవాలని నాకు వుంది."

"అయితే, రాజశేఖరంగారు మీరు ఒప్పుకుంటారని చెప్పారే!"

"చెపితే చెప్పారు - నాకు యిష్టం లేదు" అన్నాడు రాజారావు నిర్మొహమాటంగా.

"మొత్తానికి నమ్మించి మోసం చేశాడే!"

"ఇందులో మోసమేమున్నది?"

"మోసం కాకపోతే యేమిటి? నాకు వాటా యిప్పిస్తానని చెప్పి, వొక వెయ్యి రూపాయిలు తీసుకున్నాడు"

"ఏమిటీ!" అన్నాడు రాజారావు ఆశ్చర్యంగా.

"చాలామంచివాడు, నమ్మకస్థుడని యిచ్చాను. కాని నమ్మించి మోసంచేశాడు

ఇవేళ వాళ్ళింటికి వెళ్ళిచూస్తే తలుపు తాళం వేసివుంది"

"ఏదైనా వూరికెళ్ళారేమో!"

"వూరుకాదండి – అసలు మకాం యెత్తేశారండి. మీకింకా తెలియదా ఈవిషయం?"

"తెలియదండీ! ఎప్పుడు వెళ్ళిపోయాడు?" అన్నాడు రాజారావు ఖంగారుగా.

"నిన్న రాత్రి యిల్లు ఖాళీ చేశాడట!"

"విచిత్రంగా వుందే? రాజశేఖరంగారేమిటి? యిల్లు ఖాళీ చేయడమేమిటి! – ఆయన అలాంటివాడుకాడే! చాలా మంచివాడు."

"నేనూ అలాగే అనుకున్నానండి. నా దగ్గర వొక వెయ్యి రూపాయిలు తీసుకున్నాడండి" అన్నాడు వెంకట్రామయ్య.

"ఏ...మి...టి! ఎందుకుతీసుకున్నాడు" అన్నాడు రాజారావు అయోమయంలో పడిపోతూ.

"నాకూ వొకపావలా వాటా యిప్పిస్తానన్నాడండీ!"

రాజారావు నిర్ఘాంతపోయాడు. రాజశేఖరంగారు, తనతో సంప్రతించకుండా, ఎవరో తను ముక్కూ మొహం ఎరుగనివాళ్లకు కంపెనీలో వాటా యిస్తానని మాటయివ్వడం చాలా విచిత్రంగానే వుంది. ఒకవేళ మాట యిచ్చినా, లంచం తీసుకునేటంత నీచస్థితికి పాల్పడేవాడంటే రాజారావుకు నిజంగా ఆశ్చర్యమేసింది.

ఇంతలో పరంధామయ్య, మందులషాపులో పనిచేస్తున్న గుమాస్తా గోపాలం, యిద్దరూ అక్కడికి వచ్చారు. పరంధామయ్యే ముందుగా ప్రస్తావన మొదలుపెట్టాడు.

"మేనేజరుగారు ఈ వూరునుంచి వెళ్ళిపోయారట!"

"అవును! యింతకుముందే విన్నాను— ఏమి మీకేమన్నా బాకీవున్నాడా!"

"ఆ, రెండువందలు అప్పగా తీసుకున్నాడు, వారంరోజులలో తిరిగి యిస్తానంటే, చేబదులుగానే యిచ్చాను. నోటు కూడా వ్రాయించలేదు".

"ఇంకేమి! అంతా ఆలోచించే ఆయన మకాం యెత్తేశాడన్న మాట!—ఆయన మీకుకాక యింకెవరికయినా బాకీ వున్నాడా!"

"ఊళ్ళో చాలామంది దగ్గర అప్పులుతీసుకున్నాడండీ!—అంతా యివేళ వొకటే గోల."

"అయితే, ఈ అప్పులబాధ పడలేకే, ఈ వూరునుంచి లేచిపోయి వుంటాడు"అన్నాడు కేశవరావు పరిస్థితి అర్థం చేసుకుంటూ.

"కంపెనీకి లాభాలు బాగావస్తున్నాయన్నాడు. అయితే అంతా వట్టిదే నన్న మాట" అన్నాడు వెంకట్రామయ్య

"లాభాలేమిటండీ — అంతా అబద్ధం! ఈ మధ్య అమ్మకం కూడా తగ్గిపోయింది" అన్నాడు గోపాలం.

"ఏ...మి...టి" అన్నాడు రాజారావు దీర్ఘంతీస్తూ.

"మొన్న మీరు మందులు కొనటానికి యిచ్చిన సైకం ఆయన దగ్గరే వుంది. ఏ మందులూ కొనకుండా, ఆ మొత్తం ఆయన దగ్గరే వుంచుకున్నాడు."

ఈ మాటలతో రాజారావుకు నెత్తిన పిడుగుపడినట్లయింది. ఒక క్షణంపాటు పిచ్చివాడిలాగా అటూయిటూ చూసి

"ఒక్కరోజయినా, నువ్వు యిక్కడకు వచ్చి అసలు విషయం చెప్పివుంటే, జాగ్రత్త పడేవాళ్ళము" అన్నాడు రాజారావు నిట్టూర్పు విడుస్తూ

"నేను మాత్రం యిలా జరుగుతుందని అనుకున్నానుటండీ!—మందులు కొనలేదేమని అడిగితే, వొక వారంరోజులు ఆగి కొంటానన్నారు. అంతే! నేను మళ్ళీ ఆయనను అడగలేను"

"అది సరేకాని, ఆయన యింట్లో సామాను చాలా వుంది కదా!—యిల్లు ఖాళీచేసి ఎలా వెళ్ళాడో!" అన్నాడు రాజారావు

"ఈ మధ్య పెద్దపెద్ద సామానన్నీ ఆయన తమ్ముడి గారింటికి పంపించేశాడండీ! నేను ఎందుకో అనుకున్నాను—ఇప్పుడు మిగతా సామాన్లు తీసుకుని మకాం ఎత్తేశాడు" అన్నాడు గోపాలం.

కేశవరావు పోలీస్ స్టేషనుకు రిపోర్టు యిద్దామనే వుద్దేశంతో కుర్చీలోనుంచి లేచి టెలిఫోను వున్న బల్ల వైపుకు నడిచాడు.



# నీలి కంఠుడు

"కాలకంఠుని నాగసర్పం
కుబుసమూడ్చి పడగ బుస్సంది.
రెండువాల్కలు..."

"నా కిదివరకు తెలియదు మీకు రెండు నాలుక లున్నాయని," అంది యశోద వెనక నుంచి.

"అలాగా" అన్నాడు నారాయణ తెరచిన పుస్తకం అలాగే పట్టుకుని.

"లేకపోతే. ఇంతకాలంనుంచీ ఆ నలభై రూపాయలూ నా యిష్టప్రకారం ఖర్చు పెడతానని వొప్పుకుని, యిప్పుడు మీరు పేటు మార్చడం మీకే తగును" అన్నది యశోద.

నారాయణకి ఇప్పుడు అర్థమయింది భార్య మనసులోని మాట.

"చూడు యశోదా! అడపా దడపా అరణా, అణా మిగిలేసి నలభై నిలవచేసింది నువ్వే. కాదనను" అంటూన్న భర్తమాట కడ్డువచ్చి, "అందుకే నా యిష్టప్రకారం రెండు జతల బట్టలు కుట్టించుకోండి. మీ చొక్కా చిరుగులు కుట్టలేకుండా వున్నాను" అంది యశోద.

"అలా పనికిరాదు. మగవాడు ఎలాంటి బట్టలు వేసుకున్నా రోజు దొర్లిపోతుంది. ఈ నలభై పెట్టి నీకో మంచి చీర తెస్తాను. ముందు నెలలో నీ పుట్టినరోజు కూడా వస్తూంది. ఎప్పుడో కార్యానికి పెట్టిందేతప్ప మళ్ళీ ఈ ఆరేళ్ళలోనూ ఒక్క సిల్కు చీరనా కొనలేక పోయాను. ఏమిటో, పేరు గొప్ప, వూరు దిబ్బాలాంటి వుద్యోగాలు! బ్యాంకు పుస్తకంలో పది అంకె దాటే సూచనే లేదు" అని చప్పరించేడు భర్త.

"అబ్బా, కట్టిపెడుదురూ ఈ ప్రసంగం. అస్తమానం లేదు లేదనుకోకూడదు." అంటూన్న యశోద. వీధి తలుపుతట్టిన శబ్దం విని, వెళ్ళి తలుపుతీసింది. గుమ్మంముందు టెలిగ్రాపు బంట్రోతు నిలబడివున్నాడు. నారాయణ ఒక్కగంతులో వెళ్ళి అందుకున్నాడు. కవరుచించి రెప్పవెయ్యకుండా అలాగే చూస్తున్న భర్తనుగని,

"ఇంటిదగర అంతా క్షేమమేగదా" అంది యశోద.

## జయంతి శ్రీరామమూర్తి

"ఆ. అంతా క్షేమమే" అన్నాడతడు కుర్చీలో కూలబడుతూ. అతని కళ్ళల్లో ఒక విచారపు పొర ఆమెకు గోచరించింది.

"అయితే, ఏమిటి ఈ టెలిగ్రాము?"

"ఏముంది నాబొంద? ఢిల్లీనుంచి శివరావూ, భార్యా వస్తున్నారట"...

"ఎప్పుడు" అంది యశోద.

"ఇప్పుడే - ఎనిమిదింటి బండిలో వస్తున్నారు. నన్ను స్టేషనుకి రమ్మని యీ టెలిగ్రాము" అన్నాడు నారాయణ.

"మరి ఇంతమాత్రానికే అంత విచారంగా కనుపిస్తారెందుకు?"

"విచారం కాదు. ఏమిటో, యీ పట్నవాసంలో మనదే మనకిచాలక చస్తూంటే ఈ అభ్యాగతు లొకళ్ళు."

"అలాగంటా రేమిటండీ. పాపం, ఎంత ప్రేమా, ఎంత చనువూ లేకపోతే మన ఇంట్లో దిగుతారు? ఏదో మనతో బాటే, ఆ పప్పూ అన్నమే వాళ్ళకీ పెడదాం. అవును గాని, ఏడున్నర అయింది యింకా అలా కూర్చున్నారేం?" అంది యశోద.

నారాయణ ఏదో పారేసుకున్న వాడిలా లేచి, బట్టలు మార్చుకుని, "సరే, ఆ నలభై రూపాయలూ పెట్టెలో ఓమూల పడేసి వుంచు. ఈ బంధువులు వెళ్ళిపోయేక చూసుకోవచ్చును" అని వీధిలోకి దారి తీశాడు.

నారాయణ వేగంగా స్టేషనువైపు నడిచి పోతున్నాడేగాని, అతనిలో ఉత్సాహం అన్నది లోపించిపోయింది అతని బుర్ర అనంతమైన ఆలోచనలతో వేడెక్కివుంది. తా నెంత వద్దనుకున్నా చీటికీ మాటికీ సింగరాజు లందరూ వచ్చి మిత్రత్వమనే బురఖాను తగిలించుకుని, బలవంతంగా ఆతిథ్యాన్ని అంగుకుని, కడకు తనకే పంగనామాలు పెట్టి వెళ్ళిపోతున్నారు. ఇప్పటికింకా రెండునెలలు కూడా గడవలేదు— ఒక ప్రబుద్ధుడు ఉద్యోగ ప్రయత్నపు మిషతో వచ్చి, ఇరవైరోజులు తిష్ఠవేసి వెళ్ళేనాటికి చీదరించుకొని "ఇంకానయం, ఈ ఇరవైరోజుల్లోనూ నన్ను పిల్చి విషం పెట్టి చంపలేదు" అని బాహాటంగా చాటింపు వేసి, తన తెలివికి తానే మురిసిపోయి తోక ముడిచాడు. ఈ సంఘటన తర్వాత, నారాయణ లెంపలు వేసుకుని "ఈ ప్రపంచంలో వర్తకులేగాని మిత్రులు లేరు" అని రూఢీ చేసుకున్నాడు. కాని, తన ఉద్దేశాలు ఆచరణలో పెట్టే ధైర్యంలేక ఇప్పుడు స్టేషనుకి వెడుతున్నాడు. తనూ ప్లాటుఫారం మీద అడుగు పెట్టేడో లేదో బండిరొప్పుతూ రొజుతూ వచ్చి నిలబడింది.

ఇంటికి రాగానే శేషమ్మ యశోద బుజాలు పట్టుకుని, "నా మొహం మీకూ, మీ మొహం నాకూ తెలియకపోయినా, మా వారికీ మీ వారికీ వున్న స్నేహాన్ని చూసుకుని చనువుగా వచ్చేశాం" అంది చమత్కారంగా చేతులు త్రిప్పుతూ, "దానికేం? ఒక జాతివాళ్ళం, ఒక భావవాళ్ళం" "నేనూ అదే అన్నాను. అయినా మా ఆయన హోటలులో దిగుదామని పట్టు పట్టేరు. కాని, నేనే గొడవచేసి తంతి యిచ్చేశాను మగవాళ్ళకేం తెలుస్తాయి మన యిబ్బందులు, చెప్పండి" అంది శేషమ్మ.

"మంచి పనిచేశారు. వచ్చి పోతూ వుంటేనే స్నేహాలు నిలుస్తాయి." ... యశోద.

శేషమ్మ అటూ, యిటూ పరకాయించి, "మేడమీద యిల్లు తీసుకున్నారు ఈ వేసంకాలంలో నీళ్లు పైకెక్కుతాయా?" అంది.

"ఉదయం తొమ్మిది లోపూ, సాయంత్రం ఆరు తర్వాతా ఫర్వాలేదు. ఈలోగా మాత్రం పట్టి వుంచుకోవాలి" అంది యశోద.

శివరావూ శేషమ్మా మూడురోజులని చెప్పి వారంరోజులు తిష్ఠ వేసేరు. వాళ్ళని కూర్చోపెట్టి వియ్యాలవారిలా మేపడం కష్టమనిపించినా మాట దక్కించుకుందుకు నోరు మూసుకోక తప్పిందికాదు యశోదకు. అతిథులిద్దరూ ఉదయం ఎనిమిది దాటితేగాని లేచేవారుకారు. అప్పటికి వాళ్ళకి బెడ్ కాఫీ అందించి నారాయణ ఆఫీసుకి వెళ్ళిపోయేవాడు. అటుపిమ్మట లేచి, వేసవికాలమైనా వేన్నీళ్ళు కాని స్నానం చేసేవారు కారు. తొమ్మిది దాటేక నీళ్ళు నిలిచిపోతే, యశోద క్రిందివాటాకి వెళ్ళి తీసుకు రావలసి వచ్చేది. పన్నెండు గంటలకు వెచ్చవెచ్చటి భోజనం - శేషమ్మ మరీను!! "కాయగూరలుగా నెయ్యిలేనిదే తిండేమిటి?" అంటూ నేతిగిన్నె వొంపేసుకునేది. భోజనానంతరం శివరావు నిద్రపోయేవాడు శేషమ్మ అన్నిగదులూ తిరుగుతూ, అన్ని మంచాల మీదా దొర్లేది. అలమారులన్నీ సవరించేది. పుస్తకాలు తిరగవేసేది. ఆమె నోటికి తాళం వుండేదికాదు. రాజకీయాలనుండి రవనుసుప్పట్నక్కల దాకా అన్నీ చర్చించేది. పాపం, యశోద ముభావం మనిషి. తన సంసారమేమిటో - తనేమిటో!! శేషమ్మగారి అతి చనువుకూర్చి ఎన్నిమాటలో చెప్పాలనుకుంది కాని, మర్యాద ఆమె నోటికి తాళం వేసింది.

'తినగా తినగా గారెలు కసరు' అన్నట్లు వారంరోజులు గడచేసరికి ఆయింటి మీద శేషమ్మగారికి మొహం మొత్తింది. ఆవిడ కళ్ళు తడిచేసుకుని, "ఈజన్మలో మళ్ళీ పిల్లయింట్లో దిగకూడదు. పాపం, మీరు దిగవనే అన్నారు. నాబుద్ధి గడ్డితిని నేనే పట్టుపట్టేను. ఇప్పటికైనా నాకు తెలివి వచ్చింది" అంటూ, భర్త చూసేలా ఈ చెంపా ఆ చెంపా లెంపలు వాయించుకుంది. శివరావుమాత్రం తనకోపాన్ని ఇంగితజ్ఞానమనే ప్రమిదలో భద్రపరచుకొన్నాడు. వేగంగా మకాం ఎత్తడం కన్న అతనికి గత్యంతరం కనుపించలేదు.

మరునాటి ఉదయం నారాయణ లేచేసరికి శేషమ్మ ఎప్పుడు లేచిందో పెట్టె సర్దుకుంటూంది. ఆమె ఆరింటికే లేవడం చూసి అతను ఆశ్చర్యపడ్డాడు. ఇంతలో శివరావు లేచి "నారాయణా! ఈవేళ పదకొండు గంటల బండిలో వెళ్ళిపోతున్నాము. మీ ఆతిథ్యానికి ధన్యవాదాలు" అన్నాడు. నారాయణ లోపలికి వెళ్ళి, భార్యతో ఒక చిన్న సలహా వెలిబుచ్చేడు.

"పాపం, వాళ్ళు మళ్ళీ ఎన్నాళ్ళకు వస్తారో ఆవిడకో చీర పెడదామా?"_

యశోద భర్తతో ఏకీభవించింది.

"అయితే ఆ నలభైలోంచి ఓ పదిహేను ఇలా ఇయ్యి" అన్నాడు నారాయణ. యశోద పెట్టె తెరచింది. అందులో చెయ్యిపెట్టింది కాని ఆశ్చర్యచకితురాలయింది. ఆమె కెందుకో భయం కలిగింది. భర్తనిలోనికి పిలిచి, "మీరు గాని ఆ నోట్లు తీశారా?" అంది.

"నేనేమిటి? నోట్లేమిటి? అయిందా మంగళం? అయినా ఆ పెట్టెకి ఎన్నడైనా తాళం వేసిన పాపానపోయేవా?" అని చీదరించుకున్నాడతడు.

భార్యాభర్తలిద్దరూ నోరు మూసుకుని, పెట్టెలో ప్రతీగుడ్డా తీసి మడతలు విప్పి చూసుకున్నారు. కాని, ఫలితం శూన్యం.

"పోనీ నేను బట్టలు కుట్టించుకో మన్నప్పుడే కుట్టించి వేసుకుంటే ఎంత బాగుండేది?" అంది యశోద.

"బుద్ధిః కర్మానుసారిణీ" అన్నాడు భర్త. ఇంతకీ ఆ సొమ్ము పోవడంవల్లకలిగే విచారం కన్న ఎలా పోయిందనే ఆశ్చర్యం ఎక్కువ పీడిస్తోందతనిని. ఒకసారి రెండు చేతులా తలపట్టుకుని 'ఏమన్నా ఖర్చు చేయలేదుగదా' అని గట్టిగా ఆలోచించేడు.

ఇంతలో గుమ్మంవద్ద శివరావు నిలబడి "ఏమిటి పోయింది నారాయణా?" అన్నాడు.

అతను లేచి, "అబ్బే! ఏమీ లేదు. నిన్న ఆఫీసునుండి వస్తుంటే నలభైరూపాయలు దారిలో ఎక్కడో జారిపోయేయి" అన్నాడు.

"అయ్యో! మేము వచ్చినవేళ ఈ నష్టం ఒకటా మీకు?" అంది శేషమ్మ వెనకనుండి.

"రామ, రామ! మన్యని మీరేం జేస్తారు మా అశ్రద్ధకి" అంది యశోద.

శేషమ్మా ఆమెభర్తా వెళ్ళిపోయేక ఇంటిలో బాటే యశోద మనసుకూడా తేలికపడింది. ఈ కష్టకాలంలో ఎవరి సంసారం వాళ్ళు గడుపుకోవడమే బ్రహ్మాండం అవుతూంటే ఇంకొకరిని వారంరోజులు నెత్తిమీద పెట్టుకోడం ఎలాంటివాళ్ళకైనా సుఖం అనిపించదు. దినాలు గడుస్తున్న కొద్దీ సొమ్ముపోయిన దిమ్మ తగ్గుతూన్నా, ఎలా పోయిందీ అన్న కౌతుకం తగ్గలేదు నారాయణలో. అందులోనూ యశోద పుట్టినరోజు ఇంక రెండురోజులే వుంది. ఆమెకు చీర కొనడానికి సొమ్ము ఎవరివద్ద బదులు తీసుకోవడమా అని ఆలోచిస్తున్నాడు. ఇంతలో అకస్మాత్తుగా పోసుమేన్ వచ్చి మనియార్డరు ఫారం చేతికందించేడు. నారాయణ అదిరిపడ్డాడు. అతనిలో ఆశ్చర్య ఆవేశాలు ఒక్కసారి ఉప్పొంగి పోయాయి. నలభైరూపాయలు మనియార్డరు దేవుడే పంపినట్లనిపించింది అతనికి. అతడు సొమ్మందుకుని, పోసుమేన్ వెళ్ళిపోయేక కూపను ఇలా చదువుకున్నాడు.

"ఈ జీవితంలో కొన్ని సమయాలలో బలహీనత ఎలాంటివాళ్ళనైనా ఆవరిస్తుంది. మీ ఆవిడ పెట్టెలోని నలభైరూపాయలూ మా ఆవిడ పెట్టెలోకి వచ్చాయని చెప్పడానికి సిగ్గుపడుతున్నాము. వాటినే ఇందు మూలంగా పంపుతున్నాము. ఈ విషయాన్ని ప్రకటించడం మన యిద్దరికీ క్షేమకరం గాదు. శంకరుడు గరళాన్ని కంఠంలో దాచుకున్నట్టు మనం కూడా గొంతులోనే వుంచుకోవాలి. నువ్వు మీ ఆవిడకి కూడా చెప్పవని ఆశిస్తున్నాము.

శివరావు

ఆ సాయంత్రం నారాయణ క్రొత్త చీరతో ఇంటికి వచ్చి "చూశావా, నామతి మరపు? ఆ నలభయ్యీ బ్యాంకులో వేద్దామని తీసుకువెళ్ళి ఆఫీసు డెస్కులో మరచిపోయాను" అన్నాడు. యశోద కళ్ళు మిలమిల లాడేయి. ఆమె ఒక దీర్ఘ నిశ్వాసం విడిచి "చూసేరా పాపిష్ఠి మనసు! శేషమ్మ తీసిందేమో అని అపోహపడ్డాను. కాని, మీతో చెప్పే ధైర్యం లేకపోయింది. మంచి దయింది చెప్పాను కాదు." అని నొచ్చుకుంది. నారాయణ శూన్యంలోకి చూపులు పెట్టి నవ్వుకున్నాడు. ఆ నవ్వులోని అంతరార్థం ఇది: "ఈ లోకంలో స్నేహితులన్నవాళ్ళు ఇంకా బ్రతికే వున్నారు."





# ఎల్లమ్మ

మండపాక రాజేశ్వరశాస్త్రి

ఊరి శివార్లలో పల్లెపట్టులలో బ్రతికే ప్రజానీకానికి కోడికూత సహజంగా సైరన్‌లాగే సంచలనాన్ని కలగజేస్తుంది. దరిదాపు అందరూ బస్తీలో కూలీనాలీ, పనీపాటూ చేసుకుంటూ పొట్ట పోషించుకొనే పాటకజనమే. వీళ్ళందరూ కోడికూత వింటూనే లేస్తారు. గబగబా కాలకృత్యాలు నిర్వర్తించుకొని, అదీయిదీ సర్దుకొని, ఐదుగంటలలోపుగానే అందరూ బస్తీలో ప్రవేశించి ఎవళ్ల పనులలో వాళ్ళు సర్దుకుంటూరు.

ఒకనాటి తెల్లవారుఝామున బస్తీలోని యిళ్లలో పాచిపనిచేసే స్త్రీలు కొందరు ఊరిలో ప్రవేశించి ఒకరొకరుగా ఒక్కొక్క ఇంటివద్ద ఆగి, తలుపుతట్టి, తెరవగనే లోపల ప్రవేశించారు. వీళ్లలో ఎల్లమ్మ ఒకతె. ఆమె ఒకయింటి గుమ్మంలో ఆగి తలుపు తట్టుతూ 'బాబూ, బాబూ' అని పిలిచింది. ఏమీ జవాబూ లేక, తలుపూ తెరవకపోగా ఆమె ఆశ్చర్యపడి, తలుపు గట్టిగా తోయగా తలుపు తెరచుకుంది. బహుశా ఇంటి యజమాని రాత్రి తలుపు గడియ వెయ్యడం మరిచిపోయి ఉంటాడనుకొని, ఆమె మామూలు ప్రకారం లోపల ప్రవేశించి, తను నిత్యమూ చేస్తున్న ఊడ్పూ, కళ్ళాపూ, అంట్లూ చెంబులూ తోమడమూ వంటి పనులలో కావలసిన చీపురూ, చేట, తట, అలుకుగుడ్డ మొదలైనవి వెతికి తీసింది. అన్నిటికన్నా ముఖ్యం నీళ్ళు. నీళ్లు ఇంటిలోపల లేవు. నూతిలో తోడితేనేగాని నీళ్ళు దొరకవు. నుయ్యి తలపెరట్లో ఉంది. పెరటికి పోవడానికి పెరటితలుపు తియ్యాలి. మామూలుగా పెరటితలుపు రాత్రిపూట కప్పతాళం వేసిఉంటుంది. ఇప్పుడూ అలాగే తాళం వేసిఉంది. తాళంచెవి బాబుగారి నడుగుదామని ఎల్లమ్మ ఆయన గదివేపు వెళ్ళింది. గది తలుపు చేరవేసి ఉంది. ఆమె బయటనే నిలబడి 'బాబూ, బాబూ" అని పిలిచింది. జవాబులేదు. కాస్త గొంతుక హెచ్చించి పిలిచినా జవాబులేదు.

ఇంతవరకూ బాబు లేవకపోవడం ఎల్లమ్మకి నిజంగా ఆశ్చర్యం వేసింది. ప్రతినిత్యమూ ఆయన ఈవేళకే లేచిపోయి కాలకృత్యాలు తీర్చుకొని నూతి దగ్గర స్నానం చేస్తూ ఉండేవారే! ఆయనకి జపం, తపం, పూజవంటి చాదస్తాలు చాలా ఉన్నవి. అవన్నీ తెముల్చుకోవాలి గదా. అందుకే ఆయన అంత పెందరాళే లేవడం. ఎల్లమ్మకేదో అనుమానమైంది. ఆమె తలుపు మెల్లిగా తీసి లోపలికి తొంగి చూసింది. అప్పుడున్న కొద్దిపాటి వెలుగులో ఆమెకి కనబడిందేమంటే, బాబు మంచంపైని వెల్లకితలా పడుకొని ఉన్నారు.

"లే బాబూ లే, పొద్దెక్కిపోతూంది" అంది ఎల్లమ్మ. బాబు లేవలేదు. మళ్లీ కాస గట్టిగానే ఆమె లేపింది. బాబు ఉలకలేదు, పలకలేదు.

ఇదేదో విపరీతంగా ఉందని నిజంగా భయం వేసి, మెల్లిగా అడుగులు వేసుకుంటూ ఎల్లమ్మ మంచందగ్గిరికి నడిచి బాబును పరీక్షగా చూసింది. కష్టాలుపడి నలుగుతూనే ఇప్పుడు వయసు మళ్లిపోయిన ఎల్లమ్మకంతా స్పష్టమైపోయింది. బాబు చచ్చిపడి ఉన్నాడు! రాత్రి నిద్దరలోనే ఎప్పుడో ప్రాణంపోయి ఉంటుంది.

సాధారణ సమయాలలో గంటలకొద్దీ కూర్చొని క్రమంగా తర్జనభర్జన చేసేనే గాని స్ఫురణకు రానివి క్లిష్టపరిస్థితులలో లిప్తకాలంలో లక్ష సంగతులు మనసులో మెరుపులా స్ఫురిస్తవి. గుండెల మీద గుద్దినట్లు ఆమెకి మొటమొదట తట్టింది. వెంకట్రామయ్య బాబు చచ్చిపడి తన కంటికి కనబడుతున్నాడు. తను తాకట్టుపెట్టిన నాను జిగినీతో సహా ఐదుతులాలకి తక్కువుండదు. బాబింకా పెట్టెలోనే అట్టే పెట్టుకున్నాడు. తొలిరోజే తను వడ్డీతో సహా, దవ్వబిళ్ళ

లాంటివి, నూటముప్ఫై రూపాయిలు సీదాగా చెల్లించివేసినా (తనెంతకాళ్ళా వేళ్ళా పడది! బతిమాలింది! ఏడ్చింది! ఆయన ఐదు రూపాయలేనా వడ్డీలో తగ్గించలేదు!) 'లక్షింవారం, శుక్రవారాలలో తన బంగారం ఇవ్వాలనీ, శనివారం తప్పకుండా ఇస్తాననీ తనకు మాటిచ్చాడు. ఇప్పుడతడు ఇలా ఐపోయాడే, ఇక తన వస్తువు తన కెలాగు తిరిగి దక్కుతుంది? ఈ డబ్బు జతపెట్టడానికి ఆమె యెంత అవస్థ పడ్డది! తన కొడుకుకున్న ఒక్క అసరా బండి యెడ్లే. ఎడ్లు తెగనమ్మితేనేగాని డబ్బు పేలలేదు. ఇందుకు కొడుకుతో హోరాహోరీగా పోరింది, చివరికి చెప్పుదెబ్బలుకూడా తిన్నది!

వెంకట్రామయ్యబాబు చూస్తే డెబ్భై యేళ్ళపండు ముసిలి. నలభైయేళ్ళు ఎసేటు సర్వీసు చేసి, పెద్దపేరుపొంది, పనిలో చాకచక్యంచూపుతూనే బాగా డబ్బు చేసుకున్నాడు. ఏడెనిమిదిగరిశెల అంబారం వచ్చే భూమి కొన్నాడు. దిట్టమైన నాలుగిళ్ళలోగిలికట్టి, సమస్త పరికరాలూ సమకూర్చుకున్నాడు బాగా కుదుటబడి మరీ రిటైరయ్యాడు. ప్రస్తుతం ప్రశాంతంగా కాలం గడుపుతున్నాడు. సంతానం ఒక్క ఆడపిల్లే. పిల్ల పెళ్ళి దివ్యంగా చేశాడు. అత్తవారింట్లో ఇద్దరుకొడుకులూ ఒక కూతురుతో ఆమె హాయిగా బ్రతుకుతున్నది ముసలాయన భార్య శేషమ్మ ఈ కష్టసమయంలోనే ఇంట్లో లేకపోయింది. ఆవిడ ప్రస్తుతం కూతురినిచూడడానికి అక్కడికి—పదిమైళ్ళ దూరంలోఉన్న కూతురు గ్రామానికి—వెళ్ళి ఉంది. అలా అప్పుడప్పుడూ కూతురింట క్యాంపుచేసి, యథేచ్ఛగా ఓవారంరోజుల పాటుండి, కూతురికీ ఆమెపిల్లలికీ బాగా ముటచెప్పి తిరిగి తనయింటికి రావడము ఆమెకి పరిపాటే. వయస్సు ముదిరినా, తల తెల్లగా తేరిపోయినా, ముసిలి శేషమ్మకి వంటినిండా ఆభరణాలలంకరించుకోవడమన్నా, రంగురంగు చీరెలు సింగారించుకోవడమన్నా, పేరంటాలకి పోవడమన్నా మోజేమీతగలేదు. నోములంటే, వ్రతాలంటే పరమప్రీతి, విందులు చెయ్యడమూ, విందులకు నలుగురింటికీ వెళ్ళడమూ, నలుగురినీ ఇంటికి పిలిచి ఇష్టాగోష్ఠులు జరపడమూ ఆమె కతి సరదా. ఆమె ఆడంబరాలేమీ తగ్గలేదు. ఏళ్ళు పైనిబడుతున్న తనభర్త కారోజు కారోజు చిరాకుతోకోపమూ, అత్యాశతో ధనలోభమూ హెచ్చుతూ వచ్చినవి. తను ముచ్చటగా చేసిన ప్రతిపనీ అతడికి విసుగుకలిగించింది. ఆఖరికతడినోట తనకు తిట్లూ దిగదుడుపులూ వ్యవహారం వరకూ వచ్చింది. ఇందుకే శేషమ్మ కూతుర్ని చూడడమనే మిషతో ఇట్లా భరా వాతావరణం మార్చి నాలుగు రోజులపాటు శాంతంగా, సరదాగా మనమలూ మనమరాళ్ళతో కాలంగడుపుతూ వస్తున్నది.

భార్య పొరుగూళ్ళో ఉన్న రోజులలో వెంకట్రామయ్య తనే వండుకుతినేవాడు. గ్రామంలో బంధువులున్నారు— కొందరు దగ్గర చుట్టాలు కూడాను—అయితే అతనిది వంటరి తత్వం. తను ఎవ్వరింటికీ వెళ్ళడు, ఎవ్వరినీ ఇంటికి పిలవడు. ఏ విషయంలోనూ ఏ చుట్టం సాయమూ తన పేక్షించనూ లేదు, తన కవసరమూ లేదు. చుట్టాలందరూ 'నీ యింటికి వస్తే ఏమిస్తావు, మా యింటికి వస్తే ఏమి తెస్తావు' అన్న బాపతే అంటాడు వెంకట్రామయ్య. 'చుట్టాలను దూరంగా వుంచు' అంటూ ఇంట్లో రోజూ వల్లిసాడు. ఏ బంధువుకీ ఒక కానీ ఇవ్వడం, ఇవ్వలేదు. ఇందుకే నేమో, గ్రామంలో వున్న జ్ఞాతులందరికీ అతడంటే ఈర్ష్యా, కోపమూ, ద్వేషమూ నూ.

ముదిమి తెచ్చిన ముఖ్య పరిణామము వెంకట్రామయ్యకప్పుడప్పుడు వాతావరణంలో మార్పు ప్రభావంగా గుండెలో నొప్పివచ్చి ఒకటి రెండురోజులు కొద్దిగా బాధపెట్టి చివరికి దానంతటదే నయమౌతూ వస్తున్నది. అది ఎప్పుడో ప్రమాదం చెయ్యవచ్చని అతడికి తెలియదు, అతడే వైద్యుడినీ సలహా చెయ్యలేదు. గతిరాత్రి బహుశా పెద్దగా గుండె నొప్పి వచ్చి నిద్రలోనే అతడి ప్రాణం కాస్తా హరీమని ఉంటుంది భార్యాదగ్గర లేదు కూతురూ లేదు—ఆఖరికి ఏ యితరులూ లేరు.

ఇన్ని పాత విషయాలూ ఎల్లమ్మ బుర్రలో ఏకకాలంలో మెరిశాయి. ఆమెకి అపరితంగా భయం పట్టుకుంది. గుండెలు కొట్టుకున్నవి. కాళ్ళు వణికినవి. ఇక ఒక్క క్షణమేనా అక్కడ నిలబడితే ప్రమాదం. వెంటనే అక్కడి నించి పారిపోవడమే మంచిది. ఉంటే తన పీకలమీదికే రావచ్చు. ఇలా అనుకుంటూనే ఆమె వెనకతిరిగి రెండు అడుగులు వేసింది. మరుక్షణమే గుండెమీద గ్రుద్దినట్టుగా తన నానుసంగతి జ్ఞాపకం వచ్చింది. అయ్యో, ఐదు తులాల నానూ వదులుకోవలసిందేనా? ఈ జన్మలో అలాంటి సరుకు సంపాదించగలదా? అంతసొమ్మూ సీదాగా చెల్లించివేసిందే! ఏమిదారి! ఆమెకు ఒక్కసారిగా ఆందోళనా, భయమూ, దుఃఖమూ, నిస్పృహా కలిగి, పిచ్చెత్తినట్టై, ఆఖరికి ఒక విధమైన ఉన్మాదంగా పరిణమించింది. ఆవేశం అంతకంతకూ అధికమైంది. అవశంగా ఆమె ఏవో పనులు చకచకా చేసింది చావిట్లోకి వెళ్ళి వీధితలుపు గడియ పెట్టింది. గదిలోకి వచ్చి తలుపు వేసింది. చావులు చూడడం తన కనుభవమే. ప్రాణంపోయిన వెంకట్రామయ్య బాబును ముట్టడమేమంత భయమనిపించలేదామెకు. చలనంలేక పడివున్న ఆయన దగ్గిరికివెళ్ళి ఎల్లమ్మ నాలుగు మూలలూ చూసింది. తాళాల గుత్తి కనబడలేదు. మంచం, పరుపూ తలగడా చేతితో తట్టుతూ అంతటా తడిమి చూసింది. చివరికి తలగడా క్రింద తాళాల గుత్తి దొరికింది వెంటనే ఆమె గోడచేర్పుగా పేర్చిఉన్న పెట్టెలన్నీ పరీక్షగా చూసింది. ఒకానొక సందుగు పెట్టెలో బాబుగారు డబ్బూ, బంగారం, పద్దు కాగితాలూ ఉంచుతారని ఆమె ఇదివరలో అనేకసార్లు చూసే ఉంది. ఎలాగైతేనేం, పెట్టె కనబడ్డది. రెండుమూడు పెట్టెలు కిందికి దింపి సందుగు పెట్టె ఇవతలికి తీసి, గుత్తిలో ఉన్న తాళం చెవులు ఒకటొకటిగా ప్రయత్నిస్తూ ఒకతాళంతో పెట్టె తెరిచింది మూత ఎత్తిలోపలికి చూసింది. ఆమెకికళ్ళు జిగేలుమన్నవి! పెట్టె అరలనిండా రూపాయిలే! నోట్లే! అడుగు అరలో అంతా బంగారమే! పెట్టెలో నాలుగు మూలలానగలు జిగజిగలాడుతూ కనబడ్డవి! ఇంత ఐశ్వర్యమూ చూడగానే ఆమెకిదివరకున్న ఆ కాస్త మతీ పూరిగా పోయింది. గురాళిపట్టుకుంది. ఒక పాడుగుడ్డ నేలమీద పరిచి, పెట్టెలో ఉన్న అన్ని రూపాయిలూ, నోట్లు, బంగారం వస్తువులూ గుడ్డమీద కుమ్మరించి మూట కట్టింది చుట్టుచూసింది. గూట్లో కొన్ని పుస్తకాలు కాగితాలు కనబడ్డవి. అవి తీసి పెట్టెలో జాగ్రత్తగా సర్దింది మూతవేసి తాళం తిప్పింది పెట్టెయథాస్థానంలో ఉంచి తక్కిన పెట్టెలు యథాస్థితిలో సర్దింది. తాళాలగుత్తితో పరుగునవెళ్ళి పెరటితలుపు తీసి, గదిలోకి వచ్చి, తాళాలు యథాస్థానంలో తలగడా కిందపెట్టి, ఇవతలికి ధనం మూటతో సహావచ్చి గదితలుపు చేరవేసి, చకచకా అడుగులు వేస్తూ పెరటి గుమ్మంలోంచి పెరట్లోకి వచ్చి తలుపు దగిరగాలాగి, సందు సందులలోనే నడిచి తనయింటికి చేరుకుంది. పెరటి సాలలో పేడ కూడవేస్తున్న తన కోడలి కళ్ళబడకుండా ఇంట్లోకి వెళ్ళింది. కొడుకింట్లో లేడు. చప్పుడు చెయ్యకుండా ఎల్లమ్మ నిచ్చెనవేసి, అటకఎక్కి, ఒక పాతకుండలో తను తెచ్చినధనం మూటఉంచి, కుండలో మిగిలిఉన్న కాళీలో పాతగుడ్డలు కుక్కి, కుండమూగు మూలగాపెట్టి, మీద మరిరెండు కుండలు దొంతిగాపేర్చి, గుప్పు చప్పుగా క్రిందికి దిగిపోయింది.

అప్పటికి ఉదయం ఆరుగంటలైంది. మాఘమాసం రోజులు, సూర్యోదయమింకా కాలేదు. ఎలమ్మ ఏమీ ఎరగనట్టుగానే ఎప్పటిలాగే ఎకాయకీ నడిచి వెంకట్రామయ్యగారి ఇలుచేరి, వీధితలుపు గట్టిగా కొడుతూ, "బాబూ, బాబూ" అని గోల చేస్తూ పిలిచింది. కావాలని ఆమె మరీ

# ★ ఎల్లమ్మ ★

గోలగా పోరుచేసేసరికి వీధిలో కొందరామె చుట్టూచేరి తలో ప్రశ్న వేశారు.

"ఏమిటోనండి, ఏమీ తెలియకుండా ఉంది" అంది ఎలమ్మ. "ఎంత కొట్టినా తలుపు తియ్యరు. ఏమైందో ఏమో?"

ఒకరిద్దరు తలుపు దపదబాబాది చూశారు గాని లాభం లేకపోయింది. క్రమంగా ఇంటి ముందొక గుంపు చేరింది. ఈ వార్త అలా గాలాగపాకి వెంకట్రామయ్యగారి బంధువులకు తెలిసి వాళ్ళూ వచ్చారు. అప్పటికప్పుడే ఏడుగంటలు దాటింది. బంధువులలో కొస్త దగ్గిరివాళ్ళాలోచించి, వీధితలుపులు బలవంతంగా తెరవడంతప్ప గత్యంతరం లేదని నిశ్చయించారు. తక్షణమే పనివాడిని పిలిచి తలుపులు తెరిపించారు. వీధిలో చేరిన గుంపు ఒక్కుమ్మడిగా లోపలికి చొచ్చుకువస్తూ ఉంటే, బంధువులు వాళ్లందరినీ వారించి ఆ వీధిలో ఉన్న ఐదారుగురు మోతుబరులతో ఇంట్లో ప్రవేశించారు.

వెంకట్రామయ్య జాడ లేదు. ఇంట్లో ఏమూలా ఆయన కనబడలేదు ఇంకా పడుకొనేఉన్నాడేమో అని ఆయన గది గుమ్మం దగ్గ నిలబడి పిల్చారు. జవాబు లేకపోగా, ఒక బంధువుడు గదితలుపు తోశాడు. లోపలికో అడుగు వేశాడు. అవతలిగోడ కానుకొనిఉన్న మంచం వేపు చూశాడు. మరేముంది! వెంకట్రామయ్య మంచంమీద వెలకితలా పడుకొని ఉన్నాడు. ఊర్ధ్వదృష్టిలో ఉన్నాడు. చచ్చిపోయినట్టే, అనుమానం లేదు. ఈ దృశ్యం చూడగానే అక్కడున్న వాళ్లందరికీ ఒక్కసారిగా గాభరాపుట్టింది. భయం పట్టుకుంది. వెంటనే గదితలుపు చేరవేసి అందరూ వీధిలోకి వచ్చేశారు. లిప్తలమీద బంధువులయిల్లకు ఈ వార్త చేరవేశారు. ఇంతకోలాహలం జరుగుతున్నా, ఎల్లమ్మ నోరు మెదపకుండా అందరిమధ్యా తిరుగుతూ, అంతా చూస్తూ అక్కడే ఉంది.

ఉదయం పదిగంటలలోగానే ఈ హఠాన్మరణవార్త శేషమ్మగారున్న ఊరికి చేరవేశారు. ఈవార్త వింటూనే శేషమ్మ కొయ్యబారిపోయింది. తనసితి ఇలా పరిణమిస్తుందని ఆమె కలలోనూ ఊహించలేదు. నిండు ఐదువతనంతో, పసుపూ కుంకుమతో తనే ముందువెళ్లిపోతానని ఆమె అందరితోనూ అంటూఉండేది. ఎలాగో బలవంతాన అంతకష్టమూ దిగమ్రింగి, అల్లుడి సాయంతో శేషమ్మకూతురుతో స్వగ్రామం చేరుకుంది—మూడుగంటలు కాకుండానే, అందరి కష్టాలలోనూ అదికి ముందు తనే నిలబడి, సానుభూతి చూపి చేతనైన సాయంచేసే శేషమ్మ కనబడగానే అందరూ తండోపతండాలుగా వచ్చి ఆమెని పరామర్శించారు. ఇంతకష్టంలోనూ ఆమె ముందు కర్తవ్యం మరిచిపోలేదు. తాళాలు వెతికి తీయించింది మూలనున్న సందుగ పెట్టె ముందుకు తెచ్చి మూత తీయించింది. లోపలనిండి ఉన్న పాత కాగితాలు పెకిజల్లి అడుగువరకూ చూసినా ఆమెకి ఎర్రనివీ గాని ఎక్కడా కనపడలేదు. పెట్టెలన్నీ వెతికించింది. ఎక్కడా డబ్బు కనబడలేదు. ఆమె కమితాశ్చర్యమైంది. డబ్బూ బంగారం ఏమైనట్టు? ఇందులో ఏదో తంత్రంవుందనీ, ఎవరితోనూ ఘర్షణపడడానికి ఇది సమయం కాదని నిశ్చయించుకొని ఆమె తన వంటిమీదినగలు ఒకటిరెండు పైకితీసి తక్షణం అమ్మివేసి కొంతరొక్కం కూర్చుకుని, జరగవలసిన కర్మకాండ యావత్తూ తన తాహతుకుతగ్గట్టుగానే జ్ఞాతులసహాయంతో యథావిధిగా జరిపించింది.

ఇప్పుడాయింట్లో అన్నింటికీ ఎల్లమ్మే అవసరమైంది. "ఎల్లమ్మా, ఇది తే, అది తే," 'ఎలమ్మా, వారిని పిలువు, వీరిని పిలువు', 'ఎల్లమ్మా, ఇది తొందరగా చేసిపెట్టు, అది చేసిపెట్టు' అంటూ శేషమ్మకి ఎల్లమ్మే ముఖ్యసేకుతి ఐపోయింది. శేషమ్మకు వచ్చిన కష్టం తనకు వచ్చినట్టే ఎల్లమ్మ ప్రవర్తిస్తూ, అలాగే నేర్పుగా, ఓపికగా అన్నిపనులూ చేస్తూవచ్చింది. ధనం చౌర్యమైపోయినట్టు శేషమ్మకి నిజంగా అనుమానం వేసింది. ఒకటి రెండు రోజులైన తరువాత ఘర్షణ తప్పలేదు. టూకీగా చెప్పాలంటే, పెట్టెలోని నగదూ బంగారమూ ఇదివరకే శేషమ్మ కాజేసి ఇప్పుడు నంగనాచి వేషాలు వేస్తున్నదని బంధువులూ, బంధువులలోనే ఎవడో ఒకడు కాజేసిఉంటాడని శేషమ్మా కొంతవరకు చాలాఘర్షణ పడ్డారు. పక్కనే ఉన్న ఎలమ్మమీద ఎవరిదృష్టీ పడలేదు. ఆమె శేషమ్మతోపాటు సానుభూతిగా తనూ దుఃఖించింది. అందరిదగ్గిరా అతి వినమ్రతతో ప్రవర్తించింది. ఇంటివిపత్తు తనదేఐనట్టు సంచరించింది. నిరాఘాటంగా పన్నెండురోజుల కర్మా పూర్తయింది. మొత్తంమీద బంధువులకందరికీ సంతుష్టి కలిగింది. అందరూ ఎవరియిళ్లకు వారు వెళ్లిపోయారు.



"ఛా! ఛా! స్టుపిడ్ ఎలక్ట్రిషియన్!
—ఈ స్విచ్ తల్లక్రిందుగా
బిగించేశాడు!"

ఇవ్వాళ్ళకి ఇంటికి వెళ్ళడానికి అవకాశము చిక్కి ఊరుశివారులో ఉన్న తనయింటికి ఎలమ్మ బయల్దేరింది. ఆమె సంతానం ఇద్దరు కొడుకులూ ఒక కూతురూ. కూతురు పెళ్ళయి అత్తవారింట వుంది. పెద్దకొడుకు లచ్చన్న భార్యతో ఇంట్లో తన దగరే ఉంటున్నాడు. తను ఇలు సమీపంగా వచ్చేసరికి గుడిసెలో కొడుకూ కోడలూ దేనికో తీవ్రంగా పోరు చేసుకుంటున్నారు. ఇద్దరినీ కూకలేస్తూ విసురుగా ఆమె లోపలికి వెళ్ళిపోయింది.

లచ్చడో విచిత్రవ్యక్తి. వీడు 'స్వంత ఇంటికి శని, పొరుగింటికి పోలేరమ్మ' అన్నట్టు ఆమె బ్రతుకుకి దాపురించాడు. ఇంటిపనీ స్వంతపనీ అంటే పరమసోమరి. ఎంత చిన్న పనికీ ఇతరులు పిలిస్తే ఆసక్తితో సాయం చేస్తాడు. వ్యవసాయం పనులలో బహుదిట్ట. అందరికీ సలహాలిస్తాడు. అందరి దగ్గిరా తలలో నాలికలా మెసులుతాడు. తాతల నాటినుండీ వస్తున్న తన ఎకరా మెటమాత్రం బాగు చేసుకోడు. కానీ పుచ్చుకోకుండా అందరి గుడిశెలూ నేస్తాడు. తన గుడిశె మాత్రం రెండేళ్లయి నేత లేక అలాగే కారుతూ ఉంది. ఊళ్లో ఏ జట్టీ వచ్చినా తన మధ్యవర్తిత్వం తప్పనిసరి. తను లేనిదీ ఏ కోడిపందెమూ, పొట్టేళ్ళ పందెమూ జరగడానికి వీలులేదు. గొప్ప మాటకారి. సబబులు తెలిసిన ఘటం. తన తీర్పుకు అంతా కట్టుబడి ఉండవలిసిందే—కాని తన పెళ్లాంతో మాత్రం సమంగా వాదించలేడు, ఆమె వాగ్ధాటి గంగాప్రవాహమే. యుక్తికి పది యుక్తులు, సబబుకి పదిసబబులు, మాటకి పది మాటలు ఏకధాటిగా అనగలిగిన ఆమె నేర్పుకు లచ్చడు బాగాతగ్గి తిట్టుకుంటూ అవతలికి పోతాడు.

లచ్చడు అప్పుడప్పుడర్ధా, రూపాయో ఏదో వేళావిశేషంలో తెచ్చి తల్లి చేతులో

పెడతాడు. తరుచుగా పట్టి చేతులతోనే ఇంటికి వస్తాడు. ఇలా వచ్చిన నాడు తల్లిగాని భార్యగాని ఏమన్నా వాళ్ళను తిట్టి చెయ్యి చేసుకుంటాడు. వీడేమో ఆర్జించి తన దినం తీరుస్తాడనే నమ్మకం లేక ఎల్లమ్మ ఊళ్ళో ఆయింటా ఈ యింటా దాసీ పని చేసుకుంటూ కోడలిని కూలీపనులకుపంపుతూ పొట్ట పోషించుకుంటున్నది. తన రెండవ కొడుకు వెంకడిని దూరగ్రామంలో బంధువులయింట కంబారిపనికి కుదిర్చింది. వీడి ఆర్జనా అంతంతమాత్రమే. వీడికడుపు జరిగిపోవడమే పదివేలని ఆమె అనుకుంది.

పనికిమాలిన లచ్చుడికి దుష్టసహవాసమూ, త్రాగుడూ, జూదమూ వంటి ఆత్మవినాశక చేష్టలబ్బడంలో ఆశ్చర్యం లేదు. అవి అరోజు కారోజు అధికమౌతూ, చివరికి తనకీ కోడలికీ భరించలేనంతగా పరిణమిస్తూ వచ్చినవి. ఈ సమయంలోనే వెంకట్రామయ్యగారి చావూ, అందులో తను చేసిన నిర్వాకమూను. ఇప్పుడామెకి మరో సంకటం పట్టుకుంది. ధనం ఇంట్లో దాచినటు లచ్చడి కేమాత్రం గాలిసోకినా మరేమేనా ఉందా? మంచినీళ్ళలాగు డబ్బూ కరిగిపోతుంది. తను చేసినపని నలుగురికీ తెలిసిపోతుంది. కాని చిత్రమేమంటే, తనుచేసిన పనికి ఎలమ్మ మనసు బాధపడలేదు. పాపభీతి కలగలేదు. ద్రోహం చేసినటు ఆమెకంత కన్నా తటలేదు. మీగు మిక్కిలి తన తెలివికీ నేర్పుకీ తనే తృప్తిపడ్డది. సంతోషించింది. తోటి దాసీపనివాళ్ళుమాత్రం ఏమి చేస్తున్నారుగనక! సమయం చిక్కితే ఏవెండిగిన్నో కంచమో, పిల్లల మెలబిళ్లో చిక్కబట్టి, యజమానులతో ఘర్షణ వచ్చినప్పుడు వెయ్యి అబద్ధాలాడి తప్పించుకోలేదా? కుదువ బెట్టిన తన నగకెలాగూ చిక్కబట్టుకోవాలి గదా. దానితో మరికొంత తెచ్చుకుంది. చేతికందించి చిక్కబట్టుకోవడం ఎవరు మానగలరు?

ఎప్పటిలాగే ఎల్లమ్మ శేషమ్మగారింటికి వెళ్ళి తన పని చేసుకుంటూనే ఉంది. దశాహం తంతు జరిగిన తరవాత శేషమ్మ అవస్థ చూసి అందరు బంధువులూ ఏడ్చారు. ఎల్లమ్మా ఏడ్చింది. శేషమ్మకి తగనికష్టం దేవుడు తెచ్చిపెట్టేడని అందరూ అంటే, ఎల్లమ్మ అనుకుంది దేముడే తెచ్చిపెటిన కష్టానికి ఎవరేమి చెయ్యగలరని అనుకుంటూ మనసు సమాధానపరుచుకుంది.

భర్త పోవడంతో శేషమ్మ పూర్తిగా మారిపోయింది. తన వంటిమీది బంగారమంతా పైకితీసి కూతురికి కొంత ఇచ్చివేసి మిగిలింది అమ్మి డబ్బుచేసుకుంది. అల్లే అత్యవసరంకాని వెండి, పాత్రసామానులూ నగదుగా మార్చివేసింది. నోములూ వ్రతాలూ కటిపెట్టి పూజలూ ఉపవాసాలూ జపాలూ ప్రారంభించింది. పేరంటాలకు బదులు భగవద్గీత పారాయణా, పిచ్చాపాటీ బదులు పంచదశీ పఠనమూ ప్రారంభించింది. అధ్యాత్మ రామాయణమూ, యోగవాశిష్ఠమూ టీకతో సహా చదివించుకొని ఆసక్తిగా వింటోంది. ఏదో మిషమీద నలుగురు బంధువులనూ పిలిచి ఇంత పప్పుకూడు పడేస్తుంది. బీదా బిక్కీలాంటి బికారీ వాళ్ళని పొమ్మనకుండా ఇంత పులుసూ అన్నమేనా పెడుతు, ఎవరే యిబ్బందిలోపడి తన్నరించినా తను లేదనకుండా అంతో యింతో సాయం చేస్తూ, ప్రశాంతంగా, తృప్తిగా, పారమార్థికంగా జీవితం సాగిస్తున్నది. ఎవరియింటఏమి కష్టం వచ్చినట్టు తనకు తెలిసినా శేషమ్మ తప్పకుండా తను స్వయంగా వెళ్ళిగాని, పనిమనిషిని పంపిగాని వారికి తగిన సాయం చేసేది. ఇన్ని విధాల అందరనీ ఆదుకుంటున్న శేషమ్మ తన కష్టసుఖాలలో తన్నుకని పెడుతూ తనతో నేఉన్న ఎల్లమ్మను మరిచిపోతుందా? ఎల్లమ్మ ఇప్పుడు మరీ అభిమానపాత్రురాలైంది. దరిదాపు అన్ని రోజులూ ఎల్లమ్మతిండి ఇక్కడే. బోలెడు 'మిగుళ్ళూ తగుళ్ళూ' ఎల్లమ్మవే. అవన్నీ గంపలో ఇంటికి మోసుకుపోయి రాత్రిపూట తనూ కొడుకూ కోడలూ కడుపునిండా తినేవారు. శేషమ్మగారి యింట్లోని పాతపుడలూ చీరలూ ఎలమ్మకే దక్కేవి 'పంతులుగారి' పాతచొక్కాలూ, కోట్లూ ఎల్లమ్మకొడుకే తొడిగి కులికేవారు. శేషమ్మగారి కుటుంబంలో తానూ ఒకరైనని ఎల్లమ్మ ఇప్పుడు పూర్తిగా నమ్మింది. ఆమె అందరిదగ్గిరా శేషమ్మ మంచితనమూ, ఈవి, దైవచింతా మొదలైన సుగుణాలు చాటుతూ, విరుద్ధంగా అన్నవాళ్ళతో వాదోపవాదాలకి దిగేది.

ఒకనాడు మధ్యాహ్నము ఒంటిగంటవేళ ఎల్లమ్మ హుటాహుటిగా శేషమ్మగారింటికి వచ్చింది. శేషమ్మ నిద్రపోలేదుగాని, ఎండ కాస్త తీవ్రంగా ఉంటే చావిడిలో చాపమీద పడుం చేరవేసి ఏదో పుస్తకం చూస్తున్నది. మూడురోజులక్రితమే వచ్చిన కుమార్తె గదిలో నిద్రపోతున్నది. పిల్లలు పెరటిలో ఏదో సందడిచేనూ ఆడుకుంటున్నారు. ఎలమ్మ చూసూనే శేషమ్మ అంది: "ఏమే ఇప్పుడేగదులే వెళ్లేవు? ఇప్పటి కిప్పుడే ఏమొచ్చిందే ఎల్లమ్మా?"

గాబరాపడుతూ ఎల్లమ్మ అంది: "లచ్చిగాడికి జొరమొచ్చిందమ్మా. ఇయాలి కేడు రోజులయింది. ఏటో బయమేస్తుందమ్మగారు పిలిసే పలకడు."

శేషమ్మకి ఆత్రుత కలిగింది. "అమ్మా! అంత వరకూ వచ్చిందే? ఎవరికైనా వైద్యుడికి చూపించావా?"

"లేదమ్మా దానంతటదే తగ్గిపోదా అని ఊరుకున్నాను. ఇయాలచూస్తే యికటించింది."

"మరేం ఫరవాలేదులే. బహుశా నీరసం మీద మొహం తిరిగి ఉంటుంది. వెంటనే వెళ్ళి వాడికింత జావపట్టు, ఉండు చెప్తాను."

ఈమాటలంటూ శేషమ్మలేచి గదిలోకి వెళ్ళి మంచంకింద ఉన్న సందుకుపెట్టె ఇవతలికిలాగి, చావిట్లోకితెచ్చి, కొంగున ముడి కట్టిన తాళంతో మూత తెరిచి, అర్రలోంచి ఐదు ఇచ్చురూపాయిలు పైకితీసి ఎల్లమ్మతో అంది:

"ఇదుగో వైద్యుడిదగ్గిరికి పరిగెటి ఈ ఐదురూపాయిలూ చేతులో పెట్టు. అదేమిటే ఎలమ్మా!"

ఆమెకి ఎల్లమ్మ వైఖరిచూసి దిగ్భ్రాంతి కలిగింది. సందుకుపెట్టె తన కళ్ళపడిందో లేదో, కొడుకు గురించి బెంగపెట్టుకుంటున్న ఎల్లమ్మ తల గిర్రున తిరిగింది. బుర్రలో వెయ్యి సంగతులు దొరుతూ తిరిగిపోతున్నవి. మెరుపులా వెంకట్రామయ్య వచ్చి, "ఇంత స్వామి ద్రోహం చేసావే ముండా!" అని తిడుతున్నాడు. దశాహం నాటి శేషమ్మముఖందాగరంత పెద్దదిగా కనబడి.

"నిన్ను వెయ్యికళ్లతో చూసుకుంటున్న నన్నే ఇలా చేస్తావుటే భడవా!" అంటున్నది పదిమంది బంధువులూ తన చుట్టూ మూగి, తన వేపే వేళ్లుపెట్టి చూపుతూ, "ఈ ముండేనర్రా ఆస్తి కాజేసింది. మనందరి మీదా దొంగతనం మోపేరు. ఇదేనర్రా, ఇదేన్రా!" అంటూ గోలచేస్తున్నారు. తటాలున లచ్చడు మంచం మీద లేచి కూచొని "అంత డబ్బా అటక మీదటుకొని నుసస్తూంటే సూస్తున్నావంటే!" అంటూ అరుస్తున్నాడు.

"అదేమిటే!" అంటూ ఆశ్చర్యంతో అడిగింది శేషమ్మ. "ఆ వెర్రిచూపేమిటే? ఇందు, ఈ ఐదు రూపాయిలూ తీసుకొని వైద్యుడికియ్యి"

శేషమ్మ గొంతుక వినగానే ఎల్లమ్మ మళ్ళీ ఈలోకంలో పడ్డది. "అమ్మా!" అని గటిగా అరిచింది "నాకొద్దమ్మోయ్! నాకా డబ్బు వద్దమ్మోయి వద్దమ్మోయి! నాయినోయ్!" భయోత్పాతంతో నిండిన పెద్ద గొంతుకతో అరుస్తూ ఎల్లమ్మ అక్కడి నుండి పారిపోయింది.

ఎల్లమ్మ వడివడిగా సరాసరి ఇంటికే

(42 వ పేజి చూడండి)




[ఉద్యోగపర్వమునుండి]

క. ఏ నొకరుండన వచ్చెదఁ, గాని బలము చేసి నీవు గలిపినశస్త్రా
స్త్రానేకవిధ విలాసము, దాన వలయు సేన గాదె తథ్యం బరయన్.

వ. అని పలికి యతనికిం బ్రణమిల్లి చనుదెంచి సత్యవతి కింతయు విన్నవించి యద్దేవి యనుమతి వడసి సర్వసన్నాహ సమేతం బగు రథం బెక్కి విప్రాశీర్వాదంబులు సెలంగ వెడలి వచ్చి కురుక్షేత్రంబు దఱియం జనునెడ భాగీరథి భామినీరూపంబున నరుగుదెంచి తన్నాలింగించి మదీయభక్తి నభినందించి యే నాయితంబై పోవుటకుఁ గారణం బడిగి నాచేత నత్తెఱం గెఱింగినదియై నన్నుం గినిసి భార్గవుపాలికిం జని నీశిష్యుండు నిరపరాధుండు నాకొడుకున కలుగం దగునే యని చెప్పి యతనియందుఁ దిక్కు గానక మగుడ నేతెంచి నావలనను మెత్తంబాటు లేకున్నం జనియె నప్పుడు సిద్ధవిద్యాధరమునిగణంబులు గౌతుకంబునం గనుగొనుచుండ నేను జమదగ్ని తనయున కనతి దూరంబునం దేరు డిగి వినతుండనై నిలిచి నీవు భూచారివై యున్నవాఁడవు రథికుండనైన నాకు నీతోడ సమరంబు సేయ నగునే యనిన యనంతరంబ యతండు దివ్యంబు లగు రథరథ్యంబులు శస్త్రాస్త్రంబులునుం గలిగి యకృతవ్రణుండు సారథిగా సమరసన్నద్ధుం డై తోఁచినం జూచి రథారోహణంబు సేసి శంఖంబు పూరించి గుణంబు సారించి సూతు నగ్గించి తనకు నమస్కరించి కడంగిన నప్పరశురామదేవుండు.

## భీష్ముండు పరశురామునితో యుద్ధంబు సేయుట

క. శరవర్షము నామీఁదం, గురిసిన నే నాకసమునఁ గుదియించితి నా
యరదంబుపొంతకును న,చ్చెరువుగ నొకబాణ మైనఁ జేరక యుండన్.

క. ఒక మొగి నలువదియమ్ములఁ బ్రకటబలుం డైన పరశురాముఁడు నాయం
గకములు దాఁకఁగ నశ్వ,ప్రకరము నోనాట సూతుపైఁ బడ నేసెన్.

క. దానికి నవ్వుచు వేగం,బే నొకభల్లంబు దొడిగి యేసితి సాంద్ర
జ్యానాదభరితరోదసి, యైనతదీయోగ్రచాప మఱిముఱిఁ దునియన్.

ఉ. ఒండొకవిల్లు పుచ్చికొని యుజ్జ్వలరోషమహానలార్చు లొం
డొండ మొగంబుపై నెగయ నుర్వి చలింప గుణధ్వనిన్ సము
ద్దండతఁ దీవ్రమార్గణశతంబున నాయరదంబు ముంచె రా
ముండు వియచ్చరప్రకరముల్ వెఱఁ గందుచుఁ బ్రస్తుతింపఁగన్.

క. ఉఱక మదీయాంగంబులు, గిఱిగొన నల్లేయుటయును గినుక గదిరినన్
మెఱుఁ గారు నారసమ్ములు, దఱచుగ నించితిఁ గడంగి తద్గాత్రమునన్.

తే. ఉచ్చిపోయిన యేటుల నొలుకు శోణితమున సర్వాంగకంబులుఁ దడిసి యొప్పెఁ
జిగురుఁ దఱుచునఁ గెంజాయమిగిలి చెలువు, వడయు క్రొమ్మ్రానిచాడ్పున భార్గవుండు

క. నెత్తురు వడిసిన మూర్ఛా,యత్తుం డై సొగయుటయును నాతనిఁ గని యు
ద్వృత్తక్షత్రియధర్మో,పాత్తం బగు తేజ మొల్లఁ బాపై తోఁచెన్.

వ. అప్పుడు మనంబున నన్ను నేన గర్హించుకొనుచుండితి.

ఆ. అంతఁ దెలిసి రాముఁ డతికుపితాత్ముఁ డై, యేఱు వాఱు తెంచు నెసక మెసఁగ
నప్రమేయశరము లడరించె నవి సత్వ,రముగ నేను బ్రతిహతములు సేసి.

క. మరుదస్త్రమేయ గుహ్యక, శరమున వారించె నతఁడు సరభసముగ ను
ద్ధురశిఖిబాణం బేసిన, గురుఁడు వరుణవిశిఖనిహతిఁ గుదియం జేసెన్.

క. ఇమ్మెయి నతఁడును దివ్యా, స్త్రమ్ములు నామీఁద నేయ రయమునఁ బ్రతిఘా
త మ్మొనరించితి దివిజగ, ణ మ్మంబరవీథి, గీర్తన మ్మొనరింపన్.

తే. రాముఁ డంత్యకాలానలోద్దామలీల, మండి నాయురస్థ్సలి యొక్క మార్గణమున
నేసె నంతంత నున్న మునీశ్వరులును, గాశిరాజకన్యకయును గడఁగి యార్వ.

క. ఆ నిశితాస్త్రం బెయ్యది, యో నాకుం దెలియ దది మహోగ్రత నాటం
గా నొచ్చి పడితి నరదము, పై నప్పుడు సూతుఁ డచటు వాపె రథంబున్.

తే. చేతనుఁడ నయి యేను మత్సూతుఁ గినిసి, రాముఁ డున్నెడ కప్పుడు గ్రమ్మఱంగ
రథముఁ దోలించి బాణపరంపరాని, మగ్నుఁ జేసితి నంబనెమ్మనము దలఁక.

వ. ఇట్లు బహుప్రకారంబులం బోరుచుఁ బ్రొద్దు గ్రుంకినప్పుడు రణం బుపసంహరించుచు రేపకడ దొడంగుచుం బెనంగ నిరువది రెండుదివసంబులు చెల్లిన మఱునాఁటి కయ్యంబున నేనునుం గడంగి.

క. కడు బెట్టిదముగఁ గదియం, బడి హయములు నొవ్వ ధనువు భగ్నంబుగఁ జే
డ్పడి సారథి దెరలఁగఁ దన, యొడలు సిరుఁగ నేసినను మహోద్ధతి గురుఁడున్

క. ఒక శక్తి వైవ నఱకితి, నకుటిలముగ శక్తిదశక మడరించిన గ్రు
క్కక త్రుంచితిబహుశక్తుల, నికరము వరఁగించినం దునిమితిం బెలుచన్.

క. విస్మయము నొందుభార్గవు, నస్మత్కర మపుడు లాఘవారూఢముగా
సస్మితుఁ డగుచుం బటుదీ, ప్తి స్మేరాస్త్రముల నేసితిం బరవశుఁ గాన్.

వ. ఇట్లతండు మూర్ఛిల్లిన మునిజనంబులును నంబయు నధికశోకసమాకులత్వంబు నొంది హాహాకారంబులు సెలంగఁ బొదివి రంత,

ఆ. తెలిసి భార్గవుండు దృఢశిత్రవనారాచ, పంక్తిగురిసి నన్నుఁ బారవశ్య
మంది నేల కొఱఁగునట్లుగాఁ జేసి మత్సూతుమస్తకంబుఁ దునియ నేసె

వ. అట్టియెడ నెనమండ్రువిప్రులు సమానవయోరూపంబుల నొప్పువారలు నన్నెత్తి సేదదేర్చి రథంబుపయిం బెట్టి గగనగమనంబునం బోయి రంతకుమున్న మందాకిని మున్ను నాకన్న చందంబున నొగలపయినుండి మదీయ రథ్యంబుల పగ్గంబులు ధరియించి యున్నయది యేనునుం గనుంగొని నమస్కరించిన దీవించి చనియె వెండియు.

క. సారథ్యంబును జేయుచు, ధీరత వాటించి రామదేవునితోడం
గ్రూరాస్త్రంబులఁ జతురవి, హారం బొనరించితిని సురావలి వొగడన్.

## భీష్మునకు వసువులు స్వప్నసాక్షాత్కారంబున మోహనాస్త్రం బిచ్చుట

వ. ఇవ్విధంబునం బోరి సూర్యాస్తమయం బగుటయు నెప్పటియట్ల చని యే నారాత్రి యేకాంతంబున దర్భశయనంబుననుండి సురభూసురవర్గంబులం దలంచి భక్తిం బ్రణామంబులు సేసి పరశురాముని జయింపరాదయ్యెడు దినంబులు పెక్కులు సనియె నతని నాజి జయించుట గలుగునేని మీరు నాకుం దోఁచి యూఱడింపవలయు నని ప్రార్థించి నిద్రించుచుండం బవలు నన్నెత్తి రథంబుపయిం బెట్టిన యెనమండ్రును బ్రభాతసమయంబునం గలలోన వచ్చి

తే. నీవు నేమును నొక్కటి నీకు వెఱవ, నేల గాంగేయ రాము జయించునట్టి
శరము సుమ్మని మోహనాస్త్రంబు నాకు, నిచ్చి పోయిరి క్రమ్మఱ నెక్కడేని.

వ. ఏను మేలుకాంచి సంతోషించి తన్మంత్రస్వరూపంబును బ్రయోగోపసంహార ప్రకారంబులును జిత్తంబున నిలిపికొనుచుఁ గాలోచితకృత్యంబు లాచరించి యొక్క సారథి నంగీకరించి యరదంబు పూన్పించి సన్నద్ధుండ నై సత్వరంబుగా సమరంబున కరిగినం బరశురామదేవుండు.

క. నిన్న యఱ నచ్చి పోయితి, వున్నయఱయు నేఁడు దీర్చి యుడిపెద నీ గ
ర్వోన్నతి యిం కిట పోయెదు, నన్ను నెఱుఁగ వెట్టు లనుచు నాపైఁ గవిసెన్.

క. కవిసినఁ గడంగి యేనును, గవియించితి నంపవెల్లిఁ గడుఁ గ్రూరత భా
ర్గవుఁడును మద్గాత్రంబున, వివిధాస్త్రప్రతతి నించి వెగడొందించెన్.

వ. ఏనుం గోపించి,

తే. రయము మెఱయంగ నొక్క నారసము ఫాల దేశమునయందు నాటించి తీవ్రశక్తి
నురము వైచినఁ దూఁగాడి యొఱగ నూఁది పట్టి యకృతవ్రణుఁడు దేర్చెఁ బరశురాము.

క. అప్పుడు దెప్పిఱి కన్నుల, నిప్పులు రాలంగ నన్ను నిశ్చలదృష్టిం
దప్పక చూచి యలఁతిన, వొప్పెఁగ బ్రహ్మాస్త్రమాతఁ డుగ్రత నేసెన్.

క. తెగ గొని బ్రహ్మాస్త్రమ యేఁ, దగ నేసిన నొకటి నొకటి దార్కొని రెండున్.
గగనం బంతయుఁ దేజ, స్థగితముగాఁ జేసె సురలు దైత్యులుఁ దలఁకన్.

తే. సకల భూత సంక్షోభసంజనక మైన, యట్టియెడఁ గని యిది దక్షి యని తలంచి
మోహనాస్త్రంబు నంచితావాహనంబు, సేయుటయును జరాచరశ్రేణి మోసె.

వ. తదవసరంబున.

క. ఉడు గుడుగు మోహనాస్త్రము, విడువకు మను నెలుఁగుతోడ వేగంబున న
య్యెడ కేగుఁదెంచి నారదుఁ, డెడపడు టించుకయు లేక యిట్లను నాతోన్.

క. గురునకు నవమానము నిష్ఠురవృత్తిం జేసె దీవు సూచితిమే యి
ప్పురుసునఁ బరుసపునడవడిఁ, గురువంశప్రవర యిట్లు గూడునె చేయన్.

వ. అని సువ్యక్తంబుగాఁ జెప్పి.

క. వీ రెవసువు లాకసమున, గారవమున బుద్ధి సెప్పఁగా నీకడకుం
దా రేఁగుదెంచి రని క, న్నారంగాఁ జూపె నాకు నయ్యెనమండ్రన్.

వ. ఇవ్విధంబున నెప్పటివిప్రవరులు సన్నిధి సేసి నన్నుం జూచి నగుమొగంబులతో నెఱుఁగనివారపోలె నిట్లనిరి.

క. నారదముని త్రైలోక్యన, మారాధ్యుం డితనిపలుకు లాగమవాక్యో
దారములు వినుము వీనిం, గ్రూరత వాటింపఁ దగదు గురువిషయమునన్.

వ. అనిన విని యేను సమ్మోహనాస్త్రం బేయుట యుడిగి బ్రహ్మాస్త్రంబు దీపింపఁజేసితి నప్పుడు జామదగ్న్యుం డది యెల్ల నెఱింగి యోటమి యెక్కించుకొని చలంబు మిగిలి యున్నం దజ్జనకుండు జమదగ్నియుఁ దదీయపితృవర్గం బును నతనికి సన్నిధిసేసి వేఁడికొని శాంతవచనంబులం దేర్చి యిట్లనిరి.

క. వినుము వసుమూర్తి యీతం, డనన్యసామాన్యతేజుఁ డాహవభూమిన్
మనకు జయింప వశమె భీష్ముని విప్రున కగునె రోషమును మత్సరమున్.

తే. సమర ముడుగు నారాయణసఖుఁడు నరుఁడు సవ్యసాచి నా నిం కొకజన్మ మొంది.
యితని వధియించుఁ గాని తక్కితరజనములకు నసాధ్యుండు భీష్ముఁ డాలంబులోన.

వ అనిన నతండు వోక పెనంగిన వెండియు ననేక ప్రకారంబులం జెప్పి యమ్మునులు నాకడకుం జనుదెంచి యుప శమనవాక్యంబులు వలికి జామదగ్న్యుతోడం దమ యాడినమాటలు దేటపఱిచి యప్పుడు వొడసూపిన జాహ్నవియుం దారు బహువిధంబుల నన్ను ననునయించి భార్గవుపాలికి నమ్మహాదేవిం దోడ్కొని యరిగియుం గ్రమ్మఱ మత్స మీపంబునకు వచ్చియు నెట్టకేలకుం జలం బుడిపిన నే మిరువురమును దివ్యాస్త్రంబు లుపసంహరించి సమరం బుడి గితి మట్టియెడ నయ్యెనమండ్రు విప్రులుం జేరి నాతో నిట్లనిరి.

ఆ. గురుఁడు బ్రాహ్మవిదుఁ డకుంఠిత తేజుండు, పరశురాముఁ డతనిపాలి కీవు
భక్తి మెఱయ నేఁగి ప్రణమిల్లి తదనుగ్రహంబు వడయ వలయు ననఘ యిపుడు.

వ. అని చెప్పి యతనికడకుం దారును నారదమునీశ్వరుండును జమదగ్ని ప్రముఖులును భాగీరథియును జని నీశిష్యుండు దేవవ్రతుండు వానియెడ నలుగందగునె వాఁడు దగవు మాలినపనిఁ జేయంజాలక పెనంగె నింతియ కాని విరోధి గాఁడు వానిం గరుణింపు మని తెలిపి నన్నుం బిలిచినం బోయి యే నమ్మహాత్మునకు సాష్టాంగ దండప్రణామంబు సేసిన నతండు దీవనతో గ్రుచ్చి యెత్తి కౌఁగిలించికొని గాంగేయా నీశక్తికి భక్తికిం బ్రీతుండ నైతి నని సస్నేహం బుగా సంభావించి యంబ నవలోకించి నన్ను భీష్ముండు గెలిచె నావలన నయ్యెడుపని యింతియ నీవింక నీకుం జూడంబోలిన గతిం బొమ్మనిన నమ్మానిని దేవా యిది యిట్టిద నీయోపినంతయుం జేసితి నీచేతం బోకున్న నేమి సేయుదు నేను దపంబు పెంపున భీష్ముని వధించెద జన్మాంతరంబున నైననుం జలంబు సాధ్యంబు సేయుదు నటు సూడు మని పలికి పోయెఁ దదనంతరం బ యమ్మునిజనపితృదేవతా సమూహంబును భృగునందను నన్ను నామంత్ర

ణంబు సేసి యంతర్ధానంబు సేసె భార్గవుండును నన్ను వీడ్కొలిపి మున్ను దనతో వచ్చిన తపోధనవర్గముం దానును మహేంద్రశైలంబునకుం జనియె నేను మగిడి యెడ నెడ నుర్వీసురుల యాశీర్వాదంబులు సంభావనవచనంబులుఁ బ్రస్తుతివాక్యంబులుఁ గర్ణంబుల కింపు సేయ నిటవచ్చి సత్యవతికి నమస్కారపూర్వకంబుగా నంతయు నెఱింగించిన నద్దేవి యభినందించి.

## నారదుఁడు భీష్మున కంబవృత్తాంతం బంతయు జెప్పుట.

తే. అంబవృత్తాంత మరయంగ ననుదినంబుఁ దగిన వారలఁ బుచ్చుచుఁ దలఁకు చుండు
నేను నది యాదిగాఁ జింత నేపు దక్కి క్రుక్కి యుండియు రాజులు సుక్కు మడఁతు.

వ. ఒక్కనాఁడు పారాశర్యనారదాదులం గని యక్కార్యంబు భయంబు దోఁప విన్నవించిన వారలు దైవాధీనం బగుదాని మానుషంబున మానిపింప వశంబుగా దాచింత విడువు మని రందు నారదుం డక్కాశీశ్వరకన్యక తెఱంగు వినుమని యిట్లనియె.

సీ. ఆతన్వి యమునానదీతీరమున కేఁగి యత్యుగ్ర మగు తప మాచరించి
యందుండి కౌశికు నావాస మాదిగాఁ గలుగు సిద్ధాశ్రమంబులకు నెల్లఁ
జని చని తత్ప్రదేశంబుల నిష్ఠుర వ్రతములు సలుపంగ వచ్చి నీదు
జనని జాహ్నవి యిట్లు వనితల కతిదుష్కరము లగు బహునియమములు నీకు

తే. నడపఁ గత మేమి యనుడు నన్నాతి వలుకుఁ దద్ద యవమానపడితి శాంతనవుచేత
నపరజన్మంబునం దైన నతనిఁ జంప నేను జాలుటకై యిట్టిదాననైతి.

వ. అనిన విని భాగీరథి కుటిలప్రచార వగుట నీ వీతనువు విడిచి యేఱయి పాఱంగల దాన వింతియ కాని యెందుఁ గానేర వనిన నవ్వెలంది నవ్వుచు సరకుసేయక తిరిగి తొంటికంటెను దీవ్రం బగు తపశ్చరణంబునం బ్రవర్తిల్లుచు మత్స్యదేశ వాసినియై యుండి యొక్కనాఁడు నిజవ్రతఫలంబులో సగంబున నంబ యను పేర నదియై యమ్మండలంబునం బరఁగి యున్నసగంబునను దనరూపు సెడకుండ వహించుకొని జాహ్నవీప్రభావంబు నాత్మీయప్రభావంబున గెలిచి వెండియు.

క. పుణ్యాశ్రమదేశముల న, గణ్యం బగు తపము సేయఁ గా రుద్రుఁడు గా
రుణ్యము వాత్సల్యము దాక్షిణ్యము మెఱయంగ నింతికిం బొడసూపెన్.

క. మును లచ్చెరు వంది కనుం, గొన శంభుఁడు నిల్చి వరముఁ గోరు మనుడు భీ
ష్మని నాకుఁ జంపఁగా దొర, కొనునట్లుగ నొసఁగు మనియెఁ గోమలి యెలమిన్.

వ. అనవుడు నద్దేవుఁ డట్ల కాక యని యనుగ్రహించిన నంబ యెత్తెఱంగున నది యయ్యెడు నని యడిగిన.

సీ. ఈ మేను విడిచి నీ వేఁగినయప్పుడు, ద్రుపదభూవిభునకుఁ దొల్త పుత్రి
వై పుట్టి పిదపఁ బుత్రాకృతిఁ గాంచి శిఖండినామమున నుద్దండబాహు
బలమునఁ గోదండ పాండిత్యమును బటు, శౌర్యంబు నొప్పఁ బ్రశస్తి కెక్కి
యనిఁ జంపఁగలదాన వాతని నామాట, దప్ప దూఱడు మని చెప్పి హరుఁడు

తే. ననియె నా ప్రొద్దు సమిధలు సాలఁ గూడ, వైచి యనలంబుగూర్చియ వ్వనిత క్రోధ
దీప్తమూర్తియై భీష్మువధించుదాన, ననుచు సొదసొచ్చె మునులకు నద్భుతముగ.

వ. అట్టియెడ ద్రుపదుం డనపత్య యగు తనమహిషివిషాదంబు దీర్పం దివురుటను గాంగేయుతోడి రోషంబునను శివుని నుద్దేశించి తపంబుసేసిన నద్దేవుండు ప్రత్యక్షం బయి వరంబు వేఁడు మనిన భీష్మ వధియించునట్టివాని నొక్కపుత్రుని నొసంగవలయు ననుడు.

తే. కూఁతురై పుట్టి పదపడి కొడుకుఁదనము, గాంచి భీష్ముని నాజిరంగమునఁ జంపు
నట్టి యుజ్జ్వలాపత్యంబు పుట్టు నీకుఁ, దప్ప దిది యని రుద్రుండు సెప్పి చనియె.

వ. ద్రుపదుండును బ్రీతుం డయి నిజప్రియకు నవ్విధం బెఱింగించెఁ దదనంతరంబ కాశీశ్వరకన్యాచైతన్యం బుదరంబు ప్రవేశించిన.

క. పాంచాలరాజభార్య న, మంచితగర్భంబుఁ దాల్చి మఱువడఁ గూఁతుం
గాంచి నిజపతియుఁ దానును, వంచనఁ గొడు కనిరి యెల్లవారును వినగన్.

★

ఇవ్వాళిమాట కాదు; పదేళ్ళనాటి మాట.

అప్పటికింకా రాజు కూడా పుట్టలేదు. ఆరోజు జరిగింది జ్ఞప్తికివస్తే ఇప్పటికీ నాకు చక్కిలిగింతలు పెట్టినట్లు నవ్వవస్తుంది.

"ఏమిటి? ఏమిటి?? అలా నవ్వుతున్నావ్...నువ్వొక్కదానివే సంతోషించటమేం? నాకూ కూడా చెప్పు. విని నేనూ సంతోషిస్తాను," అంటారు ఆయన.

"అబ్బే. ఏం లేదండి......ఆనాడు సినిమాకు పోలేదూ..."

ఆయన గ్రహిస్తారు. వివర్ణమవుతుంది వారి మొహం. నేను మెళ్ళో వేయబోతున్న నవ్వుల పువ్వులదండను పుటుక్కున తెంపి నా మొహానకేసి కొడ్తారు. పరిస్థితి హాస్యానికి వీడ్కోలిచ్చిందని తెల్సుకుని వచ్చే నవ్వు నాపుకుంటాను. ఇహ చూసుకోండి ఆనాడు నా అవస్థ ఆ ఆపద్బాంధవుని కొక్కడికే అవగతం!

"అన్నానికి లేవండి."

మాట్లాడరు. ఇటునుంచి అటు వత్తిగిలి పడుకుంటారు.

"అప్పుడే పదిగంటలవుతున్నదండి."

ఊహూ! అప్పుడే లేస్తే ఇంకా నా అవస్థేముంది!

"అన్నం చల్లారి పోతున్నది. వేడిగా ఉంటేగాని మీరు తినరాయెను. ఎలా చచ్చేదండి నేను మీతో?"

ఈమాటలకి పెదిమలు కదిలిస్తారు.

"నీకు చావే మెచ్చు. పొట్టఉబ్బేటట్లుగా నవ్వుకుంటున్నావుగా. ఆరోగ్యం ఎటువంటి రోగం నీకు రానీయదు."

"చెంపలేసుకుంటున్నాను. ఇంకెప్పుడూ......"

దీపందగ్గర కూర్చుని చదువుకుంటున్న రాజా నోటికి చెయ్యి అడ్డుపెట్టుకుని మెత్తగా నవ్వుతాడు.

"కుక్కబుద్ధి నీది. ఇలా ఎన్నిసార్లనలేదూ?"

"ఇహ లేవండి. సాగదీసినకొద్దీ మొండికేస్తారు మీరు. రాజా నవ్వుతున్నాడు కూడా—మీ అలుక చూసి. పెద్దవాళ్ళమైనందుకు......"

ఎవరో తట్టి నిద్రలేపినట్లు అప్పుడు ఒకసారి మంచం మీద నుంచి క్రిందకు గెంతుతారు.

నాకెంత ఆలోచించినా అందులో ఆయన సీరియస్‌గా తీసుకోవాల్సిందేమీ నాకు కన్పించదు. హాయిగా అందులోని హాస్యాన్ని ఆయనా పంచుకుంటే అందమూ, ఆనందమే కాక ఆరోగ్యం కూడాను.

చెప్పొద్దూ—అప్పుడప్పుడు, సంధ్యవేళ, ఆరుబయట పడుకున్నప్పుడు అనిపిస్తుంది గదా—నేనేగనుక ఆరోగ్యశాఖామంత్రిణినయితే ఆసుపత్రులలో మందులుంచను; శరీరానికి చక్కిలిగింతలు పెట్టి, మనసుకు హాయినిచేకూర్చే హాస్యరచనలుంచుతాను. డాక్టర్లవసరంలేదు; స్పష్టంగా, భావస్ఫోరకంగా, వినసొంపుగా చదవకలిగేవాళ్ళు కావాలి (ఆడవాళ్లకు ప్రిఫరెన్సు ఉంటుందనుకోండి)

ఈ ప్రణాళికమీద నాకింత ప్రగాఢ విశ్వాసమెందుకూ—అని మీరు ప్రశ్నించవచ్చు. నేనింతవరకు ఒక్కపూటయినా మంచమెక్కలేదు. పిల్ల ఆ విషయంలోనూ అంతే! తల్లి ఆరోగ్యంగా ఉంటే పిల్లల నారోగ్యంగా ఉంటారా?

ఇలా ఊహించుకుంటూ ఉంటానా ఆనాటి సంఘటన సినిమాలాగా కళ్లముందు సాగిపోతుంది.

* * *

సాయంత్రం అయిదుగంటలయింది. జడ వేసుకుందామని కూర్చున్నాను.

"అమ్మాయోయ్! నీకు జడవేసి ఎన్నాళ్లయిందో నే! ఉండు వస్తున్నా." అంటూ అమ్మవచ్చి కూర్చుంది.

అమ్మ జడవేసి ఎన్నోఏళ్లు కాలేదు. మహా అయితే నాలుగు నెలలయి ఉంటుంది. దసరాకు పుట్టింటికి పోయినప్పుడు రోజూ అమ్మేగా తలదువ్వి జడవేసేది.

అడగందే అమ్మయినా పెట్టదంటారు. నేనడగకుండానే అమ్మవచ్చి తలదువ్వుతానంటె నేనెందుకు వద్దనాలి—అనుకుని నూనెసీసా అమ్మ చేతికిచ్చాను.

నూనె రాసి జడ అల్లుతున్నది.

ఏవేవో ఆలోచనలు మనసులో జడ అల్లుకుంటున్నయ్—పుట్టి పెరిగిన ఊరు వదిలిపెట్టా. ఇంకో ఊరు మెట్టాను—తల్లిదండ్రులకూ, అన్నదమ్ములకూ, అక్క చెల్లెండ్రకూ, స్నేహితులకూ దూరమయాను. కొత్తలోకంలోకి ఇష్టమున్నా లేకపోయినా ప్రవేశించాను. ఇక్కడి అనుభవాలూ, అనుభూతులూ పూర్వానికి పూరిగా భిన్నం. నోరు మంచిదయితే ఊరు మంచిదవుతుందంటారు. అందులో నాకు నమ్మకం కన్పించటంలేదు. నానోటిని నేనగుప్పులో పెట్టుకుంటేమాత్రం ఎదుటివారు మర్యాదగా ప్రవర్తిస్తారని హామీ ఏమిటి?...

"రిబ్బను ఏదే అమ్మాయ్?" అమ్మ ప్రశ్నించింది.

రిబ్బను ఇచ్చి అద్దంలో చూసుకుంటే రెండు జడలు భయంభయంగా వీపుచాటున దాక్కుంటున్నయ్.

నా ఒళ్ళు మండింది కోపంతో. ఆ రెండు జడలూ బలిసిన గొంగళి పురుగులా కన్పించి ఒంటికి కంపర మెత్తించినయ్. కాపురానికి రాని ముందు రెండు కాదు నాలుగుజడలు వేసుకున్న రోజులుకూడా ఉన్నాయి. కాపురానికి వచ్చింతర్వాత ఒక జడేసుకుంటున్నాను.

విద్యార్థి జీవితానికి, వైవాహిక జీవితానికి సరిహద్దు వెంట్రుకవాసే అయినా అంతరం కొండంత. ఆనాటి సర్దాలు, షికార్లు, కలలు వేలు; ఈనాటి బాధ్యతలు, బరువులు, సత్యాలు అందుకు భిన్నం.

విద్యార్థిజీవితంలో రెండు (సమయానుకూలముగా రెట్టుమారును-అన్నట్లు ఒక్కొక్కప్పుడు నాలుగు, అయిదు) జడలు వేసుకుని, స్లిప్పర్స్ తొడుక్కుని, ఒంటిమీద నిలవకుండా నిమిష నిమిషానికి జారిపోయే జార్జెటుసిల్కు చీర పమిటను ఒకచేత్తో సర్దుకుంటూ, రెండోచేత్తో నాజూకుగా పుస్తకాలో (కాలేజీకి వెళ్ళే సమయంలోనయితే) లేక హాండ్‌బాగో (షాపింగుకయితే) పట్టుకుని రోడ్డుమీద పోతుంటే—వెనకబడే విద్యార్థులవెకిలిచేష్టలకు కోపగించుకోకుండా, బాధపడకుండా (కోపగించుకున్నా, బాధపడ్డా లాభంలేదు కాబట్టి) స్పోర్టివ్‌గా తీసుకుని వాళ్లని వెంట తిప్పుకునే అనుభూతికీ, అనుభవానికీ-సాంసారిక జీవితంలో కూడా గురికావటం హాస్యాస్పదంగానూ, అమర్యాదగానూ ఉండదూ!

ఉంటుంది అనటానికి నిదర్శనం—మా చెల్లెలు పెళ్ళికి పోతూ కొత్తసిప్పర్లు తొడుక్కుపోయి నేనూ, మావారుపడ్డ అవస్థే!

"ఇంకో రిబ్బను లేదుటే?"

"నన్నడగకుండా రెండుజడ లెందుకేశావ్?" నాకోపం మాటల్లో సగం చూపించి, శేషార్థభాగంతో వేసినజడ విప్పబోయాను.

"మాతల్లికదూ! నాకు మనసయి అల్లాను రెండుజడలు. ముందుగా నీకు తెలిసే ఒప్పుకోవనే చెప్పకుండా వేశాను. రెండో రిబ్బను తీసుకురా..." అని అంటూన్న అమ్మ మాటల్లో ఆమె హృదయంలోని కోరిక ప్రతిఫలించి మంటలాఎగసిన నాకోపాన్ని ఆర్పేసింది.

రెండో రిబ్బను తెచ్చిఇచ్చాను.

"ఎందుకేఅమ్మా! ఇప్పుడు రెండుజడలు. ఇక్కడకు వచ్చింతర్వాత వేసుకోవటం మానేశాను. అదిగాక ఇవ్వాళేమయినా పెళ్లా, పేరంటమా?"

"పెళ్లీ, పేరంటమూ లేకపోతే పిక్చర్లు లేవూ? ఈపూరొచ్చి ఎన్ని సినిమాలు చూశావో నాకు చెప్పు ముందు?"

అకస్మాత్తుగా అమ్మవేసిన ప్రశ్నకు వెంటనే నేను సమాధానం చెప్పలేకపోయాను. నేను వచ్చి నాలుగు నెలలయింది కాని ఒక్క సినిమా చూసినపాపాన పోలేదు. ఇదేగనుక మాఊళ్లోనయితే ఎంతలేదన్నా నాలుగు మూడులు—అంటే పన్నెండు—చూసేదాన్ని. ఇక్కడకు వచ్చినప్పటినుంచీ వారికి ఆఫీసువర్కుతో క్షణం తీరికఉండటం లేదు. కాని ఆమాట చెప్తేఎలా? అమ్మ దెప్పిపొడుస్తుంది. ఇంత ఆలోచించి—

"అబ్బే! చాలాచూశా. లెక్కలేదు" అన్నాను.

అదేమిటే! లెక్కలేనన్ని చూశావా! ఆ అబ్బాయికి నీకు సినిమాలు చూపించటం తప్ప వేరే పనేమీ లేదా ఏమిటి? ఉద్యోగానికి రాజీనామా ఏమయినా ఇచ్చాడా-నాకు తెలియక అడుగుతాను"

అమ్మ నోరునొక్కుకుంది.

# శ్రీవారితో సినిమాకు

వారిభగవంతుడా! మంచికిపోతే చెడు ఎదురయిందన్నట్లుగా ఉండేపరిస్థితి అనుకుని—

"అహా. అదికాదే లెఖ్ఖలేదు - అంటే లెఖ్ఖలేనన్ని అనికాదు. లెఖ్ఖపెటలేదూ అని నా ఉద్దేశం. ఇప్పుడు గుర్తొచ్చినయ్ లే. మూడు సినిమాలే చూసింది. ఈ నాలుగు నెలలనుగాను. సగటున నెలకు ఒకటికూడా పడలేదు ఇంతాచేసి."

"ఊ! అలా అన్నావు బాగుంది. నేచెప్పినపని చేస్తావా?" అని ప్రశ్నించింది అమ్మ, కొంచెం చల్లబడి.

నువ్వు చల్లబడాలేగాని నేను చేయందేముంది అనుకుని "అమ్మ! నే చెప్పేదయినా నీమాట కాదన్నానా చెప్పు." అన్నాను (ఇప్పుడు గురులేదెగాని బహుశా బుంగమూతి కూడా పెట్టే ఉంటాను.)

"కాదన్నావని నేనన్నానా చెప్పు..." కూతురుమీదిగ అమ్మే ననిపించింది.

"అహా, నువ్వనలేదనుకో..."

"మీఆయన రాగానే చక్కగా ఇద్దరూ కలిసి సినిమాకు పోయిరండి."

వెనకటికెవడో వాడా దొరికిందని అశ్వాన్ని, బండినీ కొన్నాడుట. రెండు జడలు వేసుకున్నానుగదా అని సినిమాకు పోవాలి!

వారి ఉద్దేశమెలా ఉందో కనుక్కొని పోవచ్చు ననుకుని నీళ్లుపోసుకుని చీరకట్టుకున్నాను.

అంతలోకి వారు ఆఫీసునుంచి వచ్చారు. చీలమండలకడ్డం పడుతున్న కొత్తధోవతిని చేత్తో పైకిపట్టుకుని. అది ఆఫీసులో కనీసం ఒకసారయినా ఊడకుండా ఉందాఅని నాకు సందేహం కలిగింది.

వారు ధోవతి కట్టుకున్నదల్లా పెళ్ళిలోనూ, శోభనంనాడూను. పెళ్ళినాడు వాళ్ల మేనమామ కట్టాడుట. శోభనంనాడు మాత్రం తనే కట్టుకున్నానంటారు— అదెంతవరకు నిజమోగాని. ఎప్పుడయినా నేర్పుకోనేయండి మొత్తానికి ధోవతి కట్టుకోవటమంటూ చేతనయిందిగాని కట్టుకుని ఊడిపోకుండా నడవటం, ఫ్రీగా ఫీలవటం ఇంకా అలవాటు కాలేదనే చెప్పాలి.

సెలవు దొరక్కపోవటంతో సంక్రాంతి పండుగకు పుట్టింటికి పోవటం అందుకని అమ్మ కొత్తచీరా, కొత్తధోవతుల చాపూ తెచ్చింది. ఆ ధోవతి వారికీయమంటుంది.

"ఆఫీసుకెందుకే అలవాటు లేని పోపోసన ఇంట్లో కట్టుకుంటారులెద్దూ" అని నేనంటే ఊరుకుంటా? ఊహూ!

"కొత్తది తెచ్చినందుకు కట్టుకోమనవే నువ్వుమరీను అతను కట్టుకోనవలేదుగా."

తామపెట్టిన కొత్తబట్టలు అల్లుడు కట్టుకుంటే చూడాలని అమ్మ సర్దాపడుతున్నదిలే, కానీయమనుకుని, ఆఫీసుకు పోవటానికి తయారవుతున్న వారికీ విషయం చెప్పాను.

"ఆఫీసుకు ధోవతే! ఇంకేమయినా ఉందీ!"

ఎక్కడ ఊడిపోతుందో నహ—సుహాస్యాలముందు పరిహాసాల పాలు కావాల్సి వస్తుందేమో—నన్న భయంతో వారు అదిరిపడారు.

"కాని మా అమ్మ మనసు పడుతున్నదండి."

"కాదనవాక. కొత్తవి పంపించారు మీ మామగారు. పండగకు రాలేదని ఎంతగానో అనుకున్నారాయన. ఆయన పంపించినందుకూ, నేను తెచ్చినందుకూ కట్టుకో. అమ్మాయికూడా చీర కట్టుకుంది..." అమ్మ గడపవతల నిల్చుని అందుకుంది.

వారిక మాట్లాడలేక పోయారు.

కష్టాల్లోఉన్న భర్తను రక్షించటం భార్య విధి అనుకుని—

"ఆఫీసుకు ధోవతి కట్టుకుని రాకూడదుటే..." అని బొంకాను.

"నన్ను మరీ అంత పిచ్చిదాని క్రింద లెక్కకట్టవాకే. నాకూ తెల్సును ఆమాత్రం అందరూ లాగూ చొక్కాలూ తొడుక్కుపోతున్నారా ఏం? ఎంతమంది ధోవతుల్తో పోవటం నేను చూడలేదూ?"

"సరేలే పద. కట్టుకుంటారు" అని నేనూ గదిలోంచి బయటకు వచ్చేశాను.

అయిదు నిమిషాలు. పది నిమిషాలు గడిచినయ్ వారు గదిలోనుంచి ఎంతకీ బయటకు రారే! ఏం తిప్పలు పడుతున్నారో అని గది వాకిట్లోకి పోయి చూద్దును గదా— లోపల పచార్లు చేస్తున్నారు. రిహార్సల్స్ కాబోలు. గోడచాటున నిల్చుని తొంగి చూస్తున్నాను. పది సార్లు అటూ ఇటూ నడిచేసరికి ధోవతి కాస్తా ఊడిపోయింది బెగురుకళ్లతో వాకిలివేపు చూశారు. నేను కన్పించాను.

గబగబా కట్టుకున్నారు. "బెల్ట్ పెట్టుకోండి—ఊడిపోకుండా ఉంటుంది" అన్నాను.

"గుడ్ అయిడియా!" అంటూ బెల్ట్ పెట్టుకుని వెళ్ళిపోయారు...నిర్భయంగా!

ఆఫీసులో ఎన్ని సారు ఆ ధోవతి భూదేవతకు సాష్టాంగ ప్రణామాలాచరించిందో ఆ సీతమ్మ తల్లికే తెలియాలి. ఇంటికిమాత్రం బాగానే వచ్చారు.

పొద్దున కటిన కొత్త చీరకాక మరొక కొత్తచీర, రెండు జడలూ, చూసేసరికే వారు గ్రహించి ఉంటారు...ఏదో ఉందని.

కాఫీగ్లాసు అందిస్తూ—"అమ్మ రెండు జడలు వేసి, వేశాను గదా సినిమాకు పోండి అంటున్నది—" అన్నాను.

"పోదామంటావా?"

"మీ ఇష్టం."

కొత్తగా కాపురానికి వచ్చినభార్య— సామాన్యమైన భార్యకూడా కాదు, ఏరికోరుకున్నది, అందమయినది (మా అమ్మ మాటల్లో చెప్పాలంటే)—నోరు తెరచి సినిమాకు పోదామా అని మొదటిసారి అడిగితే కాదనే నిగ్రహమూ ధైర్యమూ ఏ మగవానికుంటాయి? ఇలాఅన్నందుకు కొందరు మగవారు నామీద ఆగ్రహించవచ్చు. షివశ్రీ ఉన్న మా వారికి మాత్రం కాదనే ధైర్యం లేదు.

టైము చూశాను, ఆరుగంటలయింది. ఫస్ట్ షోకి ఇంకా పావుగంటమాత్రమే టైముంది. దగ్గరలోఉన్న హాలు రెండు ఫర్లాంగుల దూరం. వారు రిక్షా ఎక్కరు: సాటిమానవుని చేత తనను లాగించుకోవటం వారి మనసు ఒప్పని విషయం. నడచిపోవాల్సిందే.

"అయితే ఉండు. ఈ ధోవతి విప్పేసి, పాంటు వేసుకువస్తాను" అన్నారాయన.

"నా అనుమానం నిజమేఅయిందన్నమాట. ఆఫీసులో ఎన్ని సార్లు ఊడిందేమిటి?"

"అహా. ఊడిపోలేదు." అభిమానం బహుశా నిజాన్ని దాచేసి ఉంటుంది.

'మరింకేం ఉంచుకోండి... టైముకూడా లేదాయెను."

మెయిన్ రోడుమీదికి వచ్చాము. బయల్దేరబోయే రైలుకూతవిని పరుగులు తీసే ప్రయాణీకుల్లా జనం ముందు వెనుకా చూసుకోకుండా పోతున్నారు. ఉన్న గొంతు పెట్టుకుని గద్దించి సైకిల్ రిక్షాను పక్కకు తొలగించి ముందుకుపోతున్న సిటీ బస్సును మెత్తగా కొప్పడి వెనక్కినెట్టేసి స్టడీ కారు దూసుకుపోతున్నది.

ముంగుచూపేగాని పక్క చూపులేని నన్ను మల్లెపూల పరిమళం ఆకర్షించింది. ఎక్కడినుంచా యీ సుమసౌరభం అని చూశాను. విచ్చుకున్న మల్లెలూ, మల్లెల తెల్లదనాన్ని చూసి అసూయతో మొహం ఎఱ్ఱబుచేసుకున్న కనకాంబరాలూ వీటన్నింటినీ మించి అందాల హొయలు విరజిమ్ముతున్న ఎఱ్ఱ గులాబీలు.

"పూలు కొనుక్కుందాం ఆగండి:" అన్నాను ఎటో చూస్తూ నడుస్తున్న వారికి.

"ఆలస్యమవుతున్నది. అప్పుడే ఆరుంబావయింది టైము"

(47-వ పేజీ చూడండి)




## 39

నీలి తెల్లవారుఝామునే కొడుకును లేపి "అయ్యేడీ" అని అడిగింది మల్లు ఆదరా బాదరా లేచి అక్కడనుంచి పెరటికి వెళ్ళిపోయాడు. నీలి పెరటికి వెళ్ళి రెట్టించి అడిగింది ఆ చిన్ని మనసుకు అబద్ధం ఆడటం చేతకాక, అంతా చెప్తే అయ్యకి కోపం వస్తుందని నోరుమూసుకున్నాడు.

నీలి ఓక్షణం రెట్టించినా జబాబు రాకపోవటంవల్ల యెక్కడకో బయటకు వెళ్ళి వుంటాడని వూహిస్తుంది. మల్లు వీధిలో ఇటూ అటూ తిరుగుతూ అయ్యకోసం చూస్తున్నాడు. ఉదయభానుని కిరణాలు యేటవాలుగా పడుతున్నాయి. ఎవరి పనులు వారు చూసుకుంటున్నారు. ఆరాటంతో, దిగులుతో నిండిన యీ చిన్ని మనసుకు కాలం జాలం తెలియటంలేదు "అయ్య యింకా రానేదు. అయ్యకి యేం అయినాదో?" అనుకోసాగాడు అయ్యనిగురించి ఆలోచిస్తున్న కొద్ది యెగుటివాళ్ళపై కోపం ముంచుకొస్తోంది గబగబ యింటిలోకి వెళ్ళాడు ఇటుఅటూ చూసాడు. కర్ర అగుపించలేదు. పెరటికివెళ్ళి తడకలోని వెదురుపుల్ల విరిచాడు. నీలి యింత ప్రొద్దెక్కినా భర్త రాకపోవటంతో మల్లుని పట్టుకొని గట్టిగా అడిగింది. వాడు చేతులతో నోరమూసుకోవటంతో, కోపం విసుగూ ఆమెను చుట్టివేసాయి. ఎందుకో ఆమెకు భయంభయంగా అనిపిస్తోంది. ఎక్కడో యేదో అపకారం జరిగిపోయినటూ మనశ్శాంతి లేకుండా ఆదోలా అయిపోతోంది.

తల్లిచేత ఒక దెబ్బతిన్నా ఖాతరుచేయక మల్లు గబగబచేతినున్న యెగుడుపుల్లతో వీధిలోపడి గబగబ ముందుకు పరుగెత్తాడు. సరిగా రాత్రి వళ్ళిన త్రోవగుండానే ఆవేశంతో పరుగెత్తాడు. రాత్రి దాగున్న చెత్తల డొక్కదాటి ముంగుకు సాగిపోయాడు. "ఇదిగో యీ మేడలోకే మాఅయ్యవచ్చాడు. వీళ్లు మాఅయ్యని దాచేసినారు..." అనుకొని ఆయింటిలోకి ముఖం పొంగించి కోపంతో "మా అయ్యని యిత్తారా లేదా?" అని అరుస్తూ పరుగెత్తాడు.

ఎదురుగావున్న నౌఖరీమనిషి ఆ కుర్రవాడి దుడుకుతనానికి అబ్బురపడి అలా వింతగా చూస్తున్నాడు. మల్లు కర్రతో నేలమీద గట్టిగా కొట్టి "మా అయ్యని వదలకపోతే అందరినీ యీకర్రతో కొట్టేస్తాను." అరుస్తూ మళ్లీ క్రింద నాలుగుసార్లు గట్టిగాకొట్టాడు.

ఇంతలో లోపలనించి కాకీదుస్తులతో ఒకమనిషి రావటంచూసి మరికాస గట్టిగా. "ఊఁ...మా అయ్యనివ్వండి" అని అరిచాడు. నౌఖరీమనిషి యేదో అనబోతున్నా అనటానికి ఆస్కారం మల్లుయీయలేదు. ఆ పోలీసు యినస్పెక్టరు వసూనే నౌఖరుతో నవ్వుతూ 'ఈ పిల్లాడికి బిస్కతులు యిపం-తీసుకురా వేగం" అన్నాడు. నౌఖరు బయటకు వెళ్లాడు. ఇంతలో ఇంటినుంచి మంకొందరు పుద్యోగులు చేరారు.

మల్లుఆవేశం ఇంకా తగ్గలేదు. ఆవాగ్దాటి ఆగలేదు ఇన్స్పెక్టరు నవ్వుతూ "మీఅయ్య రాలేదు!"

"రాలేదా? అఁరాతిరే రానేదా?"

"తలుపులు యేసుంటే యెలావస్తాడు?"

"మాఅయ్యా మరిద్దరూ అలాగ గోడెక్కి రానేదా? నిష్ఠూరంగా మల్లు మాటాడుతూ మళ్ళీ పౌరుషంతో: "మాఅయ్యని వదిలేయండ – మాఅయ్య మామంచోడు!"

బిస్కట్లు వచ్చాయి. ఇన్స్పెక్టరు నవ్వుతూ "మీ అయ్యను వదిలేస్తాం. ఇవి ముందుతిను" అని చేతితో పెట్టుంటే అవి దూరంగా విసిరేసి. "నాకొద్దు–మా అయ్య కావాల!"

"ఒక్కటైనా తిను" అంటూ విసిరేసిన బిస్కటు మళ్ళీ చేతపెటినా పుచ్చుకోక "మాఅయ్యనిస్తావాలేదా?" అంటూ కర్ర ఇన్స్పెకరు వేపు కత్తిలా ఝళిపించాడు.

ఇనస్పెక్టరు ప్రసన్నవదనంతో 'మీ అయ్యపేరు చెప్పితేనే గాని యెలాగిస్తాను" అన్నాడు.

"ఇస్తావా?"

"ఇస్తాను!"

"మా అయ్య పేరే తెలీదా!—' పుల్లయ్య!"

"మరి మీ అయ్యతోవున్న యిద్దరిపేర్లో?"

# ★ దగాపడిన తమ్ముడు ★

"మా అయ్యపేరు సెప్తే మాఅయ్యనిస్తా వన్నావు?"

"ఇస్తాను. నేను అడిగినవన్నీ సెప్తే నీ మా అయ్యనిస్తాను"

"ముందు మాఅయ్యను సూపించు!"

"నే నడిగినవన్నీ చెప్తే నే నీకు అయ్య, లేకపోతే, ఇల్లిపో!"

"నేను యెల్లను — నాకు అయ్యనిచ్చి యెల్లిపోతాను" అని గద్దింపుతోను ప్రార్థనతోనూ మిళితమైన స్వరంతో అన్నాడు.

నౌకరుతో: "ఈ కుర్రాడిని బయటకు పంపించు" అని యినస్పెక్టరు అనగానే వాడు మల్లు చెయ్యి పట్టుకున్నాడు. అకర్రలెండో చేతికి తీసుకొని ఆనౌకర్ని కొట్టబోతుంటే ఇనస్పెక్టర్ అక్కర లేదన్నాడు. మల్లు గుంజాటనపడి నౌకర్ని కరవబోయాడు. గాని లాభం లేకపోయింది. బయటపడినా ఒకటే యేడుపు. కోపంతో మన్ను మన్నును లేచిపోయి "మా అయ్యని యివ్వకపోతే - మీ అందరినీ యేంచేస్తానో సూడండి! మా అయ్యసేత మీ అందరినీ కొట్టించేస్తాను. మా అయ్య .......... అయ్య ........అయ్యా!" అని చివరకు కేకలు వేసాడు. గొంతుక పట్టుకుపోయింది. భయంపెడ్తేలాంగే ఘటంకాదని తెలుసుకొన్న ఇనస్పెక్టర్ కొంత సేపయ్యాక, నవ్వుతూ బయటకివచ్చి "నే నడిగిందిచెప్తే - ఇప్పటికి మీ అయ్యనిచ్చేద్దును-రా- లోపలికి రా - మీ అయ్యని చూదువుగాని!" అనగానే మల్లు. ఒక్కసారి పురకలు వేసుకొంటూ లోనికి వెళ్లాడు. ఇనస్పెక్టర్ అందరిలోనూ మల్లుమీద చెయ్యివేసి పేరు కనుక్కున్నాక మల్లు మంచోడు- పుల్లయ్య మరీ మంచి! కాదా మల్లూ?"

ఈ పొగడ్త ఆలేత హృదయానికి యెక్కడలేని తృప్తినీ యిచ్చింది. నవ్వు ముఖంతో. "మా అయ్య మామంచోడు!" అన్నాడు.

అలా ఆనుద్రవాన్ని పైకిలేవనెత్తి గిరగిర త్రిప్పుతూ "మల్లూ! మీ అయ్యతో ఇద్దరొచ్చారు కదూ? వాళ్లు పేర్లు?"

"అన్న—సెంద్రయ్య!"

"వాళ్లు యెలావుంటారు?

"ఒకడు అదిగో ఆడిలాగ, యింకోకడు నీలాగ" అంటూ పోటి పోడుగులను సూచించాడు. యిలా ఆసుద్రవాణ్ని సవివ్వంచి, మరపించి, మంచిచేసుకొని ఆదొంగలు యెలా యెగ్రబాకింది తను యెక్కడనుండి చూసింది, అంతా గుట్లు లాగారు. అయ్య యేం పనిచేసేవోడంటే వాడలు దించేవాడని- రాతిరిపనే అని చెప్పాడు. ఇంకెంత సేపో ప్రశ్నలు వేయలేక పోయారు. కుర్రవాని మరచిపోయిన అతృత మళ్లీ పొడమాసింది. చేస్తుంటే యినస్పెక్టర్ "ఉండు నేనే మీ అయ్యను తీసుకొస్తానని" లోపలికి వెళ్లాడు. కొద్ది క్షణాలలోనే ఒక క్రొత్త మనిషితో తిరిగివస్తూ "పెద్ద ఓకు వచ్చిందట! పనుకు దించడానికి మీ అయ్య వెళ్ళగాడు. మా మల్లు వస్తే రాతిరికి వస్తానని చెప్పమన్నాడట! నీవు యింటికెళ్లి ఆడుకో. మీ అయ్య రాతిరికి వస్తాడు!" అన్నాడు.

ఆ చెప్పే విధానం, దానికి ఆ వచ్చిన క్రొత్త మనిషి సాక్ష్యం ఆలేత మనస్సును నమ్మించాయి తిరుగు ముఖం పట్టే ఆ కుర్రవాని వెంబడి యినస్పెక్టరు కూడా పడాడు. మలు యింటిలోనికి వెల్తుండగా చూసి ఆ ఇలు గుర్తుపట్టాడు.

ఇంటికి వెళ్ళి అమ్మతో అయ్య ఓడ దించడానికి వెళ్ళాడని అమ్మ అడగకుండానే చెప్పాడు సాయంత్రం వరకు యెటూ కదలకండా యెదురు చూస్తూ కూర్చున్నాడు.

చీకటి పడింది. అయ్య ఇంకా రాలేదు. నిముషం గడచిన కొద్ది ఆలేత మనస్సులో మధనం అధికమై, కళ్ళలో నీరు చిమ్ముతోంది. నీలి కూడా అతృతగా యెదురు చూస్తోంది. ఇరుగు పొరుగు వాళ్ళు ఎక్కడో భాగ్యవంతుల ఇంట్లో రాత్రి దొంగలు పడ్డారని ఆయన పిస్తోలు పేల్చినా దొంగలు దొరక లేదనీ విన్నది.

"వాళ్లికేం పోయే కాలమమ్మా! దొంగ బతుకూ ఒక బతుకేనా?" అని నీలి అందుకుంది.

"దోచుకెళ్ళిపోయినా పూచీలేకపోనట! ఆ బాబు బుర్రబద్దలు చేసీనారట- బతికితే అదృష్టమంతుడేనట - ఆస్పత్రిలో వున్నాడట!"

నీలికి తన తలే బద్దలైనట్లు అనిపించింది. "రామ రామ—ఆ బాబు లేచిన వేళ ఆలాంటిది", అనుకుంది.

పొరుగమ్మ అందుకుంది: "ఆ డబ్బు అడిది కాదట! యెవ్వరిదో కలిసొచ్చిందట. ఎలాగొచ్చిందో అలాగే పోతాదని అను కుంటే ఆ బాబు పేణం మీదికి రాకపోనట! పిస్తోలు గాలిలోన పేలించినాడట— యెదరగా పేలిసే అందరూ సచ్చిపోదురట!"

జేబుదొంగ పెళ్ళాం మాటామాటా కలిపి "మా సెడ్డోడట! అలాంటోలికి అలాగే కావాలలే!" అంది.

నీలి దప్పున "అదా తల్లీ సబబు చెప్పినావు! యెంత మంచి మా రాజా కాకపోతే, పిస్తోలు గాలిలో పేలుస్తాడు? సెడ్డోడైతే దొంగల మీదే పేలించేవాడు! అలాంటి బాబుకి అన్యాయం జరగదు. ఆ బాబు బతికి బయటపడడా? పడతాడు" అంది.

ఇలా వాళ్లలో వాళ్లు చాలాసేపు మాటాడుకున్నారు. ఎనిమిదిగంటల రాత్రయినా ఇంకా పుల్లయ్య ఇంటికి చేరకపోవటంతో మల్లు "అయ్యా!" అని యేడుస్తున్నాడు. వాడికి అయ్య రాలేదని దుఃఖంతో పాటు అయ్యమీద కోపం కూడా అధికం కాజొచ్చింది. నీలికి కూడా యేం చెయ్యటానికీ తోచడంలేదు. ఆమెకూడా అలా వాకిటకూర్చొని వచ్చేపోయేవాళ్లవేపు చూస్తోంది. తిండీతిప్పలు లేకుండా తల్లీ, కొడుకూ అలా చూస్తు నేవున్నారు. పదిగంటల రాత్రయింది. జనసంచారం లేదు. ఎదురుగానున్న చెట్ల కొమ్మలు వుండుండి గాలికి కదులుతున్నాయ్, నిరాశ ఇద్దర్ని ఆ చీకటిలాగే మ్రింగివేస్తోంది.

అంతదూరంలో ఎవరో మనిషివస్తున్నట్లగపడింది. వస్తుండగానే మల్లు ఒక్క యెగురుయెగిరి "అదుగో అయ్య!" అంటూ ముందుకు పరుగెత్తాడు. అయ్యను ముందుకు కదలనివ్వకండా కాళ్ళుపట్టుకొని యేడుపూ నిష్ఠూరంతో యేవేవో అనేస్తున్నాడు. అయ్య కొడుకుని యెత్తుకున్నాడు; ముద్దులాడాడు. కానీ చేతిముడకుంది. రాపాడి రక్తం వచ్చిందేమో నొప్పిగావుంటు ముఖంమీద దెనికో ఢీకొనటంవల్ల తగిలిన దెబ్బవల్ల బొడికట్టివున్నది మల్లు ఉత్సాహంగా అయ్య ముఖంలో ముఖం పెట్టి తముమగా ఆ బొడిపి తగిలింది. ఆతృతతో "అయ్యా! దెబ్బ తగిలిందా? ఆలు కొట్టారా?" అన్నాడు

పుల్లయ్యకు ఈ చివరప్రశ్న అయోమయంగా అనిపించింది. చప్పున "ఎవరు?" అన్నాడు.

"ఆ పెద్దమేడోలు కొట్టారా? ఆలకి దబ్బుడుదుబ్బుడు యేసేద్దాం యీ రాతిరికి యెల్లి!" చాలాదయతో అన్నాడు.

పుల్లయ్య నిర్విణ్ణుడైనాడు. చప్పున మాటరాలేదు. కొడుకు మాటలు ఆపడం

(55-వ పేజీ చూడండి)

# నక్షత్ర ఫలితాలు

[9-7-58 మొదలు 15-7-58 వరకు]

బి. నరసింగరావు

### గ్రహస్థితి

| కు | కే | శు | ర |
|---|---|---|---|
| | 10 తేదిని కుజుడు మేషములో ప్రవేశించును. మీన, మేష వృషభ మిథునములలో చంద్రుడు | | బు |
| | శ | రా | గు |

### * అశ్విని [చూ, చే, చో, లా] *

ఈవారము మీరు ఆశించినపనులు జరగవు. ధనాభావమువల తలపెట్టిన పనులకు ఆటంకములు జరిగినా పట్టుదలగలవారగుట చేతను వాటిని లెక్కచేయకుండా సాహసముతో ప్రయత్నించి కార్యానుకూలమును పొందుతారు. వ్యవహార రీత్యా కొందరితో విరోధాలు రావచ్చును కార్యతొందరలు వారాంతములోగా తగ్గి శుభదాయకము కాగలవు. వారాంతమందుగల ప్రమాద సూచన జాగ్రత్తవల తప్పవచ్చును. రసాయనిక నిపుణులకు, గనులయజమానులకు, ఖనిజ లోహముల వ్యాపారస్తులకు కష్టముతో కూడిన లాభము. 9,10 కార్యక్రమములో ఆటంకములు. నిందలు, కలహము. 11,12, 13,14 సోదర సహాయము, కార్యలాభము,

### * భరణి [లీ, లూ, లే, లో] *

ఈవారము మీకు యోగ్రప్రదము మీ బుద్ధిబలమునకు, అధికారుల సహాయము, మీ పలుకుబడి తోడుచేసి వచ్చిన ఆటంకములను గడిచి కార్యసిద్ధిని పొందుతారు. బంధు సహాయముకూడా కలుగుతుంది. ధనాదాయము ఎక్కువవుతుంది కవులు నూతన రచనలను ప్రారంభిస్తారు ప్రత్తి, దూది, నూలు, వస్త్రములు, ఇత్తడి, కంచు మొదలగు సరుకుల వర్తకులకు లాభయోగము, కవులకూ, శిల్పులకు, నటీనటులకూ. గణిత శాస్త్రజ్ఞులకు మేలు కాలము. వార ప్రారంభం కొంత ఆందోళన కలిగించినా మిగిలిన కాలము యోగదాయకము.

### * కృత్తిక [ఆ, ఈ, ఊ, ఏ] *

ఈవారము మీకు ధనయోగము. భాగ్య వృద్ధి అవుతుంది. పండిత గోష్ఠివల్ల, కొత్త పుస్తకములు చదుటవల విజ్ఞానాభివృద్ధి కలుగుతుంది. బిడల అభివృద్ధికై చేసే ప్రయత్నాలు ఎక్కువ అనుకూలముగా వుంటవి. మీ పురోభివృదికొరకు చేసే ప్రయత్నాలు కష్టముతో కూడుకున్నా ఉపయోగము వుంటుంది. దావాలలో జయము కలుగుతుంది. విద్యార్థులకూ మనోరథ సిద్ధి అవుతుంది. 9, 10 కార్యక్రమ నిర్ణయము. ఆపైని ధనయోగము, కార్యలాభము మొదలగు శుభయోగములు.

### * రోహిణి [ఓ, వా, వీ, వూ] *

ఈ వారము ధనాదాయము వృద్ధి అవుతుంది కవులతోనూ, గాయకులతోనూ వినోదముగా గడుపుతారు. మీమాట నేర్పరితనము వల్ల కార్యసాధన పొందుతారు. నీటిమీద ప్రయాణము చేయవలసి వస్తుంది. ఉద్యోగస్తులకు అనుకూలము విద్యార్థులకు కోరికలు నెరవేరుతవి. వెండినగల వ్యాపారస్తులకు ప్రయాణమువల్ల లాభము. ప్రత్తి, దూది, నూలు, బటలు, బియ్యము వర్తకులకు మేలు కాలము. కవులకూ, గాయకులకు, కళాకారులకూ యోగము. 9, 10, ఆందోళనతో కూడిన కార్యక్రమము, ఆ పైని ప్రయాణము, కార్యలాభము, బంధు సమాగమము, దధి క్షీరములతోనూ మృదుమధుర పదార్థములతో సుభోజనము.

### * మృగశిర [వే, వో, కా, కీ] *

ఈ వారము మీకు శుభయోగము. యత్న కార్యలాభము, వాహనయోగము వుంటాయి. అనుకున్న దానికన్నా ధనాదాయము ఎక్కువవుతుంది దూరపు ప్రయాణము చేయవలసి వుంటుంది. పరోపకారము చేసి కీర్తి గణించుతారు. శుభకార్యాలోచనలలో పాలొంటారు. విద్యార్థులకు కోరికలు ఫలిస్తాయి. నూలు, బట్టలు, బంగారము వజ్రముల వ్యాపారస్తులకు లాభము. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు మేలుకాలము 9, 10 కూనసికాందోళన. ఆ పైని ప్రయాణము, ధనయోగము మొదలగు రాజయోగములు.

### * ఆరుద్ర [కూ, ఖ, జ, ఛ] *

ఈ వారము కార్యభారము ఎక్కువ. తలపెటిన పనులకు ఆటంకములు, త్రిప్పట. ఆర్థిక స్థితి తృప్తికరంగా వుంటుంది. అకాల భోజనమువల్ల అనారోగ్యం చెడే సూచనలు కనబడగానే గ్రహారాజైన రవికి శాంతి చేయించి ఔషధసేవ చేయుటవల్ల మేలు గలుగుతుంది. ఉద్యోగస్తులకు రాజకీయ వాదులకు మేలుకాలము. 9, 10 త్రిప్పట, ఆటంకములు, అనారోగ్యము. కోర్టు వ్యవహారములు వాయిదా. ఆ పైని ధనలాభము, పితృవర్గ సహాయము, కార్యసిద్ధి.

### * పునర్వసు [కే, కో, హా, హీ] *

ఈవారము అంతయోగదాయకము కాదు. సహాయము చేస్తారనుకున్న స్నేహితులు లేని రారు. ప్రయాణములో కలుసుకున్న మిత్రుని సహాయమువల్ల కార్య సిద్ధి పొందుతారు. ఉద్యోగస్తులకు మొదటో ధనలోపమువల్ల ఒత్తిడివున్నా వారాంతమునకు సద్దుకుంటుంది. వర్తకులకు మాంద్యము 9, 10 త్రిప్పట, ఆటంకములు, ఆపైని ప్రయాణము, మిత్రదర్శనము, కార్యలాభము, అన్యదేశీయుల పరిచయము. అపురూపవస్తు సంపాదన. ఆత్మీయుల ఆరోగ్యముచే చింత. రహస్య శోధనకు నియోగించబడుతారు.

### * పుష్యమి [హూ, హే, హో, డా] *

ఈ వారము బంధువుల రాకపోకలవల్ల ఎక్కువ ఖర్చులు, యత్నకార్యములకు ఆటంకములు, ఆర్థికముగా యిబ్బంది. ఈశ్వరానుగ్రహమువల్ల కలతలు తగ్గి మనశ్శాంతి శరీరబలము కలుగుటచే ఆటంకములు గడిచి కార్యలాభము పొందుతారు. ఉద్యోగస్తులకు బదిలీ అగుటగాని లేక శెలవుపెటి వ్యక్తముగా గడుపుటగాని జరుగుతుంది. వర్తకులకు నష్టద్రవ్యలాభము. విద్యార్థులకుకోరిన స్థానములు లభించక నిరాశ 9, 10 తీరిక లేని కార్యక్రమము, గృహకలతలు, మనోవ్యథ ఆపైని ధనలాభము, కార్య సాధన, మనశ్శాంతి

### * ఆశ్రేష [డి, డూ, డే, డో] *

ఈ వారము యత్నకార్యములు ఫలించవు అప్రయోజకులైన మధ్యవరులవల స్థిరాస్తి విషయములో ఆశాభంగము అనవసరఖర్చులు తప్పనిసరిగా చేయవలసి వస్తుంది. దేహసౌఖ్యము, మనశ్శాంతికూడా వుండవు. ఆత్మీయులతో విరోధము. భార్యాబిడ్డల అనారోగ్యము. ఉద్యోగస్తులకు బదిలీ, అపర

 

# నక్షత్రఫలితాలు



దినుసులు, మినుములు, నువ్వులు, నూనెపదార్థములు, ఉప్పు వర్తకులకు మేలుకాలము. విద్యార్థులకోరికలు సిద్ధించవు. 9, 10 త్రిప్పట, ఆశాభంగము, అధిక ఖర్చులు. ఆపైని కొంతశాంతి, స్వల్ప కార్యలాభము. కోర్టువ్యవహారములలో జయము.

### * మఖ [మా, మీ, మూ, మే] *

ఈవారము కార్యరంగములో కలిగే ఆటంకములను తొలగించుటకు పట్టుదలతో ప్రయత్నించి జయము సాధిసారు. మీకు రావలసినసొమ్ము సమయమునకు రాకపోవుటచేత అప్పుచేయవలసి వసుందిగాని అంతలోనే మీడబ్బు అందుటచేత వెంటనే తీర్చివేస్తారు. శరీరముపై కురుపులు లేస్తాయి. ప్రమాదముచే అవయములకు దెబ్బలు తగుల వచ్చును. జాగ్రత్తవహించండి గనులయజమానులకు, ఖనిజముల వ్యాపారస్తులకు, పోలీసు, ఇంజనీరింగు శాఖలలో ఉద్యోగులకున్నూ కష్టముతో కూడిన లాభయోగము. 9 10 ఆటంకములు ధనాభావము, ఋణము చేయుట. 11, 12, 13 తేదిలలో సోదర సహాయము, ధనయోగము, అప్పుతీర్చుట. 14, 15 కార్యలాభము.

### * పూర్వఫల్గుణి (పుబ్బ) *
### మో, టా, టీ, టూ

గత రెండువారములనుండి కలుగుచున్న అవయోగము ఈవారము అధికారుల ఆదరణ పొందుటచేతను బంధుసహాయము కలుగుటచేతను, మీరు యుక్తిగా ప్రవర్తించుటచేతను గడిచి, కార్యలాభమును పొందుతారు. ధనయోగము కలుగుతుంది. కవితాగోష్ఠిగాని, జ్యోతిష గోష్ఠిగాని జరిపి వారిని సత్కారము చేస్తారు. ఈశాన్యదిక్కునుండి కొంతకాలమునుండి అస్వస్థతతో నున్న ఆత్మీయుల కుశలవార్త వచ్చుటచేతను సంతోషము పొందుతారు. విద్యార్థులకు కోరిక సిద్ధిస్తుంది. వైద్యులకు, గణితశాస్త్రజ్ఞులకు, కవులకూ, శిల్పులకు నటీనటులకు మేలుకాలము. 9, 10 చాంచల్యము ఆపైని వారాంతము వరకు రాజయోగములు

### * ఉత్తరఫల్గుణి (ఉత్తర) *
### [టే, టో, పా, పీ]

ఈవారము మీకు భాగ్యయోగము. ధనాదాయము బాగుంటుంది. వర్తకులకు నష్టము వస్తుందనుకున్న వ్యవహారము లాభసాటిగా ముగుస్తుంది. పిల్లల అభివృద్ధి సంతోషము కలిగిస్తుంది. వైద్య, జ్యోతిషశాస్త్రాల గోష్ఠిలో పాల్గొంటారు. ప్రభుత్వ సత్కారం పొందుతారు. ఉద్యోగస్తులకు ప్రోత్సాహకరముగా వుంటుంది. ఉపాధ్యాయులకూ, పండితులకు, న్యాయవాదులకు, న్యాయాధికారులకు మేలు కాలము. 9, 10 అనిశ్చిత కార్యక్రమము, ఆపైని వారాంతము వరకు శుభయోగము.

### * హస్త [పూ, ష, ణ, ఠ] *

గతవారము ముగియకుండా వుండిపోయిన కార్యములు ఈవారము లాభకరముగా ముగుస్తాయి. బంధుమిత్రులతో కలిసి వినోదములలో పాల్గొంటారు. నీటిమీద ప్రయాణము చేయవలసి వసుంది. ఆప్తుల ఆరోగ్యము బాగుపడినట్టు వార్త వచ్చుటచే మనశ్శాంతి కలుగుతుంది. ఉద్యోగస్తులకు ఆదాయమే కాకుండా బాధ్యత కూడా ఎక్కువవుతుంది. ప్రత్తి, దూది, నూలు, బట్టలు, వెండి, బియ్యము వర్తకులకూ మేలు కాలము. కవులకూ, గాయకులకూ, కళాకారులకు యోగము 9,10 చాంచల్యము ఆపైని వారాంతము దాకా కవితాగోష్ఠి, సుభోజనము, వినోదము ధనలాభము వంటి శుభయోగములు.

### *చిత్త [పే, పో, రా, రీ]*

ఈవారము అనుకున్నదానికన్నా ఎక్కువ లాభము కలుగుతుంది. కోర్టు వ్యవహారములు మీ పరముగా తీర్పు అవుతవి. పరోపకారమువల్ల కీర్తి వృద్ధి అవుతుంది. ఉద్యోగస్తులకు అధికారుల ఆదరణ కలుగుతుంది. బంగారము, నవరత్నములవంటి ఖరీదైన సరుకుల క్రయవిక్రయములలో వర్తకులకు లాభము. విద్యార్థులు ఉత్సాహముతో నూతన తరగతులలో చేరుతారు. ఈ నక్షత్రమువారికి వాహనయోగము స్త్రీలకు అలంకార ప్రాప్తి. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు మేలు కాలము. 9, 10 ఆందోళన ఆపైని దూరప్రయాణము, ధనలాభము, ప్రమోషను వంటి శుభయోగములు.

### * స్వాతి [రూ, రే, రో, తా] *

ఈవారము ఆర్థిక స్థితి బాగుండక, ఆదాయముకన్నా వ్యయము ఎక్కువగుటచేతను అశాంతికలుగుతుంది వ్యవహారములో కొత్తచిక్కులు కలుగుతవి. త్రిప్పటచే శ్రమ ఎక్కువగుటవల, అకాల భోజనమువల్ల ఉష్ణాధికము కలిగి, అనారోగ్య సూచనలు కనబడగానే ఔషధ చికిత్స పొందుటమేలు చేస్తుంది. 9, 10 అధిక ఖర్చులు, అనారోగ్యము. 11, 12, 13 గొప్ప మేలు కలిగే సూచనలున్నవి. 14, 15 పితృవర్గ సహాయము, కార్యలాభము. విద్యార్థులకు ఆశాభంగము.

### ధరలు:

నూలు, వస్త్రములు: క్రమేణా కొంచెము చురుకగును.

నూనె దినుసులు: నిలబాటుగా వుండును.

బెల్లము, పంచదార, చింతపండు: మందముగా వుండును.

ఆహార ధాన్యములు: కొంచెము పెరుగును.

పప్పుదినుసులు: నిలబాటుగా వుండును.

వెండి: క్రమముగా మందమగును.

బంగారము: క్రమముగా హెచ్చగును

సస్యానుకూలముగా వర్షించును.

* * *

జన్మనక్షత్రము బట్టిగాని, జన్మనక్షత్రము నెరుగనివారు నామనక్షత్రము (వారి వారి పేర ననుసరించి పేరు మొదటి యక్షరము)ను బట్టిగాని ఫలితాలు తెలుసుకొనునది. కృష్ణుడను పేరునకు మృగశిరా నక్షత్రమును, వృషుడను పేరునకు స్వాతియు, శ్రీధరుడను పేరునకు చిత్తయును, క్షేత్రపాలకుడనే పేరునకు హస్తయును, భీముడు, భైరవుడు అనే పేర్లకు పూర్వాషాఢయును చూచుకొనునది.

### * విశాఖ [తీ, తూ, తే, తో]*

ఈవారము ధనలోపము ఎక్కువ ఇతరులవల్ల మీకు రావలసిన డబ్బు రాదు. ఉద్యోగస్తులకు అధికారుల ఒత్తిడిచే శెలవు పెట్టవలసి వస్తుంది. వ్యాపారస్తులకు నష్టము వస్తుందేమోనని భయం. ఇంటోవున్న వారి ఆరోగ్యము సరిగా వుండకపోవుటచే ఆందోళన మీరు ఒకరి సహాయము ఆశించగా అతను కలిసి రాకపోవడము, అనుకోకుండా కలుసుకున్న మిత్రుడు చేసిన సహాయమువల్ల కార్యలాభము పొందడం జరుగుతుంది. రహస్యములు కనుగొనుటకు నియమితులవుతారు. 9, 10 ధనాభావము, వంచన, ఆందోళన. ఆపైన ప్రయాణము మిత్రసహాయము, కార్యలాభము, అన్యదేశస్తుల పరిచయము, వింత వస్తువుల సంపాదన.

### *అనూరాధ [నా, నీ, నూ, నే]*

ఈ వారము మీకు యోగదాయకము కాదు. చేసిన ప్రతి ప్రయత్నమునకూ ఆటం

కములు కిలిగి మనస్సు సరిగా వుండక అనారోగ్యము కలిగే అవకాశము లున్నవి. దైవ కృపవల్ల ఈ వారము రెండవ భాగములో అనుకూల పరిస్థితులు కలుగుతవి. మీరు ఆశించినకంటే ఎక్కువగా, బంధువులవల గాని స్నేహితులవల్లగాని సహాయము కలుగుట చేతను కార్యలాభము పొందుతారు. నష్టద్రవ్య లాభము కలుగుతుంది. ఉద్యోగస్తులకు వారు కోరుకున్న స్థలములకు బదిలీ అవుతుంది. తీర్థయాత్రలవల్ల ధన వ్యయము, వింత వస్తువులను చూచుట జరుగుతవి, 9, 10 కొక తక్కినరోజులు అనుకూలముగా వుంటవి.

*జ్యేష్ఠ [నో, యా, యీ, యూ]*

ఈవారమంతా కార్యభారముచే క్రింగు మీదౌతారు. అనవసరముగా వివాదములకు లోనౌతారు. ధనాభావము ఎక్కువ అనుకున్న పనులు నెరవేరుటకు, ఆశలు ఫలించుటకూ ఆటంకములు కలుగుతాయి కోర్టు వ్యవహారములు లాభిస్తవి. భార్యకు ఆరోగ్యము సరిగావుండక ఆందోళన కలుగుతుంది. అపర దినుసులు, ఉప్పు, మినుములు, నువ్వులు, నూనె వ్యాపారస్తులకు మేలు కలుగుతుంది. ఉద్యోగస్తులకు బదిలీ అవుతుంది. విద్యార్థులకు ఆశాభంగము.

* మూల [యే, యో, బా, బి] *

ఈవారము మీరు కీర్తిప్రతిష్ఠలకోసము తాపత్రయము పడతారు. అందుకొరకు ధన వ్యయముకూడా చేస్తారు. సాహసవంతులకుటచే కలిగే చిక్కులను లెక్కచేయకుండా ధైర్యముతో వ్యవహరించి కోరిన ఫలితములను పొందుతారు. యంత్రములవలన గాని అగ్నివలగాని అవయవములకు ప్రమాదసూచనలున్ననూ జాగ్రత్తవల్ల తప్పవచ్చును. అధికారుల చురుకుమాటలచే ఉద్యోగస్తులకు వ్యధ కలుగుతుంది. గనుల యజమానులకు లోహపు సామానుల వర్తకులకు మేలు కాలము. ఇంజనీరింగు, పోలీసుశాఖలలో ఉద్యోగులకు క్షేమముతో కూడిన యోగం.

*పూర్వాషాఢ [బూ, ధ, భా, డా]*

ఈవారము మీకు యోగప్రదముగా వుంటుంది. కుశలవార్త వినుట, అధికారుల సహాయమువల్ల కార్యలాభము నూతనవ్యక్తులతో స్నేహము, ధనాదాయము పెరుగుట వంటి మంచియోగములు కలుగుతవి. కవులు కొత్తరచనలు మొదలుపెడతారు. డాక్టర్లకు లాభము. కవులకు, చిత్రకారులకు, నటీనటులకు మంచికాలము. విద్యార్థులకు మనోరథము సిద్ధించును. గణితశాస్త్రం, జ్యోతిష శాస్త్ర ప్రసంగాలుచేసి ప్రమోదము జెందుతారు. ఈశాన్య దిక్కునుండి కుశల వార్తవిని చాలాకాలమునుండి వున్న ఆత్రుత పోతుంది.

*ఉత్తరాషాఢ [బే, బో, జా, జీ]*

ఈ వారము ఆర్థికస్థితి బాగుండుటవలన భాగ్యవృద్ధి కలుగుతుంది. అనుకున్న ప్రకారము ప్రయత్నములు చేసి కార్యలాభమును పొందుతారు. బిడ్డల అభివృద్ధికి పథకాలు ఏర్పరుస్తారు. కోర్టువ్యవహారములు అనుకూలిస్తవి. విద్యార్థులు నూతన తరగతులలో చేరుతారు. ఉద్యోగులకు అభివృద్ధి, వర్తకులకు ప్రయాణమువల్ల లాభము పండిత గోష్ఠివల్ల, నూతన గ్రంథ పఠనమువల్ల విజ్ఞాన వృద్ధి కలుగుతుంది. ఉపాధ్యాయులకు, పండితులకు, న్యాయవాదులకు, న్యాయస్థానమందలి ఉద్యోగులకునూ మేలుకాలము.

*శ్రవణము [జూ, జే, జో, ఘా]*

గతవారము కొనకుండా నిలిచిపోయిన కార్యములు ఈ వారము మీకు అనుకూలముగా పూర్తి అవుతవి. కవితాగోష్ఠి, సంగీత సభలవంటి వినోదములలో బంధుమిత్రులతో కలిసి పాల్గొంటారు దక్షిణదిక్కున్న బంధువు వద్దనుండి సంతోషవార్త తెలుస్తుంది. ప్రత్తి, దూది, నూలు, బట్టలు, బియ్యము, వెండివ్యాపారస్తులకు లాభయోగము కవులకు, గాయకులకు, కళాకారులకు, యోగకాలము. 9, 10 చాంచల్యము ఆపైని శుభయోగములు.

* ధనిష్ఠ [గా, గీ, గూ గే] *

ఈ వారము మీకు ధనాదాయము అనుకున్నదానికన్నా ఎక్కువగా వుంటుంది. సంఘ సంక్షేమ కార్యాలలో కీర్తిని పొందుతారు. యత్న కార్యములు ఫలిస్తాయి నూతన కార్యాలోచనలు చేస్తారు పుణ్యకార్యాలలో పాల్గొంటారు. ఉద్యోగస్తులకు హోదా పెరిగే సూచనలున్నవి వర్తకులకు విలువగల వస్తువుల క్రయ విక్రయములలో లాభము. విద్యార్థులకు మనోరథసిద్ధి కలుగుతుంది. కవులకు గాయకులకు, కళాకారులకు నటీనటులకు మేలు కాలము. వారమంతా శుభయోగములతో వుంటుంది.

* శతభిషం [గో, సా, సీ, సూ] *

ఈ వారము మీరు తలపెటే కార్యములకు కొందరు ప్రతికూలముగా వ్యవహరిస్తారు. కార్యభారము ఎక్కువవుతుంది. శరీరములో బద్ధకము కళ్లుమంట తలపోటు వంటి అనారోగ్య సూచనలు కనబడగానే శ్రద్ధవహించి ఔషధసేవ చేయుట మేలు చేస్తుంది. రాజకీయ వాదులకు మేలుగా వుంటుంది. ఉద్యోగస్థులకు అధికారము పెరగడముతో బాధ్యతలు కూడా ఎక్కువవుతవి. ఆటవిక ఫలసాయములు, అపర దినుసులు, గోధుమవంటి ఆహార ధాన్యాల వర్తకులకు లాభము. వారమంతా ప్రతికూల అనుకూలయోగములతో వుంటుంది.

*పూర్వాభాద్ర [సే, సో, దా, దీ]*

ఈ వారము కార్యాచరణకు పూనుకుంటారుగాని ధనలోపమువల్ల అడ్డంకులు కలుగతవి. నమ్మినమిత్రులే అప్పటికి సహాయముచేయరు. అనుకోకుండా కలుసుకున్న స్నేహితుని సహాయమువల్ల ఫలసిద్ధిని పొందుతారు వర్తకులకూ వారాంతమున లాభిస్తుంది. ఉద్యోగస్తులకు వనపర్వత ప్రదేశములకూ బదిలీ అయే సూచనలున్నవి. ప్రయాణము, విదేశీయులతో మైత్రి, అపురూప వస్తు సంపాదన కలుగుతవి. రహస్యములను కనుగొనుటకు నియోగించబడుతారు 9, 10 తేదిలలో ఆటంకములు, ధనలోపము ఆపైన కార్యలాభము

*ఉత్తరాభాద్ర [దూ, శం. ఝా, థా] *

ఈ వారము మీరు చేసే పనులకూ ఆటంకములు కలుగుతవి ధనలోపముచే గృహావసరములు తీరక కలతలు వస్తాయి. వాయువ్య దిశనుండి ఆత్మీయుల ఆరోగ్యము గురించి చెడు వార్త వింటారు. ఉద్యోగస్తులకు అస్థిమితముగా వుంటుంది. వర్తకులకు నష్టద్రవ్యలాభము కలుగుతుంది. సాధుసాంగత్యముచే ఆధ్యాత్మిక చింత కలుగుతుంది. పుణ్యక్షేత్రాలలో దేవతాదర్శనము చేయుట, వింత వస్తువులను చూచుట జరుగుతుంది. విద్యార్థులకు ఆశాభంగము.

* రేవతి [దే, దో, చా, చీ] *

ఈ వారము అనుకున్న సొమ్ము చేతికి రాక ఖర్చులు ఎక్కువగుటచే నిరాశగా వుంటుంది. కోర్టు వ్యవహారములు అనుకూలిస్తవి. నిర్నిమిత్తముగా వివాదాలు వస్తవి. పరోపకారము తలబెటి చేయలేకపోతారు. ఉద్యోగస్తులకు కిష్టపరిస్థితులు యేర్పడతాయి. ఉప్పు మినుములు, నువ్వులు నూనె వ్యాపారస్తులకూ లాభయోగము. భార్యకుగాని ఇంట్లో వున్న ఇతర స్త్రీలకుగాని అనారోగ్యముచే చింత కలుగుతుంది. వారాంతమునకు కొంత మేలుగా వుంటుంది. ★




# సుస్తీచేస్తే చూడవచ్చారు

ఎవరికైనా రోగం వచ్చిందని తెలిస్తే చాలు వారి తాలూకు దగఱి చుట్టాలు, దూరపు చుట్టాలు, అక్కఱకు వచ్చేవారూ, రాని వారూ, ఆ వీధి వారూ, మిత్రులూ మొదలగు వారంతా సానుభూతి తెల్పటానికి వస్తుంటారు. అలా పరామర్శించటానికి వచ్చిన వారిలో చాలా దగ్గఱివారైతే గుడ్లనీరు క్రక్కుతూ బావురుమంటారు. మిత్రులైతే ఖిన్నవదనులౌతారు. మరి కొందఱు గుడ్లప్పగించి చూస్తారు! మిగిలిన వారు ఏడ్చేవాళ్ళను ఊరుకోబెడతారు! ఇలా సానుభూతి అంటూ మొత్తానికి రోగిని హడలు గొట్టేస్తారు. అంతవరకూ రోగికి ఏ భయం లేకపోయినా ఈ సానుభూతి పరుల పెడబొబ్బలు విని "వీళ్ళు యింతగా బొబ్బలెడుతున్నారు గదా, నా రోగం అంత గొడవదా!" అని నిజంగా హడలిపోతాడు. ఈ తంతులన్నీ రోగి స్వంత యింట్లోనే చికిత్స చేయించుకొనేటప్పుడే కాదు, హాస్పిటల్‌లో జాయిన్ అయినా అంతే! ఈ పరామర్శించటానికి వచ్చిన వారినందరినీ చూచి నర్సులూ, డాక్టరూ విసుక్కుంటూ ఉంటారు. వచ్చిన వాళ్ళేదో నిశ్శబ్దంగా చూచి పోకుండా "రోగి బాధ చూడలేక" అన్నట్లు శూనిరాగాలు తీయడం, రోగిని మాట్లాడించి హడలగొట్టడం, తాము చూడ వచ్చిన రోగినే కాక ప్రక్కనున్న యితర రోగుల నిద్రలుకూడా పోగొట్టడం చేస్తూంటే విసుక్కోక వారుమాత్రం ఏం చేస్తారు! ఇక ఆ వచ్చినవారి చంకన చంటి బిడ్డలుంటే సరేసరి! హాస్పిటల్ భవంతి దదరిల్లేలా ఏడుస్తారు! ఇలా ఐతే రోగికి విశ్రాంతి ఎక్కడ? రోగం పోయేదెప్పుడు?

సాధారణంగా రోగిని చూడటానికి వచ్చిన వారికి పూర్వంవలె అంటే రోగం లేనప్పుడు వచ్చినప్పుడులా మర్యాదలు జరగవు. అవును మరి! ఒకవైపు రోగాలతో బాధపడుతూ మరోవైపు వచ్చిన చుట్టాలకు మర్యాదలు చేసూ సౌఖ్యాలు సమకూర్చడం బహుకష్టం. కాని ఆ వచ్చినచుట్టాలు యివేమీ పట్టించుకోకుండా "చూడవస్తే గొంతు తడుపుకోమని యిన్ని కాఫీనీళ్ళన్నా యిచ్చారు కాదనో, ఒకవేళ ఒక్క కాఫీయే యిస్తే చూచారా! టిఫినన్నా లేకుండా ఉత్త కాఫీయే తగలేశారు టిఫిన్ మొహం ఎరుగ

## కొప్పుల సువర్ణగిరి
(గొల్లప్రోలు)

రనున్నారు లాగుంది" అనో అభాండాలు వేసారు!

## రోగులు రాజులైన రోజులు

చార్లెస్ లేంబ్ అను ఆంగ్లకవి తన "ది కొన్వాల్ సెంట్" అనే వ్యాసంలో రోగిని ఓ మహారాజులాగా (రోగి స్త్రీ ఐతే మహారాజ్ఞి అన్నమాట!) రోగి పరుండే బెడ్ ఓ సింహాసనములాగా పోల్చాడు! "రోగులు యింటి సంగతులుకానీ యితరులి సంగతులు కానీ విచారించరు. ఎవరైనా తమను చూడటానికి వస్తే వారిగురించి ఏమీ తెలిసికో ప్రయత్నించరు. ఎప్పుడూ తమనుగురించే ఆలోచిస్తూ ఉంటారు." అనికూడా వ్రాశాడు. కాని ఈ రోజుల్లోని రోగులకు మాత్రం ఆయన వ్రాతలు సరిపోవు! ఇప్పటి రోగులకు అసలు విశ్రాంతి ఉండదు "తనను చూడటానికి వచ్చిన వారికి సరిగా భోజనాలు టిఫిన్‌లూ, కాఫీలూ అందుతున్నాయో, లేదో" అని "సరిగా అందకపోతే తనమీద ఏ అభాండాలు వేసారో" అని ఆందోళన పడతారు. ఆ రోగికి చంటిబిడ్డలుగానీ ఉంటే మనస్సంతా తన చిన్నారి బిడ్డలమీదకే పోతుంది. మనస్సుకు విశ్రాంతి ఉండదు. మనస్సు కుదురులేని రోగికి రోగం ఎప్పుడు తగుముఖం పడుతుంది? ఇలా సతమతమౌతున్న రోగిని మహారాజులా వర్ణించటం సబబుగాదు. అంతేమరి!

## రోగం

కొన్నాళ్ళక్రితం మా చుట్టాలలో ఒకావిడకు ఏదో కురుపులేస్తే ఆపరేషన్ చేయించుకొనే ఆవిడకు తోడుగా ఉండటానికి వాళ్ళదగ్గఱ బంధువులలో ఒకామెను రమ్మని ఉత్తరం వ్రాస్తే ఆమె వెంటనే హాస్పిటలుకు మూడేళ్ళ అమ్మాయిని చంకలోన, పదేళ్ళ అబ్బాయిని వెనుకా వేసుకొని వచ్చింది. హాస్పిటల్‌లో జాయిన్ అయ్యిందని ఎలా తెలిసిందో ఆమెను అంటే రోగిని చూడటానికి ఎంతమంది వచ్చారో చెప్పలేం! ఆ వచ్చిన వారందఱికీ టిఫిన్‌లూ, కాఫీలు అందిచ్చేటప్పటికి చచ్చి బ్రతికినంత పనయేది. అవన్నీ యివ్వకపోతే ఎక్కడ పేర్లెడతారో అన్న భయం ఆపరేషన్ జయప్రదంగా జరుగుతుందో లేదో అన్న భయంకంటె హెచ్చయినది!

## రాగం

ఒకనాడేమయిందంటే తోడుగా ఉండటానికి వచ్చిన ఆవిడ పదేళ్ళ సుపుత్రుడు కనపడలేదు. ఆ హాస్పిటలు అన్ని మూలలా వెదికింది, ఆవిడ రోగిని అక్కడే వదిలేసి! కాని ఆ గారాల బిడ్డడు కనపడలేదు. ఇక మూసుకోండి ఆది హాస్పిటలు అన్న సంగతి, అక్కడున్న వారంతా రోగులు అన్న సంగతి మరచిపోయి ఆవిడ ఓరి నాయనోయ్,

ఎక్కడున్నావురోయ్, తెలియక ఇక్కడను వచ్చాము రోయ్. ఇలా మాయం అవుతావనుకో లేదురోయ్, నాదేమూ డోయ్" అంటూ ఆరునొక్క రాగం మొదలు పెటింది. ఇంతా చేస్తే ఆ పుత్రవాడు ఆ గది లోనే తలుపువెనుక దాక్కున్నటున్నాడు! "ఏయ్! నన్నెవ్వరూ వెతుక్కో లేకపోయా రోయ్" అంటూ అమ్మదగ్గరకు వచ్చాడు!

ఆపరేషన్ చెయ్యడం, కురుపుమానడం అవగానే హాస్పిటల్ నుండి యింటికి వచ్చే శారువారు. ఐనా యీ చుట్టాలగోడవ యింకా తగ్గలేదు! ఈసారి "వంటోబాగుం టుందా" అంటూ పరామర్శింపవచ్చేవారు. మరికొంతమంది రోగి హాస్పిటలులో ఉన్న ప్పుడు రానివారు యిప్పుడువచ్చి "అప్పుడు చూడటానికి రాలేకపోయాం! ఎంతపెద్దా మనుకున్నా కుదిరిందికాదు!" అని తమను క్షమించమన్నట్లు సంజాయిషీ చెప్పుకొనే వారు. ఆఖరుకు ఆపరేషన్ చేయించుకొన్న ఆవిడ సులభంగా తిరగగలిగే కి వచ్చేటప్పటికి ఐనఖర్చు లెక్కవేస్తే "ఆపరేషన్‌కు ఐన ఖర్చులకంటె పరామర్శింపవచ్చిన చుట్టాల సవరింపులకే ఎక్కువఖర్చు అయ్యింది" అని తేలింది!

ఇంతవరకూ చూడవచ్చిన చుటాలమీదే నిందమోపానని నామీద మీరు నిందమోప కండి. ఈ రోగాలువచ్చిన వారిలోకూడా కొన్నిలోపాలు లేకపోలేదు! ఒకవేళ వారిని చూడటానికి ఎవరూరాకపోతే "మాకారా! నాకు చచ్చిపోయినంత జబ్బుచేసినాసరే చూడటానికి ఒక్కరూరాలేదు. నేను చావ డమే వీళ్ళందరికి యిష్టంలాగుంది" అని చుట్టాలను నిందిస్తారు. "వాళ్లకు మేమేం కనిపిస్తాంలే" అని నిష్ఠూరం వేసారు. ఒకవేళ చూడటానికివస్తే జబ్బు నయంకావడానికి అయ్యిన ఖర్చుకంటే చుట్టాల కాఫీలకే ఎక్కువఖర్చు లయ్యాయని గుణుస్తారు!

అందుకే యీగొడవేమీ లేకుండా రోగు లైన ప్రతివారూ తమను పరామర్శించటానికి ఎవ్వరూ రాలేదేమన్న ఈర్ష్యపొందరాదు. ఒకవేళ పరామర్శించవచ్చే వారికొరకే ఖర్చు లెక్కువైపోయాయిఅన్న నింద వెయ్యరాదు. ఇక పరామర్శింపవచ్చిన వారుకూడా "తమ కేమీ మర్యాదలు జరుగలేదన్న చింత పెట్టు కోకుండా, పరామర్శవంకన అక్కడే బిచాణాపరచక ఒకపూటలో తిరిగి తమఊరు చేరడం ఉత్తమోత్తమం" అని చెప్పుతూ యీ వ్యాసం ముగిస్తున్నాను. ★






 [సి. ఉత్తర] 

చాలామందికి, ఎవరైనా మనఇంటికివస్తే చూచేవిధానం అటుంచి, ఎవరింటికైనా వెళ్ళినప్పుడు మెలిగేవిధానంకూడా బొత్తిగా తెలీదు.

కొందరు ఇతర్ల ఇంటికి వెళ్ళినప్పుడు తిండి విషయంలో బహునాజూగా ఉంటారు. ఒక్కగుక్కెడు కాఫీ తాగేటప్పటికి కడుపు నిండిపోయిందంటూ బహు ఆయాసపడి పోతారు. అదైనా పదిసార్లు చెప్పించుకొని, ఇటుచూచి, అటుచూచి రకరకాల పోజు లతో తాగుతారు. మళ్ళీ వీళ్ళే వాళ్ళ ఇళ్ల దగిర నాలుగుగ్లాసుల కాఫీఅయినా గుప్ చిప్‌గా తాగేసారు. ఇలాంటి వంకరటింకర వేషాలు చూస్తూంటే ఒళ్ళు మండుతుంది ఎలాంటి వాళ్లకైనా.

ఆమధ్య మాఇంటికి బంధువులు వచ్చారు. వాళ్ల అమ్మాయిల నాజూకు చూడాల్సిందే కాని చెప్ప నమ్మలేరు. నేతిలోచేసిన సేవ్, తాజా క్రీమ్, బిస్కట్లుపెట్టి తినమంటే, మొదట ఇప్పుడే తినివచ్చామన్నారు. ఆతరు వాత కడుపునిండుగా ఉందన్నారు. ఇంకొంచెం బలవంతం చెయ్యగా, అయ్య బాబోయ్ అన్నితినగలమా అంటూ ఆశ్చ ర్యంతో గుండె బాదుకొన్నట్టు ఇదయి పోయారు. చెప్పొద్దూ నాకు ఒళ్ళు మండి పోయింది. లేకపోతే రెండుబిస్కట్లు తినేటప్పటికే వాళ్ల ప్రాణం పోతుందా ఏమైనానా? విసిగి నేను మరిమాటాడలేదు. కానీ మా ఆడబిడ్డ ఉంది చూసారూ! అది మటుకు ఊరుకోలేదు. ఎవరినైనా సరే తినే వరకూ ఓపట్టాన వదిలిపెట్టదు. ఆ అమ్మాయి కూడా రెండుసార్లు చెప్పగా, అతికష్టంమీద బిస్కట్‌లో సగంముక్క అతినాజూగ్గా కొరికి అబ్బా! కడుపునిండిపోయిందంటూ గుడ్లు తేలేసినట్టు బరువుగా ఊపిరితీసారు. వాళ్ళు వెళ్ళింతరువాత మా చెల్లి ఏడేళ్ళది వచ్చి, అదేంటక్కా! వాళ్లు పాపం ఒక్క బిస్కట్ కూడా తినలేకపోయారే, నేనే పదిబిస్కట్లయినా తినేసాకదా, మరివాళ్లు అంతపెద్దవాళ్ళుగాని వాళ్లకి ఆకలివెయ్యదూ అంది అత్యాశ్చర్యంతో అమాయకంగా. దానికి ఏంచెప్పను? ఏమైనా ఇలాంటి అలవాటు చాలా అసహ్యంగా ఉంటుంది. అతిథులు వచ్చినప్పుడు అల్పాహారం ఇవ్వ టం మనసంప్రదాయం. అంతేగాని ఎవ్వరూ తిండికివాచి ఇతర్ల ఇంటికి వెళ్లరు. పరాయి వాళ్లిచ్చిన కాఫీ తాగినంతమాత్రాన మనం తిండిబోతులం కాబోము. మననాజూకు ఏమీ తగ్గిపోదు అంతమాత్రంచేత. ఈ విష యం బాగాగుర్తుంచుకొని మరీవెళ్లాలి పరాయివాళ్ల ఇంటికి వెళ్ళినప్పుడు.

ఇంకోరకం, వచ్చినప్పటినుండీ ఇంటిని మూలమూలా పరీక్షించి, అవకతవక ప్రశ్నలతో ప్రాణంతోడేస్తారు. మా ఇంటి చుట్టు లట్లవాళ్ళంతా గుజరాతీలూ, మరాటీలు, మార్వాడీలు. వాళ్ళ వాడుకభాష చాలా మటుకు మరాటీయే. నాకేమో హిందీకూడా అంతబాగారాదు. ఎలా వాళ్లతో స్నేహం చేసుకోడం? అలానే వచ్చీ రానిభాషతో మాట్లాడాలని చూసేదాన్ని కానీ వాళ్ళు ఊరుకొంటేనా? భూత, వర్తమాన, భవి ష్యత్ కాలాలన్నీ మిక్శ్చర్ చేసి మాట్లాడేనా మాటలతీరుకి విరగ బడి నవ్వేవాళ్లు. నేనూ ఏడవ లేక నవ్వే దాన్ననుకోండి. పనంటే ప్రొద్దస్తమానూ ఉండదు కదా? ఎంతపని చేసుకొంటున్నా, కుట్టుకొంటున్నా కాసేపు పిచ్చాపాటి మాట్లాడాలని మనస్సు తహతహలాడేది. నా అదృష్టమో ఏమో మాకు దగ్గర్లోనే ఓ తెలుగు కుటుంబం వచ్చారంటే వెళ్ళి పరి చయం చేసుకొని ఆవిడను మా ఇంటికి ఓ సారి రమ్మనివచ్చా: మరునాడు ఆవిడా, పధ్నాలుగుఏళ్ల చెల్లెలూ వచ్చారు. చాప వేసి కూర్చోమన్నా. కూర్చునీ కూర్చో కుండానే మీ మెడలోని కంఠహారం (నెక్లేస్) ఎంతఖరీదు అంది. చెప్పా. అబ్బా! అంత ఖరీదా? అంది కాస్త ఆశ్చర్యంగా. కోపం వచ్చినా, అవునన్నట్లు బుర్రాడించా ఆవిడేకాదు చాలామందీ ఇంతే. ప్రతీ దానికి ధరలడుగుతారు, చెపితే అబ్బా అంత ఖరీదా అంటూ నాన్చేస్తారు అక్కడికి మనమేదో అబద్ధం చెప్పినట్లు. చెప్పకుండా ఉంటే, ఓయబ్బో మరి యీవిడేగారికే ఉందికదూ? అందుకే ఆ విరగబాటు. ధర చెప్పి మరి గొప్పతనానికి లోటుకదూ అంటూ మూతి ముప్పైవంకర్లు తిప్పుతారు. సరే ఒక విషయం చెప్తా యింకోటి చెప్తున్నా. కాసేపు యిల్లంతా పరీక్షగా చూస్తూ, అరే, మీ రేడియో చాలా చిన్నదే అంది కాస్త నిరసనగా (వాళ్ళింట్లో ఉంది రెండి చిన్న రకం బోషాణంలాంటి సెకెండ్ హాండ్ రేడియో) లోపల మంటగా ఉన్నా నేనేం మాట్లాడకుండా నవ్వేసా. ఒక్క క్షణం ఉండి, కడుపు కాస్త ఎత్తుగా ఉన్నట్టుంది ఎన్నో నెల? అంది ఎం...

(39-వ పేజీ చూడండి)

# మా నాగార్జునకొండ యాత్ర

మేము నాగార్జునకొండకు వెళ్ళినప్పుడు ప్రాజెక్టు ఇంకా ప్రారంభము కాలేదు. అప్పుడు ఆ ప్రదేశమంతా అరణ్యముగా నుండెడిది కొండపైన పులులు పగటిపూట నిర్భయముగా తిరిగెడివట. అందుకని ఈ ప్రదేశానికప్పుడు స్త్రీలు వంటరిగా వెళ్ళటానికి వీలు లేకుండుటవలన మా స్కూలులో నుండి మేము, మా లేడీ టీచర్లు, మొగపిల్లల బడినుండి ఒకబృందం మాసర్లు అందరము మూడు ప్రయివేట్ బస్సులు తీసుకుని సాయంత్రము నాలుగుగంటలకు నలగొండనుండి బయలుదేరాము. పదిగంటల రాత్రికి పెండ్లిపాకుల యను గ్రామము చేరుకున్నాము ఇచ్చట ట్రావలర్స్ బిల్డింగ్ ఒక్కని వసతులతో చాల పెద్దదిగా వుంది రాత్రికి అందరము ఇందులోనే వుండిపోయాము. తరువాత నాలుగుగంటలకి లేచి ఫలహారాలు చేసి మళ్ళీ బయలుదేరాము. మధ్యాహ్నము వెళ్ళేప్పుడు విశ్వేశ్వర మను గ్రామము చేరుకున్నాము. ఇచ్చటన్నీ శిథిలావస్థలో యున్న దేవాలయములున్నాయి. ఎక్కడ చూచినను పెద్దపెద్ద శివలింగాలున్నాయి పూజచేసెడి వారు యెవ్వరు లేనందున పాడుబడి వున్నాయి. మేము ఈ గుళ్ళన్నీ తిరిగి వచ్చే వరికి వంట అయ్యగార్లు భోజనము తయారు చేశారు. తరువాత మేమందరము భోజనాలు చేశాము. కృష్ణానదియొక్క ఇవతలిఒడ్డునుండి అవతలిఒడ్డుకు పడవలలో వెళ్ళాలి. ఆడవాళ్ళందరము ఒక పడవలో కూచున్నాము. మాపడవ కదిలేముందు పువ్వులు, పండూ, టెంకాయలు కొట్టి నదిలో వేశాము. సరదాగా పాటలు పాడుకుంటూ సురక్షి

కుమారి అనసూయాదేవి
(నల్లగొండ)

తంగా అవతలివొడ్డు చేరుకున్నాము. ఇచ్చటి నుండి కాలినడకద్వారానే పుల్లారెడ్డిగూడె మను ప్రాంతమునకు పోవాలి. పెద్దపులుల విషయం జ్ఞాపకం రాగానే మా భయము చెప్పనక్కరలేదు. అది ఇరుకైనత్రోవ. ఒకవైపు కృష్ణానదిఒడ్డు, రెండవవైపు కొట్టవచ్చినట్టున్న నల్లనిపర్వతము. అన్నీ పొదలే వీనినుండి క్రిముల "గీ" యనే శబ్దము, వీనికి తోడుగా కారు చీకటి. ఇక ఈ వాతావరణమెటువంటిదో మీరే వూహించండి. పెట్రొమాక్సులైట్లు వెలిగించారు. అయినను మా భయము పోలేదు. మావెంట హెడ్మాసరు గారిభార్యకూడా వచ్చారు. వీరు మాకు త్రోవలో నవ్వించే, కవ్వించే కమ్మనికథలూ చెబుతూ పోయారు. కాబట్టి సరిపోయింది లేకుంటే మాపరిస్థితి ఎట్లా వుండెడిదో! కథలు వింటూ, అక్కడక్కడ కూచుని పాటలు పాడుకుంటూ ఎట్లాగో పుల్లారెడ్డి గూడెము చేరుకున్నాము. ఇక్కడి ప్రజలు మమ్మెన్నో ఆదరించి, వాళ్ళయిండ్లలో పడుకోటానికి స్థలము యిచ్చారు. వీరితో ఇక్కడి విషయాలగురించి మాటాడి ఒక కునుకు తీశామో లేదో భళ్ళున తెల్లవారింది. అందరము స్నానాదికాలు ముగించుకుని ఫలహారాలు చేసి, పదిగంటలకి నాగార్జున శిల్పాలని చూడటానికి మ్యూజియమ్కు బయలుదేరాము

ఈ మ్యూజియమ్కు వెళ్ళుతూంటే త్రోవలో నాగార్జునకొండ కలుస్తుంది. ఈ గుట్టంతయు వృత్తాకారముగానుండి, గంభీరముగా ఎత్తుగా ఉన్నది. నాగార్జునుని కాలంలో ఇక్కడ బౌద్ధవిహారములు, చైత్యములు, స్తూపములు, మండపములు, ఎన్నో కట్టబడినవి. ఆ కాలమున ప్రాకృతభాష రాజభాషగా నున్నట్లును, ఇచ్చట బౌద్ధ భిక్కులకు నాయకురాలగు శాంతిశ్రీ అనునామె వీరికి సదుపాయములు కలిగించినట్లును, శాసనములపైన వ్రాయబడి వుంది. ఈ మ్యూజియమ్ ప్రభుత్వరక్షణలో యున్నది. ఇక దీనిలోని విగ్రహాలగూర్చి చెబుతాను.

మొదట మనము మ్యూజియమ్లోనికి వెళ్ళగానే మానవునిజీవితము, పంచభూతములతో నిర్మింపబడినదని తెలుపునట్లు ఐదు స్తంభములు పాతిబడివున్నట్లున్నవి. బుద్ధుని జీవితములో జననము. వైరాగ్యము, జ్ఞానసిద్ధి, మత ప్రచారము, నిర్యాణము అను ఐదు ప్రధాన సంఘటనలకు ఇవి చిహ్నాలంటారు. కుడివైపుభాగమునందు త్రిమూర్తులని భావింపదగు మూడు చిహ్నములు గలవు. ఆ చిహ్నములే త్రిరత్నములనబడు ముఖ్యమైన మూడు సూత్రములు: "బుద్ధం శరణం గచ్ఛామి, ధర్మం శరణమ్ గచ్ఛామి, సంఘం శరణం గచ్ఛామి"—అనునవి

మరొకచిత్రములో చెవులపిల్లి చిచ్చురుకుచున్నట్లును, జాబిలి తొంగిచూచుచున్నట్లును కలదు. దీనికథ బుద్ధుడు కుందేలు అవతారమెత్తినప్పుడు, దేవతలు అతని దయాదాక్షిణ్యములను పరీక్షించ నెంచి, కిరాతవేషములోవచ్చి భుక్తికొరకై మాంసమడుగగా, నేను చిచ్చురికదను, ఆపైననన్ను భుజింపుడని చిచ్చురికి లీనమయినాడట. ఈవిధముగా లీనమగుటవలన కుముద మహా



నాగార్జునసాగర్ వద్ద బయటపడిన "బుద్ధుని పూజామందిరం" శిథిలాలు.
—ఫోటో: ఓ రాజారావు (చీరాల)

కేశాంబుడను నామము సార్థకమయినదట.

మరియొక చిత్రములో కంటకమను గుఱ్ఱము కంటనీరు పెట్టుచున్నట్లును, బుద్ధుడు తన అశ్వపాలకుడు ఛన్నుడికి ఆభరణము లిచ్చుచున్నట్లును అగుపడును. ఈ సన్నివేశము బుద్ధుడు ఇంటనుండి అడవులకు పారిపోయినప్పుడు ఒకచోట నాగముచిలింద్రుడను సర్పము బుద్ధునితలపై పడగ విప్పినటున్నది. ఇదియే వీరి జ్ఞానోదయమునకు చిహ్నము.

ఒకచోట విచిత్రమైన సంఘటన కనిపించును. ఆనందునికి బుద్ధుడు జ్ఞానబోధ చేయడం. ఆనందుడు బౌద్ధమతమునందు చేరినను, భార్యా వ్యామోహము వీడకుండుటచే బుద్ధుడు ఆనందునుద్దేశించి "గ్రుడ్డికోతిని కోరుకుందువా, అప్సరసను కోరుకుందువా?" అని యడుగగా అది విని ఆనందుడు అప్సరసనే కోరుకుందునన్నాడు.

అప్సరసను కోరుకున్నట్లయిన గ్రుడ్డికోతిని విడచిపెటవలయును. ఐహికవిషయములన్నియు గ్రుడ్డికోతివంటివి. ఆముష్మిక వాంఛలన్నియు అప్సరసలవంటివి. నీవు మోక్షమునకు సోపానములు కట్టదలచి అప్సరసను పొందదలచితివేని ఐహిక విషయములను త్రుంచివేయవలయును" అని బుద్ధుడు ఆనందునికి బోధించినట్లు చక్కగా చిత్రీకరించాడు. ఈ చిత్రమునందే గల మిథున చిత్రములను చిత్రీకరించినటయిన బుద్ధుని దయాదాక్షిణ్యమును చూడటానికని ఏతెంచిన పాతాళ నాగదంపతులని తెలియును.

స్త్రీలను ఎంతో చక్కగా చిత్రించారు. ఏనాళ్ళు ప్రయాసపడి, రాతిబండ యని తృణీకరించక, యా రాతి బండలకు జీవము పోసి, త్రిలోకసుందరులా యనదగు నీ చిత్రముల చిత్రించి, తమ అసమాన శిల్పనైపుణ్యమును తెలియచేశారుకదా? ఆ మహాశిల్పులు వీరు కవులకు తీసిపోరు. ఆనాటి సాంఘిక, వైజ్ఞానిక, రాజకీయ విషయములు, వేదాంత తత్వజ్ఞానములు, నాగరికత, సంస్కృతి, చరిత్రలు, ఇతిహాసాలు, నాటకములు ఇత్యాదివిషయమును నేడు చలనచిత్రముల ద్వారా చూపెటుచున్నారో అట్లాగే నాటికాలమున నివి శిల్పకళా మూలమున చూపెట్టెడివారేమో. ఈ శిల్పకళ ఆంధ్రుల ప్రతిభను, నాగరికతను తెలుపుచున్నది. ఒక బుద్ధునిబోధనే కాక మన జీవితమునకు సంబంధించిన అనేకవిషయములను నేను వీనినుండి గ్రహింపగలిగాను. ★

## రకరకాల బాధలు

(37 వ పేజీ తరువాయి)

కుతూహలంగా. ఆ ప్రశ్నకి చిత్తయి ఊర్కొన్నా. మా పరిచయం అయి ఓ రోజుకన్నా ఎక్కువ కాలేదు కాని ఆవిడ ప్రశ్నల వర్షం, ఆ చనువు చూస్తూంటే చెప్పలేనంత వెగటు వేసింది. వెళ్ళిపోతూ తెలీకడుగుతా మీ వయస్సెంత అంది. యిష్టం లేక పోయినా త్వరగా పోతుంది కదాని చెప్పా! అరే. అంతేనా? నేనింకా కనీసం మీకు పాతిక పైనే ఉంటుందనుకొన్నా. మీరలా నే కనిపిస్తారందిదృఢంగా. నాకేమో మొన్న సంక్రాంతికి పద్దెనిమిదో ఏడు వచ్చిందని అంది తిప్పుకొంటూ. అరే! అంతేనా? ఆ అమ్మాయి మీ కూతురేమో అనుకొన్నా. మీరలా నే కనిపిసారు ముప్ఫై ఏళ్లవాళ్లలా అన్నావళ్ళనుండి. అంతే ఆవిడగారి వాక్ప్రవాహం ఆగిపోయింది. చాలా కోపం వచ్చినట్టు ఆవిడ ముఖం చూస్తూ గ్రహించుకొన్నా. కానీ ఏం చెయ్యను చెప్పండి! ఆవిడ ప్రశ్నల వరుస మాత్రం ఏం మర్యాదగా ఉంది? చాలా మంది వాళ్ళనుటుకు వాళ్ళు పదహారేళ్ళ బాలా కుమారైలా, ఇవతలివాళ్ళేమో ముప్ఫై పైబడ్డ వాళ్ళలా మాటాడుతారు. ఇంతకీ ఆవిడ కోపం, నా మీద రకరకాలుగా ప్రచారం చేసే వరకూ పోలేదు. మా వారంటారు కదా, కాస్త తొందరపడ్డావు, చాలా మటుకు తప్పు నీదే నంటారు. నాకేమో ఇప్పటి వరకూ నా తప్పేమిటో అర్థం కావటం లేదు. ★

# మన సమాజంలో భర్తృవిహీనల దుస్థితి

## ఇరుగు పొరుగు అమ్మలక్కల దెప్పిపొడుపు

'చంపక'

స్త్రీ జీవితంలో వివాహం ఒక ముఖ్యమైన ఘట్టం. ఆమె ఈ వివాహానికి ఎంత ప్రాధాన్యత నిస్తుందంటే ఊహలు తెలిసినప్పటినుండి (అంటే 13, 14 ఏళ్ళ వయస్సునుండి) భర్తకు ఒక రూపకల్పన చేసుకుని, మనస్సులో చిత్రించుకుంటుంది. అతనితో తాను పంచుకునే సుఖాలనుగూర్చి కలలు కంటుంది. అవి సత్యంగా రూపం దాలుస్తే ఆమె ఆనందానికి అవధులుండవు. ఒకవేళ అవి భిన్నం అయినాకూడా, ఆమె భర్త ఇష్టానుసారం, నడుచుకోటానికే ప్రయత్నిస్తుంది. అది ధర్మం అని అనుకోండి, లేక లోకానికి జడిసి అనుకోండి అతని రుచులే తన రుచులుగా అతని ఆశయాలే తనవిగా, అతని కష్టసుఖాలే తనవిగా భావించుకుని జీవితం శాంతిమయంగా చేసుకో చూస్తుంది. వివాహంతో స్త్రీ జీవితానికి, సాఫల్యం కలిగినట్లు భావిస్తుంది. సంఘంలో స్త్రీకి గౌరవస్థానం కల్గుతుంది వివాహంలో. భర్తకు అనుకూలవతిగా, పిల్లలకు మాతృమూర్తిగా ఆమె తన జీవితం వారి సుఖశాంతులకు అంకితం చేస్తుంది. అటువంటి ఆమెకు భర్తృ వియోగం ఎటువంటి విఘాతమో అనుభవించే వారికే తెలుస్తుంది.

క్రిందటి రోజు వరకు తనకు అతనికి గల పవిత్రమైన బంధం ఆ రోజుతో లేదనుకోటానికి, ఆమె మనస్సు ఒప్పుకోదు. ఇహ తనకు తన భర్తతో సంబంధం లేదనుకోలేక ఆమెపడే బాధ మాటల్లో వర్ణించ సాధ్యంకానిది. అసలు ఆమె స్థానంలో వుండే వాళ్ళకే గాని అర్థంకాని అయోమయావస్థ అది.

ఆ దుఃఖంలో ఆమె అన్నపానాదులు విసర్జించేస్తుంది. సరే మిగతా అలంకార విశేషాదులమాట చెప్పనే అక్కరలేదు ఇప్పుడిప్పుడు కొందరికి అతి సన్నిహితులైనవారి బలవంతంచేతగాని, బిడ్డలకోసమని గాని కేశ ఖండన జరుగుటలేదు. బిడ్డలకోసమని ఎందుకన్నానంటే, పసిపిల్లలున్న తల్లులుంటారు. వారి బిడ్డలు తల్లికి క్రొత్తగా వచ్చిన రూపు పోల్చుకోలేక, తల్లదగ్గర చేరక, పాలుసహితం తాగక తల్లికి క్రొత్త దుఃఖం తెచ్చిపెట్టే వారున్నారు. అల్లా జరుగనివారిపని సనాతనుల ఇండ్లల్లో మరీ ఘోరం. వారి చేతి మంచినీరుకూడా ముట్టరు ఆచారవంతులు. వారి చేతి అన్నం తినరు అవసరం వచ్చినా సరే. అసలు వారి దర్శనమే పనికిరాదు

భర్తృ వియోగంతో జీవితం శూన్యమైపోయిన నిర్భాగ్యురాలికి వీరు ఇచ్చే ఆదరణ అలాంటిది. ఇవి చూస్తూంటే స్త్రీకి స్త్రీయే శత్రువా అనిపిస్తుంది బార్బరాస్మృత్ చెప్పినట్లు ఆవిడ ఒక విధంగా అదృష్టవంతురాలే. ఎంచేతంటే ఆవిడకు స్వంతంగా ఒక వ్యాపకము, ధనార్జనా సదుపాయము వున్నది. మన సంఘంలో భర్తను కోల్పోయిన స్త్రీ గదులలో మగ్గవలసినదేగాని, ఇంకేమి చేయుటకు పనికిరాదు. ఉద్యోగ సద్యోగాల మాటలావుంచి, ఇంట్లో జరిగే ఏ ప్రస్తావనలోనూ, ఆమెకు సంబంధం వుండదు. ఇకపోతే వంటపనికి తప్ప ఇంకెందుకూ పనికిరాదు. అంతక్రితంవరకూ, తన యాజమాన్యాన నడిపిన కుటుంబానికే తాను పరాయిదయిపోతుంది. ఎటువంటి పరిణామమో చూడండి!

ధన సంపత్తిగల కుటుంబాల్లో సంగతి వదిలేసి, రెక్కలాధారంగా ఒతుకుతూ కుటుంబ సంరక్షణ చేసుకుంటూన్న కుటుంబాల్లో మరీ దుర్భరం. చిన్న జీతగాడు సంసార భరణం పోను మిగిల్చేదేమీ వుండదు భార్యా వంటిమీద ఏ చిన్నం, చిదరా వున్నా, ఏ అవసరానికో పోతుందిగాని, వుండదు. అటువంటి పరిస్థితిలో కుటుంబ రక్షకుడు పోతే, ఆ అమ్మాయి చిన్నదే, పిల్లలుగలదే అయితే, ఆవిడ అవస్థ భగవంతుని కెరుక. ఇటు అత్తమామలు ఆదరించరు. అటు పుట్టింటివారు మాత్రం ఏం చెయ్యగలరు? అట్టే పెట్టుకున్నారనుకుందాం, వాళ్ళ వీళ్ళ నూటీ పోటీ మాటలు భరిస్తూ అన్న, వదినెల దెప్పులు తింటూ వాళ్ళకి, వాళ్ళ పిల్లలకి చాకిరీ చేస్తూ జీవితం వెళ్ళదీసుకోవలసిందే. చదువుకున్న వాళ్ళ సైతా వుద్యోగాలు చెయ్యనియ్యరు. సామాన్యంగా, పరువు, ప్రతిష్ఠలు అడ్డుపడతాయి.

డబ్బుగలవాళ్ళకి మరో పేచీ వస్తుంది. భర్త వ్యవహారాలు తాము చూచుకోగల సమర్థతవున్న ఆడవాళ్ళున్నారు వాళ్ళను సంఘం ఏమంటుందో తెలుసా "భర్తకన్న ఎక్కువగా చూచుకుంటోంది చూశారా వ్యవహారాలు, ఆయన పోతేయేం? విచారమా ఏమన్నానా?" అని ఆమె చూచుకోక, ఏ బంధువుమీద నేనా పెడితేమాత్రం? ఏదైనా తన పిల్లల సంగతి సందర్భాలు స్వయంగా చూచుకున్నట్లుంటే పుగదా? కాని ఎంత దుఃఖాన్ని దిగమింగుకుని ఆమె ఆపని చేసుకుంటోందో ఆలోచించరు. మా స్నేహితురాలు తండ్రి పోయినాక పుట్టింటికి వెళ్ళి తిర్గి వచ్చిందిట వచ్చిన రెన్నాళ్ళకి గాని నాకు తెలీదు. వెళ్ళి చూచివచ్చాను. సరే మామూలు ఓదార్పు అయినాక, ఆవిడ అన్నదిగదా, "రెండు రోజుల్నుంచి, చుట్టుపక్కలవాళ్ళూ, మా అత్తగారి తరఫు వాళ్ళూ అంతా వచ్చి, కాస్సేపు ఆ మాట ఈ మాటా మాట్లాడి, అయితే అమ్మాయి, మీ అమ్మ, తన సొమ్ములన్నీ ఏం చేసిందమ్మా, ఎవరికిసుందట? రవ్వల దుద్దులూ అవీ వుండాలిగా ఎవరికిస్తుందో? పాపం! ఆవిడకి పెట్టుకునే యోగం లేకపోయిందిగదా! అది ఒకటే వ్రాదర పెట్టారు నేను నాకు తెలీదండీ, ఏమీ అనుకోటం లేదు ఆవిషయాలు మా యింట్లో, అని సరి చెప్పేప్పటకి దేముడు కన్పించాడు" అన్నది. చూశారా ఒక మూల పుటమునిగి వాళ్ళేడుస్తుంటే వీళ్ళకి కుతూహలం! తర్వాత ఏదో ఒకటి చేసుకుంటారు. వీళ్ళకెందుకూ చెప్పండి?

భర్తృవిహీనయైన స్త్రీని, ఆ దుఃఖోపశమన చెయ్యటానికి ప్రయత్నాలు చెయ్యాలి గాని, ఆవిడను ఇంకొస్త బాధపెటరాదు. చేసే సహాయాలు లేకపోయినా ఎద్దేవా చేసే వాళ్ళు చాలామంది వుంటారు. భగవంతుడు చేసిన అన్యాయాన్ని మానవుడు రెండు రెట్లు ఎక్కువ చేస్తున్నాడు ఆచారాల పేరిట; దిన్ని అరికట్టాలని వీరేశలింగంగారి లాంటివారు ప్రయత్నాలుచేసి కొంతవరకూ సాధించారుగాని సమూలంగా నాశనంచేయలేకపోయారు. కాలక్రమేణా ఇలాంటి దురాచారాలు దూరమౌతాయని ఆశిద్దాం.

ముఖ్యంగా సంఘ వ్యవస్థలో మార్పువస్తే గాని లాభంలేదు. సంఘం అంటే వ్యక్తులే గదా! మనస్సులోని మాలిన్యాన్ని తొలగించుకుంటే వితంతువు కూడా మనిషేననీ, ఆమెను (కూడా) పూర్వపు మనిషిగానే

(41-వ పేజీ చూడండి)

# వనితా వాణి



వనితాలోకంలో ఆర్. ఇందిరగారు వ్రాసిన 'విశాల హృదయాలు' వ్యాసం చదివి ఎంతో ఆనందించాను. నిజంగా యీ కాలంలో అటువంటి విశాలహృదయులెంతమందో తెల్లారి లేచింది లగాయతు కనిపిస్తారు.

బి. కుసుమకుమారి, (కాకినాడ)

*　　*　　*

ఇందిరగారు 'విశాలహృదయాలు' అను వ్యాసమును పోయినవారం చక్కగా వ్రాశారు. కాని అందులో కేవలం మగవారి తప్పులే ఆపాదింపబడ్డాయిగాని ఆడువారుకూడా అంతకుమించే అసభ్యంగా ప్రవర్తిసుంటారు.

ఎ. పార్వతిగారు వ్రాసిన 'మన సమాజంలో భర్తృవిహీనల దుస్థితి చదివాను. చాలా బాగా వ్రాశారు.

—పి. వాణీకుమారి, విజయవాడ]

*　　*　　*

## "అన్యాయం"

పులతరల్ పరిమళగారు వ్రాసిన "సహోదరుల దృక్పథం పూర్తిగా మారాలి" అన్న వ్యాసం చదివాను. నా అభినందనలు ఆమెకు తెలియజేస్తున్నాను.

కాని, ఆ వ్యాసములో ఆమె ఒక చోట "మరి మీకు లేని ధర్మం ఆడవారి నెత్తిమీద రుద్దటమెందుకు" అని వ్రాశారు. ఇక్కడ ఆమె పురుషుల నందరిని ఉద్దేశించి వ్రాసినట్లు తెలుస్తోంది. అవిన్నముగా వ్రాయుట తప్పేమోనని భావిస్తున్నాను. ఎందుచేతనంటే ఆ రచయిత్రి పురుషు లందరిమీద కలిపి ఒక విసురు విసిరినారు. ఇలా మూకుమ్మడిగా విమర్శ చేయడం అన్యాయం.

క. శేషగిరిరావ్, (విజయనగరం).

*　　*　　*

సత్యవతీదేవి, ఏలూరు వ్రాసిన ఉపాయం బాగుంది. మొన్న ఒకరింట్లో టేబుల్ క్లాత్ మీద డిజైను చాలా బాగుంది. డిజైను కాగితం లేదు. మొన్న పత్రిక చూడగానే చేసి చూశాము. చాలా బాగా వచ్చినది. వారికి నా హృదయపూర్వక అభినందనలు. ఇటువంటి ఉపాయాలు ఊహించి తేలిక చేసే పద్దతులు వనితాలోకానికి ఇంకా రాస్తారని తలుస్తున్నాను.

—"శశి" పెద్దాపురం[

## అదా కారణం?

"నేను చదివాను బి.ఎ., కాని ఏం లాభం?"

అన్న శ్రీమతి టి. ప్రభావతిగారి వ్యాసం చదివాను. చాలా బాగుంది. కాని వారు అంత చదువు చదివి, చివరకు యిలా ఎందుకు నిస్పృహ చెందారో చాలా ఆశ్చర్యంగా వుంది.

పెద్ద చదువులు చదివి, ఒకరిచేత "మీరు ఎంతవరకు చదివారమ్మా" అని అడిగించుకో నంతమాత్రాన, మనం నిస్పృహ చెందటం స్త్రీ నైజం తప్ప మరొకటి కాదనుకుంటాను.

—తంగెళ్ళ పాండురంగశర్మ, విజయవాడ]



## భర్తృవిహీనల దుస్థితి

(40 వ పేజీ తరువాయి)

భావించి గౌరవించాలి. ఇక పిల్లల విషయంలో చూస్తే, మగపిల్లలు తల్లినుంచి తమను తాము దూరంచేసుకుంటారు: (పెద్దవాళ్ళయి నట్లయితే) ఆడపిల్లలు తల్లికి మరింత దగ్గరకు చేరుతారు. (నా అభిప్రాయంలో) తండ్రి పోగానే మగపిల్లవాడు స్వతంత్రుడైపోతాడు. అతనికి తనకుతానే పెద్దగా భావించుకునే మనస్థితి ఏర్పడుతుంది. దీనికితోడు అధికారం డబ్బూకూడా చేతికి వచ్చాయంటే ఇక పట్టపగ్గాలుండవు. అలా అని తల్లిని చులకన చేస్తాడని కాదు చెప్పటం, కానీ, మునుపటి భయభక్తులు నశిస్తాయి. సామాన్యంగా తల్లి దగ్గర పిల్లలకు చనువు జాస్తి, తండ్రికన్నా, అటువంటిది తండ్రి భయము లేకపోయాక. తల్లి ఏమీ చేయలేని పరిస్థితిని అండచేసుకుని దుర్వ్యాపారాల్లో దిగే పరిస్థితి లేకపోలేదు. అలాంటప్పుడు ఈ అసహాయురాలైన తల్లి ఏమిచేస్తుంది? ఆమె ఏమన్నా అన్నా ఆమె మాటలకు విలువకట్టడు ఆ కొడుకు. అప్పుడు ఆ సంసారంలో శాంతి భద్రతలు కూడా నశించి, కొడుకంటే ఈమెకు, ఈమె అంటే కొడుక్కు ఏహ్యభావాలు కలగటంకూడా కద్దు. అప్పుడు ఆమె జీవితానికి ఇక ఏ ఆలంబనా లేకుండాపోతుంది.

ఈ విషయం ఎంత రాసినా, ఇంకా వుంటూనే వుంటుంది. నన్నడిగితే, భర్తృవిహీనయైన స్త్రీ సాధ్యమయినంతవరకూ, కుటుంబంలో 'తప్పించుకు తిరుగువాడు' సామెతగా వుండాలనుకుంటా. లేకపోతే ఆమె ఏదైనా స్వతంత్రంగా బతికే వుపాయం చూచుకోవాలనుకుంటా. మాటలనేవాళ్ళు, కబురు చెప్పేవాళ్లు ఏమీ సహాయపడరు సరిగదా. ఏదైనా ఎచ్చు తగ్గులువస్తే అపహాస్యం చేసేందుకు వెనకాడరు. సాధ్యమైనంతవరకు ఒకరిమీద ఆధారపడకుండా బతికటం వుత్తమం. భార్గ్వరాస్మిత్ రాసినట్లు ఆమె నిజంగా మనవాళ్ళకన్న ఈ విషయంలో చా అదృష్టవంతురాలు.



## వాట్యభక్ష్యం

వాట్యభక్ష్యం అన్నది యవలు, గోధుమలతో తయారుచేయు పదార్థము.

యవలు-గోధుమలు సమానభాగములుగా గైకొని వాటిని కొద్దిగా వేయించి, విసిరి పిండి తయారుచేసుకొనవలయును. ఆ పిండిని జల్లించి, అందు కొద్ది నేతిని, ఉప్పుపొడిని (సముద్రలవణంకన్నా, సైంధవ లవణం వేస్తే మంచిది) చేర్చి, నీరు చేర్చి పూరీలముద్దవలె తయారుచేయవలయును. దానిని పూరీలవలె వత్తి నేతితో వేయించవలెను. తినడానికి కమ్మగా హాయిగా వుంటాయి. దీనినే వాటభక్ష్య మందురు. ఇది దగ్గుతో బాధపడేవారు, రొంపతో సతమతమయేవారు, మేహరోగులు, వీరికి హితవుగా వుండి, రోగోపశమనం అగును.

—వైద్యశ్రీ ప్రకాశచంద్రశతపథి, విజయవాడ.



# ఎల్లమ్మ



(23-వ పేజీ తరువాయి)

వెళ్ళింది. కోడలిచేత తొందర తొందరగా జావ కాపించి, బ్రతిమాలి బ్రతిమాలి ఎంతో కష్టంమీద మూడు గుక్కలు బలవంతంగా కొడుకుచేత మింగించింది. తడిగుడ్డతో వాడిముఖం బాగా నిదానంగా వొత్తింది. విసనకర్రతో విసిరింది. శేషమ్మ తల్లి చెప్పిందే నిజం. కడుపులో ఏమీ ఆహారంలేకే నిస్త్రాణగా మొహం తిరిగి పడిపోయిన లచ్చడు ఇప్పుడు కళ్లువిప్పి చూశాడు. ఎల్లమ్మ చప్పున లేచింది. కోడలిని అక్కడే నిలబడి, కావలిస్తే మళ్ళీ జావపట్టమని పురమాయించింది. వెంటనే వీధిలోకి వచ్చింది. ముక్కుకమ్మ ఊడదీసి చేతపట్టి కోమటింటికి పరిగెత్తింది. అతనిదగ్గర కమ్మతాకట్టు పెట్టి పదిరూపాయలు పుచ్చుకొని, గబగబా అడుగులు వేస్తూ వైద్యుడు గుర్లింగాచారి యింటికి పరిగెత్తి ఆయన చేతులో ఐదురూపాయిలుపోసి ఇంటికి తీసుకువెళ్లి కొడుకును చూపిస్తూ, వాడిని ఎలాగేనా రక్షించమని ప్రాధేయపడుతూ ఏడ్చింది అతడు లచ్చడిని చూసి, చెయిపట్టి నాడి పరీక్షించి, తల కాటించి, "ప్రాణ భయంలేదు ఎలమ్మా" అంటూ భరవసా ఇచ్చాడు. మందు లేవో పురమాయించాడు

ఎలమ్మ శేషమ్మ యింటికి పనికివెళ్లడం మానివేసింది ఇది మూడో రోజు. వచ్చే ప్రాణం పోయే ప్రాణంతో మూలుగుతూ మంచంమీద పడిఉన్న తన తొలిసంతానం లచ్చన్నను జూస్తున్న ఆమె మనస్సులో పాత విషయాలన్నీ అవశంగా ఒకటితరవాత ఒకటి మెదిలినవి, ఒక ఐదేళ్లపిల్ల గావంచా మొలకు చుట్టి, చింపిరిజుత్తు గాలికి ఎగురుతూ నెత్తిమీద తట జారుతూంటే మళ్లీ సర్దుతూ, పదాలు పాడుతూ, పేడకూడ వేస్తూ. మురికిచేతులతోనే అంబలి జుర్రుతూ కనిపించింది. ఎర్ర రంగు గావంచాలు కట్టిన పన్నెండేళ్ల బాలికలు గంపలూ బొరిగెలూ చేతబట్టి గరికవేళ్ళకుపోతూ, దారినిపోయే పండు ముసిలి తాతను చూపించి "అడుగోయే నీ మొగుడు——కాదు నీ మొగుడు" అంటూ విరగబడి నవ్వుకుంటూ కనిపించారు. మందార పువ్వురంగు కోకకట్టి, కచోరాల వాసనతో, నిగనిగలాడేట్లు మెడ తిప్పుతూ, చేతులూపుకుంటూ, వయ్యారంగా, తలమీద తిండి గంపతో భర్త దున్నే పొలానికి పోతున్న ఒక నవయువతి కనబడింది. ఎల్లమ్మకి చిరునవ్వుతో పాటు కళ్లనీళ్ళుకూడా వచ్చినవి. పిల్లలతో వేగలేక వాళ్లను తిట్టి కొడుతున్న ఎల్లమ్మముఖం కనిపించింది. భర్త చనిపోయి దుఃఖంతో దొర్లుతున్న దైన్యముఖం కనిపించింది. కూలిపుట్టక, కుమిలి కుమిలిఏడుస్తున్న అనాథముఖం కనిపించింది. ఆకలి తట్టుకోలేక ఏడుస్తున్న పిల్లలతో పాటు చేతకాక తనూ ఏడుస్తున్న ఒకానొక దిక్కుమాలిన ఎల్లమ్మముఖం కనిపించింది. ఎలాగైతే ఏం, ఇన్ని బాధలూపడి చిటచివరికి ఆ శేషమ్మ తల్లి ధర్మమా అని తనూ పిల్లలూ ఇంతతింటూ రోజులు నెట్టుకు వచ్చారు. అమాంతంగా ఎవరో కుదిపినట్లు ఎల్లమ్మకి తనీ మధ్య శేషమ్మగారింట చేసినపని ఒక కొత్త కోణంలో కనబడింది. తను చేసినపని ఘోరమైన దొంగ పనిగాని కాదుగదా? అనుమానం వేసింది——అనుమానం నిశ్చయంగా మారింది. నమ్మిన వాళ్ళకు ద్రోహం చెయ్యడం కాదా? నిజం, నిజం ద్రోహమే. తక్షణమే ఆమె ఓ నిశ్చయానికి వచ్చింది. ఆ డబ్బులో ఒక్క దమ్మిడఅయినా, చిన్న మెత్తు బంగారమేనా తన కింతమాత్రం హక్కులేదు. ఇలాంటి స్వామి ద్రోహం పనులుచేసేనే తనవంటి వాళ్ళకి తక్కువ పనులు చేసుకుంటూ బ్రతికేగతి దేముడు నెత్తిని రాసిపెడతాడు. ఆ మహాతల్లి అన్నపూర్ణమ్మ చెయ్యి చల్లనితల్లి. శేషమ్మ తల్లికి ద్రోహం చేసింది. తనమీద పిడుగు పడకుండా ఇంతకాలం ఎలా బ్రతికిఉన్నానా అని ఆశ్చర్యపడ్డది.

మూడురోజులయింది. లచ్చన్న జబ్బు ఉధృతం అంతంతమాత్రం తగ్గినట్టుంది గాని, వాడిస్థితి ప్రమాదంగానే ఉంది. వైద్యుడు రోజూ వస్తూనే ఉన్నాడు, చూస్తూనే ఉన్నాడు మందిస్తూనే ఉన్నాడు, కొంచెం ఆలస్యమౌతుంది గాని వాడికేమీ భయంలేదని ధైర్యం చెబుతూనే ఉన్నాడు. ఎల్లమ్మకి మాత్రం వాడినిచూసి కడుపు తరుగుకుపోతున్నది. తనకొడుకు తనకు దక్కడా? జబ్బు మళ్లదా? దిక్కుమాలిన తను ఇప్పుడెవరికాళ్ళు పట్టుకోవడం?

మూడోనాటి సాయంత్రం కనుమాపు చీకటి పడుతున్నది. కొడుకు మంచందగ్గరే కూచొని ఎల్లమ్మ జావ కావాలా అని వాడి నడుగుతున్నది. ఇంతలోముందొక జట్కా ఆగిన చప్పుడు ఆమెకి వినబడి తల గుమ్మంవేపు తిప్పి చూసింది వంటినిండా గుడ్డ కప్పుకొని శేషమ్మ బండిదిగి గుమ్మంలోంచి లోపలికి తొంగిచూస్తూ, "ఎల్లమ్మా" అని పిలిచింది.

ఎలమ్మ దిగునలేచి గుమ్మందగ్గరికివచ్చి శేషమ్మను చూస్తూనే నిర్ఘాంతపోయింది. నోటమాట పెగలలేదు. వణుకు పట్టుకుంది. శేషమ్మగారికి కనబడకుండా ఎక్కడికేనా పారిపోదామా అనుకుంటూ అటూ యిటూ చూస్తున్నంతలోనే శేషమ్మ అంది:

"ఏమే, మూడురోజులాయ ఇంటికి రావడం మానేశావు? ఎలా ఉందేని కొడుకుకి?"

ఎలమ్మ జవాబుచెప్పక తప్పలేదు.

"ఇంకా అలాగే ఉందండమ్మగారు."

"అవునే, మొన్న నీకు డబ్బిస్తూ ఉంటే పుచ్చుకోకుండా ఎవోగావుకేకలు పెడుతూ అలా పారిపోయేవేమే?"

ఎల్లమ్మ బెల్లంకొట్టిన రాయిలా కిక్కురుమనలేదు.

"ఏమే మాటాడవు? బీద కూతురివి, ఆపదలో పడ్డావు. నీకేం మతిపోయిందే, డబ్బు పుచ్చుకోకుండా పారిపోయేవు?" పకాలున శేషమ్మ నవ్వింది. "లేకపోతే ——ఏమే నా డబ్బు కూడవేసి ఉంచుకున్నావుటే?"

శేషమ్మ నవ్వువిన్న ఎల్లమ్మకళ్ళముందో వెలుగు వెలిగిట్టినట్టు తోచింది ఆమె అమాం

తంగా నేలమీద బోర్లా చాగిలపడి శేషమ్మ రెండుకాళ్లూ పట్టుకొని వలవలా ఏడవ సాగింది.

శేషమ్మ నిర్ఘాంతపోయింది.

"ఏమిటే ఎల్లమ్మా!" అన్నదామె. "లే, కాళ్ళొదులు. సంగతేమిటో సావకాశంగా చెప్పాలిగాని, నా కాళ్లు పట్టుకోవడ మేమిటే?"

ఎల్లమ్మ లేవలేదు. ఏడుస్తూ, వెక్కుతూ, మధ్య మధ్య ఒక్కొక్క మాటగా అన్నది:

"అమ్మగారు - శేషమ్మతల్లీ - తమరు - చెమించేనా అంటేనే—తమరి పాదాలు - ఒగులాను—లేకుంటే—"

శేషమ్మకి నిజంగా ఆశ్చర్యం వేసింది. ఇది క్షమించమంటుందేమిటి? దేనికి క్షమించడం? ఇది ఏమి కానిపని చేసిఉంటుంది చెప్మా!" ఆమె కేమీ అంతు చిక్కలేదు.

"ఏమిటే వెర్రిదానా, నిన్ను క్షమించడ మేమిటే? - సరేలే, నీ మాటే కానీ, క్షమించానులే. ఇంక నీ కేం భయంలేదు, చెప్పు."

ఎల్లమ్మ లేచికూచుంది. శేషమ్మపాదాల మీద చేతులలా ఉంచుతూనే ఒక్కొక్క మాటా అంది.

"శేషమ్మ తల్లీ, మీ రేమో - దేముడిలాంటి వోళ్లు. నేనేమో - పాపం వొడికట్టుకున్న దాన్ని. ఆ రోజు, బాబుగారు కాలంజేసి నప్పుడు - గదిలో దూరి - చందుగపెట్టి తీసి - డబ్బూ బంగారం మూటగట్టుకొని పెరటి దోవను మా యింటికి పారొచ్చి - అటక మీద మూట దాచేసినాను."

ఈ మాటలువింటూ శేషమ్మ నీరై పోయింది. ఇన్నాళ్లకు తెలిసింది. తన ధన మెలామాయమై పోయిందో. ఇన్నాళ్ళకేనా తెలిసిందే! క్షణకాలం ఆమె మనస్సంతా భగున మండి పోయింది - క్షణకాలం మాత్రమే ఆమె వెంటనే మనస్సును స్వాధీనం చేసుకొని, ప్రశాంత వదనంతో చిరునవ్వు నవ్వింది. ఆత్మనిగ్రహమూ సంస్కారమూ గలవారు ఎట్టి విపత్తులు పైబడినా వెంటనే తెములుకుంటారు. నవ్వు ముఖంతోనే శేషమ్మ అంది.

"పోనీలేవే ఎల్లమ్మా. నువ్విప్పుడు మంచి విపత్తులో ఉన్నావు. అయిందేదో అయిపోయింది. ఎవరో ఒకరు తినాలిగదా, పోనీ నువ్వే తిన్నావు. ఆ డబ్బు నీకే ప్రాప్తమైందిలే. నా భర్త సంపాదించిన భూములే నాకు ఎక్కిడొక్కనీ. ఆ మహారాజు నాకేమీ అన్యాయంచెయ్యలేదులే. ఇహలే, లేచిపో. నిన్ను మనస్ఫూర్తిగా క్షమిస్తున్నాను"

"మాయమ్మా! శేషమ్మతల్లీ! నీ ధనంలో ఒక్క దమ్మిడీ - ఒక్క చిన్నమెత్తు బంగారం - నేను ముట్టలేదు."

"ఏమిటే!"

"ఉండండుండండి." ఎల్లమ్మ అమాంతంగా లేచి, అటకకి నిచ్చెన వేసి, తొందరగా నిచ్చెన ఎక్కసాగింది. అప్పుడే కోడలు అక్కడికివచ్చి శేషమ్మనుచూసి గతుక్కుమని వెనకకు తగ్గింది. అత్త తొందరగా అటక ఎక్కడం ఆమెకీ ఆశ్చర్యం వేసింది. కొద్దినిముషాలలో ఎల్లమ్మ తిరిగి ప్రత్యక్షమైంది. ఆమె చంకలో ఒక కుండ ఉంది. శేషమ్మ సమీపంగా ఆకుండదింపి, లోపల కూలిన పాతగుడ్డలన్నీ పైకిలాగిపారవేసి, అడుగున ఉన్న మూట పైకితీసి ఆమె పాదాల దగ్గిరుంచి మూట విప్పింది.

"ఇదోనండమ్మా మీధనమంతా" అంటూ ఎల్లమ్మ లేచి చేతులు జోడించింది.

శేషమ్మ పడ సంభ్రమాశ్చర్యాల కంతు లేదు. ఆమె అన్నది: నువ్వేమో నాకు ద్రోహం చేశానంటున్నావుగాని, ఎలమ్మా, నువ్వు నాకు మహోపకారం చేశావనే అంటాను. అమాయికంగా నా ధనమంతా నాకు ఇచ్చేశావు."

"కాదమ్మా, ఇనండి" అంది ఎలమ్మ. "ఈ బంగారంలో నానుంది. అది బాబుగారికాడ తనకాపెట్టి వొందరూపాయిలు తెచ్చినాను. వొడ్డీతో సహా నూటముప్ఫై రూపాయిలూ తీర్చేసినాను. లచ్చిమి సుక్కురోరాలలో నా సరుకివ్వనన్నారు. శనోరంరోజే బాబు పోయేరు. నా సరుకు పోతుందేమో అని భయమేసి గదిలోదూరి పెట్టె తీసినాను. డబ్బు సూసి దురుబుద్ది పుట్టింది. అంతా మూటగట్టినాను. అంతే."

శేషమ్మ ధనంమూటదగ్గిర కూచొని బంగారం అటూ ఇటూ కెలికి నాను పైకి తీసింది.

"ఇదేనా నీ నాను?"

"ఇదేనమ్మా" అంది ఎల్లమ్మ, పరమ సంతోషంగా. శేషమ్మ ఎలమ్మ చేతులో నానుపెట్టి, మళ్ళీ వంగి దోసెడు రూపాయిలు పైకితీసి, "ఇవికూడా తీసుకో" అంది.

"అమ్మో!" భయంగా కేకేస్తూ ఎల్లమ్మ దూరంగా పారిపోయి, గద్గద స్వరంతో అంది:

"వొద్దమ్మో—నా కా డబ్బు వొద్దు. దరమదాతలు మీరు. నాలుగు కాలాలపాటు సల్లగా ఉండండి మమ్మల్ని మీ సాటున బతకనివ్వండి—అవి మళ్ళీ మూట గట్టు మా తల్లీ"

శేషమ్మ మళ్లీ పకాలున నవ్వింది. ఎప్పుడోగాని నవ్వని శేషమ్మ అలా ఎల్లమ్మగుడిసెలో నవ్వేసరికి గుడిసెలో అందరికీ మనసులు తేలికపడాయి శేషమ్మ ధనమంతా తన గుడలో మూటగట్టింది లచ్చన్నమంచం దగ్గిరికి వెళ్లి వాడి నుదిటిమీద చెయ్యి వేసి అన్నది:

"ఆశీర్వదిస్తున్నాను లచ్చన్నా, వేగంగా కోలుకో—కోలుకోవాలి ఇదుగో విను. నువ్వెంత వేగంగా కోలుకుంటే అంత వేగంగానే పది పాడిగేదలు మీ సాలలో వచ్చి ఉంటవి. నువ్వు మరి కూలిపని చెయ్యవద్దు"





"మాష్టారండి! మా వాడికి వంట్లో బాగాలేదండీ! ఇవ్వాళ బడికి రాడండి...మాట్లాడుతూంది మానాన్నా రేనండి...!"

# బాలసాహితి

##  బుద్ధిబలం 

విచ్చలవిడి నడవులలో
నిచ్చలు తిరుగాడెడు పులి
మచ్చుకైన విడువకుండ
ఖర్చుచేసె జంతువులను.

తిండి కింక దారిలేక
మెండుగ మనుజులు మెసలే
కొండదారి పొంచియుండి
కొండొక బాపణ్ణి చూచి,

గర్జించగ, పులిని చూచి
గడగడలాడెను బాపడు.
గుండెదిటవు చేసికొనుచు
గలగల మని నవ్వసాగె.

రిచ్చవడిన పులియంతట
"మచ్చునకైనా వగవని
పిచ్చి బాపనయ్యావీవు,
చచ్చెదవని శంక లేద?"

అని పలికిన పులిని చూచి
అతడిట్టుల పలుకజొచ్చె:
"అయ్యయ్యో! పులిరాజా!
అరయలేవు నీ మృత్యువు!

కొండయవల బావిలోన
కొండొక పులియున్నాడు.
పాప మీవు నన్ను తినగ
కోపగించునేమొ యతడు."

"ఆ మొనగాడెవరబ్బా!
అతని జూపు"మని పులియనె.
అచట నున్న బావికడకు
అరిగిరి రయమున ఇరువురు.

బావిలోకి తొంగిచూచి
పాపము తన నీడనె యొక
పగవానిగ భ్రమసి మృగము
పట్టుదలతో నీటనురికె.

ఎంతబలము శౌర్యమున్న
ఏమి ఫలము బాలలార!
సుంత బుద్ధిబలము తోడ
ఎంతయైన చేయగలము. ★

డి. వి. సుభద్రాదేవి

# ఆలోచన ఆలాపన

అమ్మాయమ్మ అందమైన పిల్ల.

చాలా నెమ్మదస్తురాలు కూడా. పెళ్లియీడుకు వచ్చింది. అనగా- పదహారేళ్లు నిండాయి. తోటి అమ్మాయిలతో 'చెమ్మా చెక్క' 'ఒప్పులకుప్ప, ఒయ్యారి భామ' లాంటి ఆటల్లో కేరింతలాడుతూ వుంటే, చూడ ముచ్చటగా వుంటుంది అమ్మాయమ్మ.

ఆటలలో ఆరాటంగల వయసుదైనా, ఆమె పనిపాటల్లోనూ శ్రద్ధ గలదే. పనిమంతురాలు కూడా. సామాన్య కుటుంబానికి చెందినదై వుండటంవల్ల ఆ యింటిలో మగవాళ్లు మాత్రమే పొలం పనుల్లోకి వెళ్లినా, ఇంటిపని అంతా యీమే చక్కబెట్టవలసివచ్చేది.

ఇంటి పాచిపని మొదలు పాడీ, వంటార్పులకు కూడా, అమ్మాయమ్మే బాధ్యత వహించేది. అన్నీ స్వయంగా చేసుకొనేది. ఆమె పనులన్నీ ఒబ్బిడిగాను, శుచి శుభ్రతలతోను నిర్వహించుకొనేది.

ఇంచుమించుగా, యిల్లంతా, తనకు తాను దిద్దుకుపోయే తెలివితేటలూ, ఆరిందాతనం అలవడినాయనవచ్చు అమ్మాయమ్మకు.

ఆమె తల్లి అంత ముసలిది కాకపోయినా, అనారోగ్యవంతురాలు, అశక్తురాలు. అక్కలిద్దరికీ, పెళ్లిళ్లయిపోయి వెవరి కాపరాలకు వాళ్ళు వెళ్ళి పోయినారు. తండ్రీ, తమ్ములిద్దరూ పొలం పనిలోకి పోతూ వుంటారు. అందుచేతనే యింటి యావత్తు పూచీ ఆమే వహించవలసి వచ్చేది.

తీర్చినట్లు సమంగా నరికి, అలికి, యెర్రగా జేగురుపూసి, వరుసగా సన్నని సున్నం చుక్కలతో ఆమె యింటి గుమ్మాలూ, అరుగులూ, కూడా, కలకల్లాడుతూ వుంటాయి. పూరినేసిన యిల్లేమో - వేసవిలో - చల్లగా, రమణీయంగా వుంటుంది ఆమె నివాసం. వాకిట్లో బంతిపూల మొక్కలు వింతశోభలీనుతూంటాయి.

ఒకనాడు సందె గుమ్మాలు వూడ్చుకొంటోంది అమ్మాయమ్మ. నీరెండలో తానొక్కతే వున్నదానాడు. పరధ్యానంగా, నింపాదిగా పని చేసుకొంటోంది.

మెల్లని ఆలోచన తట్టింది ఆ చల్లని వేళ ఆమెకు.

"నాకు అమ్మా, నాన్నా, యెందరో చుట్టాలూ కూడా యీ వూళ్లోనే వున్నారుగదా. నాకు పెళ్లి అయితే, అత్తవారిల్లు కూడా, యిక్కడే కుదిరితే బాగుంటుంది. ఇక్కడ మేమంతా, కలిసే, వుండవచ్చు సోయిగా...అవును...నాకిక్కడే పెళ్లి అవుతుంది. ఇక్కడే- యీ వూళ్ళోనే కాపరం చేస్తాను నేను. కొన్నాళ్లకి, గర్భిణీ నవుతాను. ఓ మొగపిల్లవాణ్ని కంటాను. మరి కొన్నాళ్లకు...ఆ పిల్లవాడి కేదో జబ్బు పట్టుకుంటుంది. మందు లెన్ని పోసినా-నిమ్మళించదు ఎక్కువైపోతుంది జబ్బు. నా పిల్లాడికి రోగమెచ్చిపోయి-చచ్చిపోతే- ఒకవేళ-అమ్మ బాబో-నా అక్కలు, పిన్నమ్మలు, పెద్దమ్మలు, అత్తయ్యకావలసినవాళ్లంతా, యెంతమంది వస్తారో? నాతో బాటుగా - ఎంతగా యేడుస్తారో"

ఇలా, ధ్యానంలో పడి, పడి, చేతిలో చీపురుకట్ట గోడకు చేరవిడిచింది. ఆరున్నొక్కరాగ ఆలాపన మొదలుపెట్టింది 'అమ్మో, బాబో' అంటూ.

ఆ చిన్న పల్లెలో దగ్గర దగ్గరే వున్న చుట్ట పక్కాలూ, యిరుగూ పొరుగూ, నేస్తాలూ కూడా శ్రుతి కలిపేరు. 'పాపం, అమ్మాయమ్మకేమి కష్టం వచ్చిందో" అని.

వాళ్ళమ్మ, ముందే, బావురుమంది, లోపలినించి.

కొంతసేపటికి, తండ్రీ, పినతండ్రులూ, మేనమామలూ చేరారు. ఆ పాటే అందుకున్నారు

★

## వచ్చేవారం

### బాలల సంఘం సభ్యులపేర్లు

★

## ★ ఆలోచన: ఆలాపన ★

వాగూ.

రోదనాలతో నిండిపోయింది. యిల్లంతా. రణగొణ ధ్వనితో మారు మోగుతోంది.

అసలు సంగతేమిటో, యేమి కారణాన, ఆమె యేడుస్తోందో, అది అడిగి తెలుసుకొందామని ప్రయత్నించిన వాడొక్కడూ లేక పోయాడందులో.

కొంత గొడవ అయిన తర్వాత ఆఖరుకు ఓ గృహస్థు కదలేశాడు.

'ఏదేనా, అశుభవార్త అందిందా? ఎవరేనా, చనిపోయారా?'

అని, మెల్లగా.

'నాకేమీ, తెలియదు; ఆ ఆడవాళ్లకు తెలుసు; అడగండి'

ఒక మేనమామ జవాబు.

ఈ సమయానికి చక్కావచ్చాడు గ్రామపెద్ద. చప్పట్లు కొట్టి కేకలు వేశాడు.

"ఏమిటి గందరగోళం? కొంచెం సేపు ఆగండి; ఏమో, తెలుసుకుందాం"

ఎవరూ వినిపించుకోలేదు. గొడవ యెప్పటిలాగే సాగుతోంది.

కడకు, ఓ యెరిగిన ముసలమ్మ కనబడింది. ఆమెను అడిగేడు గ్రామపెద్ద. 'యీ ఏడుపులూ, పెడబొబ్బలూ యెందుకమ్మా' అని.

'నేనిక్కడికి వచ్చేటప్పటికి యీ అమ్మాయి (అమ్మాయమ్మ) యేడుస్తోంది. యెందుకో తరువాత చుట్టపక్కాలూ, నేస్తాలూ చేరి అందుకున్నారు. అంతకన్నా, నాకేమీ, తెలియదు' అంది ముసలమ్మ గ్రామపెద్దతో.

అమ్మాయమ్మను పలకరించి 'సంగతేమిటి. నాచెవిని కాస్త, వేయవమ్మా' అని బుజ్జగించాడు గ్రామపెద్ద.

'నాకు పెళ్లిఅవుతుందనీ, యీ వూళ్లోనే కాపరంచేస్తాననీ, పిల్లాణ్ని కంటాననీ, వాడికి జబ్బు చేస్తుందనీ, వాడు దిగనాసిల్లి చచ్చిపోతాడనీ, అక్కలూ, మేనత్తలూ, మేనమామలూ, చుట్టపక్కాలూ, నేస్తాలూ చుట్టూమూగి విచారిస్తారనీ, అట్టే - ఆలోచన-అంతకంతకీ పెరిగిపోయింది నాన్నా నాకు. ఇంక, మరి, తట్టుకోలేకపోయాను. దుఃఖం సముద్రం వెల్లువలా ముంచుకు వచ్చింది. చుట్టుకు పోయానంతే. ఇప్పటిదాకా బాధపడ్డాను.'

అంది, వెక్కుతూ, అమ్మాయమ్మ జాలిగా. కడుపు ఉబ్బేలాగు నవ్వేశారంతా. గ్రామ పెద్దసహా.

పెద్దవానకురిసి, వెలిసినట్లయింది.

ఎవరి యిళ్లకు వాళ్లు వెళ్ళి పోయారు. అమ్మాయమ్మకి యేదో, దిష్టితీసి, పారేసింది వాళ్ల అమ్మ. 'ఇంతకీ, లేచినరోజు మంచిదే' అనుకొంటూ. ★

---

## న్యూఢిల్లీ లేఖ

(6-వ పేజీ తరువాయి)

కమీషన్ దరఖాస్తులన్నిటినీ త్రోసిపుచ్చింది. కావలసిన అర్హతలు ఏ దరఖాస్తుదారుకూ లేవని అలాచేశార్ట. దీనిమీద వేరే వ్యాఖ్యానమేలా?

### బోలెడు డబ్బు వృధ

రైల్వేబోర్డులోని క్రింది తరగతి ఉద్యోగుల పిల్లలు ఈమధ్య ముస్సోరీ వెళ్లారు. అక్కడ వారు వారంరోజులు సరదాగా గడుపుతారట.

భారతీయ రైల్వేలు తమ ఉద్యోగుల సౌకర్యార్థం ఏర్పాటుచేస్తున్న కార్యక్రమాలలో ఈ బాలవినోదయాత్ర ఒక భాగం. వారం రోజుల సరదాకు ఒక్కొక్క బాలుడిదగ్గిరించీ రూ. 5 నుంచి రూ. 25 దాకా వసూలుచేస్తారు.

నాలుగవతరగతి ఉద్యోగుల పిల్లలు వారం రోజులకీ 5 రూపాయల చొప్పున చెల్లిస్తారు. మూడోతరగతి ఉద్యోగులపిల్లలు, అంటే నెలకు రూ. 350 వెబడి సంపాదించే ఉద్యోగుల పిల్లలు వారంరోజులకూ రూ. 25 చొప్పున చెల్లిస్తారు మిగతా డబ్బు రైల్వే బోర్డుఉద్యోగులసహాయనిధినుంచి భరిస్తారు.

ఉద్దేశం మంచిదే. కాని దేశానికి మంచిదా అని సందేహం. ఈపిల్లలు ముస్సోరీ వెళ్ళి ఏమి అనుభవిస్తారు, ఏమి ఆనందిస్తారు? ఒకవంక రెండో ప్రణాళికకు పైసలు పెగలటంలేదు. "ఖర్చును అదుపుచేసి పొదుపు చెయ్యండోయ్" అని ప్రధానమంత్రి దేశానికి సందేశం ఇస్తున్నారు. మరి ఈ ముస్సోరి యాత్ర ఏవిధమైన పొదుపో తెలియటం లేదు. దీనికిబదులు నాలుగోతరగతి ఉద్యోగుల పిల్లలకు మధ్యాహ్నంపూట కాసినిపాలు ఉచితంగా సప్లయిచేస్తే వాళ్ళవంటికీ మంచిది; దేశం వంటికీ మంచిది. అవసరమైనవి చెయ్యరు. పోనీ ఊరుకుంటారా -ఉహూ; అనవసరమైనవి చేస్తారు. ఇది రైల్వేశాఖవారి లక్షణం. రైల్వేపనివారికి సౌకర్యాలు చేయటం మంచిదే, ఎవరూ కాదనరు. కాని రైల్వేపనివారు సౌకర్యాలు అనుభవిస్తున్నందుకు కృతజ్ఞతగా భారత మాతకు కూడా కాస్త సేవ చెయ్యాలిగా! అదిలేదు. సౌకర్యాలన్నీ రైల్వేపనివారికి, అసౌకర్యాలన్నీ ప్రజలకి. ★

---

ఆఫీసరుగారి ఇంట్లో పార్టీ జరుగుతోంది. ఒక అతిథి ఆ ఆఫీసరుగారి భార్యను ప్రశ్నించి "ఇంతకు ముందు ఇక్కడ డ్రింక్స్ అందిస్తున్న అమ్మాయి ఎక్కడ వుందండి?"

"మీకు డ్రింకు కావాలా? ఇప్పుడే తెప్పిస్తాను."

"అబ్బే! అవసరం లేదు. నేను మాఇంటాయనను వెతుకుతున్నాను."

—బోసుబాబు

# ★ శ్రీవారితో సినిమాకు ★

(30-వ పేజీ తరువాయి)

"మీది మరీ సోద్యమండి. పూలుకొంటం ఎంతసేపు?"

ఏమనుకున్నారో ఏమో ఆగారు. తెల్లని మల్లెలమీదకు మనసు పోతున్నదిగాని అవి దండ గట్టిలేవు. కనకాంబరాలకూ, నాకు మధ్య చాలాదూరం ఉంది. అంబరానికీ, నాకూ ఉన్నంత.

రెండు ఎఱ్ఱగులాబీలు తీసుకున్నాను. ఖరీదు పావలా చెప్పాడు.

ఎవరయినా తను చేస్తున్నపని కనిపెట్టు న్నారేమోనని భయపడే జేబుదొంగలాగా వారు రోడ్డుమీద అల్లంతదూరాన నిల్చుని దిక్కులు చూస్తున్నారు- ఎదురు కళ్లతో ఎందుకు వారికంత భయం? పూలుకొనుక్కో వటం తప్పుపనవుతుందా?

"ఏమండోయ్! మిమ్మల్నే" కొంచెం పెద్దగా కేక వేశాను. బజారు గోలలో విన్పిం చాలిగా మరి—

మొహం చిట్లించుకుని-"ఎందుకంత గావు కేక వేస్తావ్? రోడుమీద-" అంటూ రెండడుగులు ముందుకు వేశారు.

"నేను గావు కేక లేశానా? కొంచెం పెద్దగా పిల్చాను గాని... లేకపోతే యీ రణ గొణ ధ్వనిలో మీకు విన్పించేదెలా?"

"సరె! ఇహ చాలించు - రోడ్డుమీద మన పోట్లాటవింటే ఎవరయినా నవ్వు తారు."

"పోట్లాట ఏముంది ఇందులో. ఒక పావలా ఈయండి."

"పావలా? పావలా లేదే! అర్ధరూపాయి ఉంది" అంటూ జేబులోంచి అర్ధరూపాయి తీసిఇచ్చారు నాకు.

"నాదగ్గఱ చిల్లర లేదండి" అన్నాడు పూలమ్మే మనిషి.

"అదేమిటి? అర్ధరూపాయి చిల్లర లేకుండా నువ్వు అమ్మేదేమిటా మరి?"అని ప్రశ్నిస్తే-

"ఇప్పుడే ఒకాయన రెండురూపాయల కాగితం తెచ్చి పావలాపూలు కొనుక్కె ళ్ళాడు...అందుకని చిల్లర లేకపోయిం దండి" అన్నాడు

"మరయితే ఏం చేయమంటావ్?"

"నేనేం చేసేది?"

ఏం చేద్దామంటారు?- అన్నట్లు వారి వంక చూశాను.

"మనకు రావాల్సింది పావలాఏగా పోనిద్దూ."

"ఇది మరీ బాగుంది. పావలాపూలకు పావలా దానమా?"

"అలా అనుకునేదానివి ఆ పావలావి కూడా తీసుకో."

"ఇంకే మక్కర్లా? పూలకే అర్ధరూపాయి పెట్టే..."

పావలా పోతేపోయింది- అంటూ ఆయన ఒకపక్క చిరాకుపడతారు. చూస్తూ, చూస్తూ పావలా వదులుకో బుద్ధికావటం లేదు; అర్ధరూపాయి పెట్టి పూలుకొన మనసొప్ప టమూ లేదు.

వారికేమో ముళ్ళమీద నిల్చున్నట్లున్నది నేపూలబేరం చేస్తుంటే.

"పోనీ పావలా రేపు తీసుకోవచ్చును లెద్దూ" అన్నారు వారు- ఇహ అక్కడ నిల్చోవటం ఇష్టంలేక.

"మీరు రేపు గురుపెట్టుకుని పావలా తీసుకురావటం కూడానా; ఒకవేళ మీకు గురున్నా- యీ మనిషి రేపు మీకు కన్పి స్తాడని నమ్మకమేమిటి?" అని వారితో అని "చిల్లర లేదంటుంటివి. నీపూలు నీవు తీసుకో-" అన్నాను పూలమనిషితో. అంత కన్నా చేయగలిగేది నాకు మరేమీ కన్పించ లేదు.

"చిల్లరలేదని పూలు కొనుక్కోక పోవటం ఎందుకులెండి అమ్మగారూ! తీసి కెళ్ళండి. డబ్బులు రేపిదురుగాని లెండి".

ఆ ఆలోచన నాకు తట్టలేదు సరికదా వారికయినా స్ఫురించలేదు. నోరు వాదనకు దిగేసరికి మనకు వల్లమందుమింగి కూర్చు న్నది.

పూలుతీసుకుని రెండడుగులు ముందుకు వేశాక-

"పూలవాడికున్న సంస్కారం నీకు లేక పోయె?-" అన్నారు వారు.

"అంటే!"

"వాడిదగ్గఱ పావలాడబ్బు లుంచటానికి నువ్వు వాడ్ని నమ్మలేక పోయినావు కాని వాడుమాత్రం ముక్కూ-మొహం ఎఱుగని నిన్ను నమ్మాడు."

"నమ్మదగనివాడు కాబట్టి మనం వాడ్ని నమ్మలేదు."

"నిన్ను వాడు "ఎందుకు నమ్మాలి?"

వారిప్రశ్నకు నేను సమాధానం చెప్ప లేక "అయితే వాడిపూలు వాడికిచ్చేద్దాం పదండి-" అన్నాను.

"ఇప్పుడు పోయి ఇయ్యమని కాదు నే చెప్పేది. అసలువిషయం చెప్తున్నాను. పూలు పెట్టుకో."

జాగ్రత్తగా, పువ్వునలగకుండా చూసు కుంటూ ఎడమజడలో ఒకటీ, కుడిజడలో ఒకటీ పెట్టుకున్నాను. ఆయన ఇంకో గులాబీ అందించాడు నన్నగా నవ్వుతూ.

"ఇది ఎక్కడది?"

"జడనుంచి పడుతుంటే పట్టుకున్నాను"

ఎంత ప్రయత్నించినా పువ్వు జారి పోకుండా పెట్టుకోవటం కుదరటం లేదు. అదో పెద్దసమస్యై కూర్చుంది. కళ్ళవెంబడి నీళ్ళు గిరగిరా తిరిగినయ్.

"మీరు పెట్టరూ. నాకు చేతకావటం లేదు" బతిమిలాడుకున్నాను. అభిమానానికి పోతే లాభం లేదనుకొని.

వారు శతవిధాల పైకి రానీయకుండా మింగుతున్న నవ్వు దానంతటదే దిగజారి పోయింది మరుక్షణంలో. మొహం విచిత్ర మయింది దిక్కులు చూడసాగారు.

# ★ శ్రీవారితో సినిమాకు ★

వీరికంత భయమేమా అనిపించింది. మగవాడి బలహీనత అంటే ఇదే కాబోలు!

"ఫర్వాలేదులెండి. మనసెవరు చూశ వచ్చారు? ఎవరిగోడవ వారిది!"

"పుణ్యానికిపోతే పాపమెదురయిందిట. క్రిందపడుతున్నదికదా అని పట్టుకున్నందుకు ఇదా శిక్ష!"

వెనక్కి తిరిగి కదలకుండా నిల్చున్నాను. ఆయన పువ్వు జడలో సర్దుతున్నారు.

ఈ దృశ్యం ఏ సినిమాలోనూ చూడటం గాని ఏ పుస్తకంలో నయినా చదవటం గాని తటస్థించలేదో ఏమో... సైకిల్ మీద పోతున్న కాలేజీ విద్యార్థి ఒకడు రెండు కళ్ళూ ఇటు పారేసి (ఇదేదో వింత సంఘటన అన్నట్లు, 'మంచితరుణం మించిపోవు నన్న భావంతో) సైకిల్ ముందుకు తొక్కుతూ-డ్యూటీ పూర్తి చేసుకుని రోగాలడొబ్బి, మందుల కంపునుంచి బయటపడి 'బ్రాసియర్స్' సరిగా ఉన్నాయో లేదో, గౌను మీద మందుమరక లేమీ అవలేదుగదా - అని చూసుకుంటూ తల వంచుకు నడుస్తూన్న నర్సును ఢీకొన్నాడు.

మల్లెపువ్వులా ఉన్న నర్సు గౌనును సైకిల్ ముందుచక్రం మట్టిచేసింది. ఆమెకెక్కడలేని ఆగ్రహమూ వచ్చింది—దెబ్బలేమీ తగిలినట్లు లేవుగాని, గౌను మట్టి అయిందనే ఆమె బాధ! మొగుడు కొట్టినందుకు కాదుగాని తోడికోడలు నవ్వినందుకన్నట్లు—ఆమె మొహం కోపంతో కందిపోయింది. క్రిందపడ్డ కాలేజివిద్యార్థి లేచి "ఐయామ్‌సారీ!" అంటూంటే ఏమంటానికి తోచని ఆమె పెదవులు కంపించినయ్—పెనుగాలికి అల్లలాడే తలిరుటాకుల్లాగ.

ఇదంతా చూస్తున్న నాకు చెడ్డనవ్వు వచ్చింది. ఆపుకోలేక నవ్వేశాను. ఆ నవ్వటంలో కదిలాను కాబోలు జడలో మా వారు అవస్థపడుతూ సర్దుతూన్న పువ్వు కాస్తా క్రింద పడిపోయింది.

వెనక్కి తిరిగి చూద్దునుకదా దారిన పోతున్న ఒక ఇల్లాలు భర్తనాపి వేలుపెట్టి మరీ మమ్మల్ని చూపిస్తున్నది.

సిగ్గుతో చచ్చిపోయాను నేను. ఆయన అలిసిపోయారు.

దీర్ఘంగా నిట్టూర్చి క్రిందపడ్డ పువ్వును తీయటానికి వంగారు. వారి అవస్థమాట అలా ఉంచి "క్రిందపడ్డ పువ్వును తల్లో పెట్టుకుంటే ఈమె"—అని నలుగురూ ఆక్షేపిస్తారేమో నన్న శంకతో "క్రిందపడ్డ పువ్వు ఎందుకు లెద్దురూ?" అన్నాను. చేతిలోకి తీసుకున్న పువ్వును వారు జారవిడిచారు.

"ఐపిటీయు మిషర్ భాస్కరం!" అని వెనకనుంచి ఎవరిదో స్త్రీ కంఠం విన్పించింది. ఇద్దరమూ ఒక్కసారి అటు చూశాము సంధ్య! మా వారి క్లాసుమేటు. పెళ్ళిమీద నమ్మకం లేనిపిల. (మా వారి మాటల్లో చెప్పాలంటే పెళ్ళి అవసరం లేనిపిల్ల.) టెలిఫోన్ ఎక్ఛేంజిలో పని చేస్తున్నది.

"చేయిజారి క్రిందపడ్డ పువ్వును అలా వదిలివేయటమా! వాట్ ఎ హారిబుల్ థింగ్? దానిసౌందర్యం, సౌరభం అలా నేలపాలు కావాల్సిందేనా? దారినపోయే నలుగురి కాళ్ళక్రిందపడి నలిగి పోవాల్సిందేగా అది? ఏమండీ! రాధారాణిగారూ! చదువుకున్న వారు, సంస్కారులు—ఇదా చేసేది?"

"దుమ్మయిందికదా—తలలో ఎలా పెట్టుకుంటాం? ఆరోగ్యకరం కాదు."

"దుమ్ము లేముందండి? దులిపితే పోయె. ఇంతకీ మీ కిష్టం లేదు. ఇమమున్న భాస్కరం బలహీనుడు."

"అంత సానుభూతిఉంటే మీరు తీసుకోండి." కొంచెం కఠినంగానే అన్నాను.

> ప్రయాణిస్తున్న ఒక విమానంనుండి ఒకవ్యక్తి పారాచూటుతో క్రిందకు దిగబోతూ అందులో వున్న ఒక్క ప్రయాణికుణ్ణి ప్రశ్నించాడు!" మీరు కూడా నాతోపాటు పారాచూటులో దిగుతారా?
>
> "నేను ఛస్తేదిగను. ఇంతకూ మీరెవరు? "ప్రశ్నించాడు ప్రయాణికుడు.
>
> "నేను ఈ విమానం పైలట్ ను" జవాబిచ్చాడు ఆ వ్యక్తి.

ఆమాటలకు ఆమె మొహం మాడిపోయింది.

"నేనసలు పూలు పెట్టుకోను—మీకు తెలియదేమో."

"పూలు పెట్టుకోవటం ఫాషను కాదు కాబోలు—నాకు తెలియదులెండి."

"తలలో పెట్టుకున్నంత మాత్రాన పువ్వును పూజిస్తున్నట్లా? నేను మనసుతో ఆరాధిస్తాను." అంటూ ఆమె ఆ క్రిందపడ్డ పువ్వుం తీసుకుని—

"వస్తాను. వేరే ఎంగేజిమెంటుంది" అంటూ వెళ్ళిపోయింది.

ఒక జడలో పువ్వు పెట్టుకుని, రెండో జడలో పెట్టుకోకపోవటం బాగుండదని ఉన్నదికూడా తీసి పారేశాను. వారేమీ మాట్లాడలేదు.

నాలుగడుగులు ముందుకేసి వెనక్కి తిరిగి చూద్దునుగదా సంధ్య గులాబీ పువ్వును ఉండచుట్టి సైడ్ కాలవలో పారేసింది. చెప్పేవి శ్రీరంగనీతులు...అన్న పద్ధతిలో ఉంది.

సినిమాహాలుకు చేరుకునేసరికి ఆరున్నరయింది. హాల్లో లైట్లార్పేసి ఉన్నయ్. ట్రయిలర్లు వేస్తున్నట్లున్నారు. వారు టిక్కెట్లు కొనటానికి బుకింగ్ ఆఫీసు దగ్గఱకు పోయారు.

"ఏయ్! ఆపు...ఇక్కడే ఆపు!" అని పెద్దగా కేకలు విన్పించినయ్. ఏమిటా అని చూసే రెండు సైకిల్ రిక్షాల్లోనుంచి బిలబిలా నలుగురు పిల్లలు—ఇద్దరు మొగపిల్లలు, ఇద్దరు ఆడపిల్లలు—తత్తరపడుతూ నలభై ఏళ్ళ ఇల్లాలొకామె, తాపీగా కోటూ, బెల్టూ సర్దుకుంటూ బట్టతలాయన—ఒక్కసారి దిగారు.

—[మిగతా పైవారం]

ఆంధ్ర ప్రజలను ముగ్ధులను చేయుచున్న ఉత్తమ పౌరాణిక చిత్రం

విశాలాంధ్ర యందంతట విజయ
వంతముగా ప్రదర్శింపబడుచున్నది



శ్రీ రాజరాజేశ్వరీ ఫిలింకంపెనీ వారి

శ్రీ కృష్ణమాయ
(నారద సంసారం)



దర్శకుడు-సి.యస్.రావు




KRISHNA

# సినిమా

ఉన్న సమస్యలుచాలక కొత్తది మళ్ళీ ఒకటి ఉత్పన్నమై, ఫిలింపరిశ్రమపై దెబ్బ తీసేలా ఉందని దక్షిణభారత ఫిలిం పరిశ్రమ అధ్యక్షుడు శ్రీ టి. ఆర్. సుందరం గత వారం మండలి వార్షికసభలో హెచ్చరిక చేశారు.

అది అక్టోబరునుండి డిసెంబరువరకూ ఫిలిం దిగుమతి పూర్తిగా రద్దు కాగలదన్న వార్త.

కొన్నాళ్ళక్రితం ఇది పుకారుగా కనిపించింది. ఇపుడు, విదేశీద్రవ్య ఇబ్బందిని బట్టి, ప్రభుత్వం పై 'క్వార్టర్'లో దిగుమతులన్నిటినీ దాదాపు పూర్తిగా నిలిపి వేస్తుందని గట్టిగా తెలియవచ్చింది. అనుమతించేకొద్ది ముఖ్యావసర వస్తువులలోనూ, ఈ పరిశ్రమ మనుగడకు అతి ముఖ్యమైన ఫిలిం ఉంటుందని అంతా ఆశించారు. ఆమాటకొస్తే, ఉన్న 40% కోతకూడా రద్దు అయిపోతుందన్నారు. అక్టోబర్ దగ్గిరపడుతున్నకొద్దీ అటువంటిసదుపాయాలు ఉండవని మెల్లిగా తెలియవస్తోంది.

అందువల్ల వర్తమాన అర్థసంవత్సరానికి అనుమతించిన దిగుమతి కోటాలనే, తొమ్మిది నెలలకూ సర్దుకు వాడుకోవాల్సిన పరిస్థితి ఏర్పడిందని శ్రీ సుందరం అన్నారు.

ఈ దేశంలో ఫిలింపరిశ్రమ పుట్టి పెరిగిన ఈ పాతికేళ్ళలోను, యుద్ధాలూ, కరువు కాటకాలూ ఎన్నో వచ్చాయిగాని, పరిశ్రమ ఇటువంటు గడ్డురోజులను ఎరగదని సుందరం అన్నారు.

ఒకపక్క పన్నులు, మరోపక్క స్టార్లు దొరక్కపోవడం, విద్యుచ్ఛక్తి పొదుపు, ముడిఫిలిం కోత, థియేటర్లు చాలకపోవడం వగైరాలెన్నో ఉన్నాయని ఆయనఅన్నారు. ఫిలిం కట్ వల్ల విడుదలకావలసిన చిత్రాలెన్నో వాయిదాపడుతున్నాయని, ఖర్చుపెట్టి కూడిన నిర్ణీత కార్యక్రమాలు ఎన్నో తారుమారైపోతున్నాయని వెల్లడించారు.

ప్రభుత్వంలో పెద్దలు, ఈ సమస్యను అర్థంచేసుకుని సానుభూతి వెలిబుచ్చినా, ఫలితం కనబడటంలేదనీ, వారికి గట్టిగా నచ్చచెప్పి, ఫిలింఫాక్టరీ ఉత్పత్తి ఆరంభం అయేవరకూ దిగుమతి కొరత లేకుండా చేసుకోవాలంటే, ఫిలింపరిశ్రమకు చెందిన యావన్మంది సంఘటితంగా కృషి చేయాలనీ శ్రీ సుందరం విజ్ఞప్తిచేశారు.

## ఫిలిం చేంబర్ కార్యవర్గం

దక్షిణ భారత ఫిలిం వాణిజ్యమండలి సర్వసభ్య వార్షికసభ గత వారం జరిగింది. కొత్త సంవత్సరానికి శ్రీ టి. ఆర్. సుందరం తిరిగి అధ్యక్షులుగా ఎన్నిక అయ్యారు. కార్యనిర్వాహక పదవులకు కూడా క్రిందటి ఏడు పనిచేసినవారే ఉపాధ్యక్షులుగా

(56 వ పేజీ చూడండి)

అందాలదీవి అంజలీదేవి

—ఫొటో: సోమయాజులు.



# 'కాగజ్ కే ఫూల్'

ప్రముఖ దర్శక నిర్మాత నటుడు, గురుదత్ ప్రతిన కొత్త చిత్రం "కాగజ్ కే ఫూల్" నిర్మాణం సందర్భంగా గత వారం మద్రాసు వచ్చారు. నిర్మాణం, ఆసియా మొత్తానికి పెద్దదీ గొప్పదీ అయిన వాహినీ స్టుడియోలో జరగబోతున్నట్లు మీకు తెలుసు. గురుదత్ ఈ చిత్రాన్ని సినిమాస్కోప్‌లో (8R ఎం. ఎం.లో కూడా) తీస్తున్నటూ తెలుసు. భారతీయులు స్వతంత్రంగా తీస్తున్న తొలి సినిమాస్కోప్ చిత్రం ఇదే. రెండేళ్ల క్రితం ఫిలింస్థాన్ వారు 'శ్రీ హాడ్‌కోబ్రా' అను 'బాంబే ఫయిట్ 777' అను చిత్రాన్ని టెక్నికలర్ సినిమాస్కోప్ చిత్రంగా తీశారు. అందులో అమెరికన్ టెక్నిషియన్‌లు, ఒకరిద్దరు బ్రిటిష్ నటులూ ఉన్నారు. ఇపుడు గురుదత్ తీసేది తెలుపు, నలుపులోనే.

ఈ చిత్రానికి ఔట్‌డోర్ దృశ్యాలను రెండేళ్ల క్రితం సిమ్లాలో తీశారు. ఇప్పుడు ఇన్‌డోర్ దృశ్యాలు తియ్యడానికై సినిమాస్కోప్‌లో నిర్మాణానికి కావలసిన వసతి, వైశాల్యం, అధునాతన పరికరాలూ సమృద్ధిగా ఉన్న వాహినీ స్టుడియోకు వచ్చారు. కొన్ని సన్నివేశాలను మటుకు ఈమధ్య బొంబాయిలోని సెంట్రల్ స్టుడియోలోను (మూడుఫ్లోర్లు ఉన్నాయి), మహబూబ్ స్టూడియోలోను (రెండు) తీశారు.


గురుదత్ ఫిలింస్ వారు మద్రాసు వాహినీ స్టుడియోలో తీస్తున్న సినిమాస్కోప్ హిందీ చిత్రం 'కాగజ్ కే ఫూల్'లో గురుదత్, వహీదా.


'కాగజ్ కే ఫూల్' హిందీ చిత్రంలో వహీదా రెహమాన్.

గతవారం విజయాస్టుడియో ఆవరణలో అజంతా పిక్చర్స్ అనే 'కథలో కంపెనీ'కి ఆవరణ ఏర్పరచి అందులో 28 అడుగుల ఎత్తు విగ్రహం నెలకొల్పారు. కథలో డైరెక్టరు చెప్పరాని వ్యథతో సతమతమవుతూ ఉంటాడు. గేటు దగ్గర వహీదారెహమాన్ కూడా సన్యాసిని వసనాలు ధరించి దిగులుగా నిలబడి ఉంటుంది. వారిద్దరి హృదయాలలోని చింతన్నా సంక్షోభాన్ని తెలియచెప్పడానికే గురుదత్ అపురూపమైన (మనదేశంలో) చింతామణివంటి సినిమాస్కోప్ లెన్స్‌ను సంపాదించి, మాయాలు వెండితెర వైశాల్యాన్ని పెంచుతున్నాడు. ఈ తెర మీద ఆవిష్కరించబోయే కథకూడా తెర వెలుగులకే. ఒకఫిలిం డైరెక్టరు, ఒక మూడవ తర్గ చిన్నదానిలోని అజ్ఞాతప్రజ్ఞను కనిపెట్టి ఆమెను ప్రోత్సహించి, పైకితెచ్చి, వెండితెర వేల్పును చేస్తాడు. ఆతరవు, అతనియింట్లో అతనికీ, పత్నికీమధ్య అపార్థాలవల్ల కలహాలు, కలతలూ కలుగుతాయి...

ఇందులో, పైకివచ్చిన తారగా వహీదా రెహమాన్ ఆమె నక్కడకు తెచ్చిన దర్శకుడుగా గురుదత్, ఇది నచ్చక బాధపడ్డసతిగా శశికళ నటిస్తున్నారు.

సచిన్ దేవబర్మన్ సంగీత దర్శకత్వం వహిస్తున్నారు. ★

[—ఫొటోలు: అంబూరావు

రానురాను ఓ మోస్తరుగానూ హెచ్చరి
స్తూనే ఉంటాడు. ఆ పాట వినగా వినగా,
నారదుడు అలా వరసన పిల్లల్ని కనేబదులు,
ఆ ముక్కుమూరం ఏదో—దాన్ని కూడా ఓసారి
కనేసే బావుణ్ణని మనకు అనిపించినా, నార
దుడు వినిపించుకోడు. ఖాతిరు చెయ్యడు.
అతన్ని అన్ని కష్టాలు పెట్టి, చివరకి నిప్పు
లాటి అప్పులో అతన్నీ దాదాపుగాను, అప్పు
లాంటి నిప్పులో భార్యా బిడ్డల్ని
పూర్తిగాను దగ్ధంచేసినా, పెద్ద స్టూడియో
చెరువుని నాగేశ్వరరావు నడ్డిమీద పడేసే
వరకూ శ్రీహరి నారదుడి సంస్కరించలేక
పోతాడు. హార్దికమైన క్షోభవల్ల కాక, దైహి
కంగా నిస్సహాయస్థితికింద పడ్డప్పుడే నార
దుడు పశ్చాత్తప్తుడై "నీవే తప్ప" అంటాడు.
అప్పుడు మీరు అనుకున్నట్లే, జగన్నాటక
సూత్రధారి, నారదుడిని తిరిగి చెరువులో
ముంచి తీసి, మళ్లీ ఆ 'జ్ఞాన జ్యోతిని'
అతనికి ఇచ్చేసి, మాయని మాయచేసి మహ
తిగా మార్చి ఒప్పచెబుతాడు. కష్టాలు అనుభ
వించిన నారదుడి హృదయం సానబెట్టిన
రత్నంలా ప్రకాశిస్తుంది. అతనిలో అహం
కారం అభావం అయిపోతుంది. సానబెట్టిన
రత్నంలా నాగేశ్వరరావు ప్రదర్శించిన
నటన ఫలితంగా నారదుడి ఈ పరివర్తనగాథ
ప్రేక్షకులకు హృదయగతం అవుతుంది. తిర
స్కార భావంతో, హేళనగా, కాఠిన్యంతో
నారదుని చూసిన ప్రేక్షకులలో క్రమంగా
నవ్వులన్నీ సర్దుకున్న వేళకు రసరాజము, రస
వాహినుల సాగరముఅయిన కరుణ కలుగు
తుంది... ఇది సాధించిన నటుడు, రచయిత,
ఇందుకు అపమార్గాలకు, అపశ్రుతులకు
అస్కారంలేని మార్గం ఏర్పరచి, తగిన
దోహదాలుచేసి, సమగ్రమైన రూపకల్పన
చేసిన దర్శకుడూ కూడా అభినందనీయులు.

నారదుడి పాత్ర రూపకల్పన దాదాపు
నిర్దుష్టం అనతగినంత చక్కగా అమరింది.
అతడు పతనుడైన ఘట్టాన్ని, పశ్చాత్తప్తుడై
సంస్కృతుడైన ఘట్టాన్ని, మిగతా భాగాల
లాగే స్వచ్ఛమైన కొత్తిమారంలో దర్శించి,
ప్రత్యేక శ్రద్ధతీసుకొని చిత్రించి ఉంటే,
సృజనాత్మకమైన ప్రజ్ఞ చూపి ఉంటే, ఈ
చిత్రం సంపూర్ణమైన తృప్తిని కలిగించేది...

ఇది మినహాయిస్తే మిగతా కథ హాయిగా,
సూటిగా, సరదాగా సాగిపోయింది. హాస్య
రస ప్రధాన సన్నివేశాలు కల్పించడంలో,
ఉన్నవాటికి అధునాతన విధానాలలో మెరు
గులు దిద్దడంలో దర్శకుడు సి. ఎస్. రావు
అభినివేశం, మాటలలో — మాటమాటకూ
యతి శితసమాసాలు కరిపించి, వాటిని మాటి
మాటికీ ప్రేక్షకులమీద కురిపించినా —
సున్నితమైనహాస్యం, కారం, సారం
సంస్కారంగల చమత్కారం నింపి, రస
భంగం కలుగకుండా వ్రాసిన రావూరివారి
ఉపజ్ఞ, కలసి ఈ చిత్రాన్ని ఆహ్లాదకరంగా

(56-వ పేజీ చూడండి)



## ★ చి॥ రాజా, సౌ॥ జిక్కి ★

జూన్ 26 వ తేదీ ఉదయం ప్రసిద్ధ చలన
చిత్ర గాయకు లిద్దరు వివాహం
చేసుకున్నారు. వధువు మధురగాయని
సౌ॥ కృష్ణవేణి (జిక్కి). వరుడు గాయకుడు
సంగీత దర్శకుడు శ్రీ ఎ. ఎం. రాజా. వివా
హం నాదస్వర మేళతాళాలతో నిండుగా,
చాందినీలుకట్టి అలంకరించిన పెద్ద పందిట్లో
కిటకిటలాడిపోయిన చుట్టపక్కాలతో సంద
డిగా జరిగింది. సంగీత దర్శకులు, గాయకులు
ఘంటసాల వెంకటేశ్వరరావు, పెండ్యాల
నాగేశ్వరరావు, మహదేవన్, మాధవపెద్ది
సత్యం, పి. బి. శ్రీనివాస్, సుశీల, రాణీ,
జానకీరాణీ, రచయిత ఆరుద్ర, దర్శకనిర్మా
తలు పి. పుల్లయ్య, ఎస్. ఎం. శ్రీరాములు
నాయుడు, డి. బి. నారాయణ, టి. వి.
శాస్త్రి, నటులు శివాజీగణేశన్, ఎం. జి.
రామచంద్రన్, తంగవేలు, వీరప్ప మొదలగు
వారు తరలివచ్చి వధూవరులను ఆశీర్వ
దించి, కానుకలు చదివించారు. సాయం
కాలం ఇ. వి. సరోజ నృత్యప్రదర్శనం
జరిగింది.

రాత్రి 8-30 కు సుప్రసిద్ధ వైణికుడు
శ్రీ ఈమని శంకరశాస్త్రిగారి అమని
గానసుధ వెల్లివిరియడంతో (అప్పటికిసందడి
తగ్గినా) పెళ్లిపందిరశోభ ఇనుమడించింది.
వీణావాణిలో రేవికి, లాలిత్యానికి శంకర
శాస్త్రిగారి పాణి పెట్టింది పేరు.'
శాస్త్రిగారు మూడు కృతులు,
రెండు లలితగీతాలు వినిపించారు. "సామజ
వరగమనుడి"ని స్తుతించి, ప్రసన్నుణ్ణి చేసు
కొన్న కీర్తనను ఆయన వీణ పాడినపుడు
(నేను నిమిత్తమాత్రుడిని అన్నట్టు నిర్వికార
వదనుడై కూర్చుంటారాయన) చిరునామాదా
యదు శ్రీపతి విన్నాడో విని ఏమన్నాడో
తెలియదుగాని, శ్రోతలు మధుర
స్వరవశులై, స్వరరసఝరులతో కలసి
సాగి పరవశులైపోయారు; గేయంలో
భావంపై ఆయన వ్యాఖ్య చేసి, విపులీక
రించి అందులో చిత్రాన్ని వరస్వరసరాలతో
అలంకరించగా దర్శించి ముగ్ధులయ్యారు.

'సీతాపతి'కి త్యాగరాజస్వామి నివే
దించుకొన్న హృదయఘోషను మనకు విని
పించిన శాస్త్రిగారి వీణ, కొన్ని క్షణాల
పాటు విశ్వ—'ఘోషవతి' గా భాసిం
చింది. కొద్ది నిముషాలక్రితమే, ఈశ్వరార్పు

పసి పువ్వులు కోస్తున్నట్టు సొగసుగా సున్నితంగా తంత్రులపైనుండి లలిత స్వరాలను పుణికి వెదజల్లి వసంత వనశోభను చిత్రించిన వ్రేళ్లు, తుణాలమీద, బాధను నివేదించడానికి కల్లోలిని ఘోషను ఉపశ్రుతిగా సృష్టించాయి.

స్వరకల్పనలో శాస్త్రిగారి మధుమధుర విన్యాసాలు పండిత పామరజన రంజకాలు. ఒకానొక సందర్భంలో అవి, త్యాగరాజు స్వామితో ఆడిన సరాగాలకూ, వాళ్లిద్దరికీ పరస్పరం ఉన్న అనురాగాలకూ రూపకల్పనలు అనిపించాయి... ★



# హాలీవుడ్

**1957**లో హాలీవుడ్ మొత్తం 108 చిత్రాలను టెక్నికలర్ వగైరా రంగులలో తీసింది. ఏ ఫిలింకేంద్రమూ ఒక్క ఏడాదిలో ఇన్ని రంగు చిత్రాలు నిర్మించలేదు. హాలీవుడ్ లో కూడా ఇది కొత్త రికార్డే. 1956లో తీసిన వాటికన్న ఇది 10% ఎక్కువని హాలీవుడ్ ప్రొడక్షన్ కోడ్ సేకరించిన అంకెలు రంకెలు వేస్తున్నాయి. ఎంత వేసినా, తెలుపు నలుపు చిత్రాలనే నమ్మి గౌరవించేవారు ఇంకా చాలామంది ఉన్నట్టు కూడా అవి అంగీకరించాయి. పర్వతాలూ, అరణ్యాలూ వగైరాలు గల విశాల ప్రకృతి దృశ్యాలు, బ్రహ్మాండమైన సెట్లూ ఉండే కథా చిత్రాలలోనూ, కంటికింపైన వస్తువులను ఇంపుగా చూపడం, అవసరమైన సంగీత, నృత్య ప్రధాన చిత్రాలలోనూ తప్పనిసరిగా రంగు ఉపయోగిస్తున్నారు. కథా వస్తువుకూ, తత్వానికీ, న్యాయం చెయ్యడానికి రంగులు తగవనిపించినా,—లేదా రంగు హంగులవల్ల రసభంగం అవుతుందనిపించినా, తెలుపు నలుపులో తీస్తున్నారు.

'సినిమిరకిల్' అనే కొత్త ఉపాయంతో తీసిన 'విండ్ జామర్' చిత్రం న్యూయార్కులో విడుదల అయింది. బ్రహ్మాండమైన దృశ్యాలను బ్రహ్మాండంగా చూపగలగడం దీని లక్ష్యం. ఈ లక్ష్య సాధనలో ఇంతటి అద్భుతమైన స్థాయిని ఇంతవరకు అందుకోలేదని న్యూయార్కులో విమర్శకులంతా మెచ్చుకున్నారు. 'విండ్ జామర్,' ప్రకృతి సందర్శన చిత్రాలకోవలోనిది. ఇందులో ఒక నార్వీజియన్ శిక్షణ నౌకమీద సిని మిరకిల్ కెమెరా 17 వేల మైళ్ళు సముద్రయానం చేస్తుంది. అది చూసినవన్నీ మనము చూస్తాం. చూపించడానికి, సినేరమాలోలాగే దీనికీ 35 మిల్లిమీటర్ల ఫిలిం నెగటివులు మూడిటిని ఉపయోగిస్తారు. ఇందులో విశేషం: ఈ మూడు చిత్రాలూ, యజమాని అభిప్రాయాలకు తాళం వేసే భటుడి భావాలలా ఒకటితో మరొకటి చక్కగా కలసిపోవడానికై ఆయా ప్రొజెక్టర్ల 'లెన్స్'లను విద్యుదుపకరణాలద్వారా, అదుపుచేసి సర్దడం దిద్దడం జరుగుతుంది.

బెర్నార్డ్ షా నాటకం 'ది డెవిల్స్ డిసైపుల్' ఆధారంగా హెక్-హిల్-లంకాసర్ కంపెనీ ఒక చిత్రం తీయబోతోంది. ప్రసిద్ధ బ్రిటిష్ నటుడు, దర్శకుడు సర్ లారెన్స్ ఒలీవియర్, కంపెనీ భాగస్వామి, నటుడు బర్ట్ లంకాస్టర్ ఇందులో పాల్గొంటున్నారు. ముఖ్యపాత్రను కర్క్ (లస్ట్ ఫర్ లైఫ్) డగ్లస్ ధరిస్తాడు.

# పెరల్ బక్

(12-వ పేజీ తరువాయి)

పెట్టింది.

మర్నాడు ప్రొద్దుటే పెరల్ బక్ కాఫీ తాగే సమయంలో వంటమనిషి పరుగెత్తుకొచ్చి 'లూ'కు పుట్టిన పిల్లవాడు చావు బ్రతుకుల్లో వున్నాడన్నది. పెరల్ బక్ ఖంగారుపడుతూ 'లూ' గుడిసెకు పరుగెత్తింది. తీరాచూస్తే పిల్లవాడి పొట్టంతా కాలిపోయిన మచ్చలతో పుండయిపోయి వుంది. ఏమిటని విచారిస్తే పురిటిసామాగ్రితో పెరల్ బక్ పంపిన 'ఐడిన్‌ను' "మంచిమందే గదా ఎంత ఎక్కువేస్తే అంత త్వరగా పుండు మానిపోతుంది" అనుకుని పెరల్ బక్ పంపిన సీసామందూ బిడ్డ బొడ్డుమీద కుమ్మరించిందట 'లూ'.

దాంతో బిడ్డ బొడంతా బొబ్బలెక్కిపోయింది. చేతుల్లో నిలవకుండా అవస్థపడే బిడ్డను వెంటనే హాస్పిటలుకు తీసికెళ్ళితే బ్రతుకుతాడన్నది పెరల్ బక్. "ససేమిరా తెల్లవాళ్ళమందులు నాబిడ్డకు వెయ్యనివ్వను. నీవే నాబిడ్డను బ్రతికించమని మొండిపట్టు పట్టింది 'లూ'. చేసేదిలేక పెరల్ బక్ 'లూ' బిడ్డను తన యింటికి తీసికెళ్ళి మందులువేసి బ్రతికించింది.

## స్నానాల ముచ్చట

ఆ తర్వాత కొద్దిరోజులకే పారిపోయిన 'లూ' భర్త భార్యను వెదుక్కుంటూ వచ్చాడు పెరల్ బక్ యింటికి. ఎన్నో చీవాట్లువేసి, బుద్ధిగా మసులుకోమని, ఆ వూళ్ళోనే పని యిప్పించి 'లూ' కుటుంబాన్ని పంపించేసింది పెరల్ బక్ - మళ్ళీ సంవత్సరం తిరక్కుండానే 'లూ' భర్త పారిపోవడమే కాక 'లూ' బిడ్డ చావు బ్రతుకుల్లో వున్నాడని ఎవరో వచ్చి చెప్పారు. పెరల్ బక్ వెంటనే 'లూ' వుండేచోటుకు బిడ్డను చూట్టానికి వెళ్ళింది.

ఈ సారి బిడ్డ వీపంతా కాలిపోయి వుండయింది. ఏమిటని విచారిస్తే 'లూ' చెప్పడం మొదలెట్టింది.

"మా దేశంలో బిడ్డకి స్నానం చేయించే అలవాటు లేదు. వేడి వేడి ఇసకమీద బిడ్డను పడుకోబెడతాం-ఆ వేడికి బిడ్డ ఒళ్లంతా చెమటపడుతుంది. గుడ్డతో ఆ చెమటంతా తుడిచేస్తాం. అదే బిడ్డకుస్నానం అన్నమాట-యిక్కడ ఆ మాదిరి ఇసుక దొరకలేదు, అందుకని నిప్పులు అరబెట్టి వేడి వేడి బొగ్గులమీద పడుకోబెట్టాను-బాగా ఆరని నిప్పులు అక్కడక్కడ వుండి వీపంతా కాలిపోయింది." అన్నది.

అంతావిన్న పెరల్ బక్ 'లూ' చాదస్తానికి విచారపడుతూ, మళ్ళీ బిడ్డను తనింటికి తీసికెళ్లి వీపంతా మందుపట్టించి నయమయ్యిందాకా తల్లినీ, బిడ్డనూ తన యింట్లోనే వుంచుకుని బిడ్డకు ఒళ్లు బాగయిన తర్వాత యింటికి పంపిచేసింది.

ఆపదలోవున్న తనకు రెండుసార్లూ సహాయంచేసిన పెరల్ బక్ కు కృతజ్ఞత ఎలా చెప్పుకోవాలో అమాయకురాలైన 'లూ'కు తెలీకపోయినా, రెండుసార్లు తన బిడ్డను బ్రతికించిన దేవతగా 'లూ' హృదయంలో స్థానం ఆక్రమించుకుంది పెరల్ బక్.

అందుకే విప్లవ సమయంలో తెల్లవాళ్లనంతా కాల్చి చంపే విప్లవకారుల బారినుండి తెల్లజాతి స్త్రీ పెరల్ బక్ నూ, ఆమె కుటుంబాన్నీ 'లూ' తన గుడిసెలో దాచి కాపాడింది. అప్పటికే చైనాలో ఎక్కడ చూచినా అలజడి ఎక్కువైపోయింది. ఆ సంవత్సరమే పెరల్ బక్ చెల్లెలు భర్తా పిల్లలతో సహా 'నాన్‌కింగ్'లో వున్న పెరల్ బక్ యింట్లో తలదాచుకోడానికి వచ్చింది.

ఏరోజుకారోజు తెల్లవాళ్ళు చైనావిడిచి పెట్టి వెళ్ళిపోవాల్సొంటుందనే విషయం పేపర్లో చూసినా కూడా పెరల్ బక్ చైనా మీద మమతతో మొండికి పడివుండిపోయింది. ★

(మిగతాది వచ్చేవారం)

# దగాపడిన తమ్ముడు

(32-వ పేజీ తరువాయి)

కూడా లేదు. ఆ వేళ బాధున్నా తను కొరపట్టుకొని వెళ్లినట్టు "ఓడదించడానికి యెల్తాన్నా అని కానుకన్తే అలకే చెప్పమని చెప్పేవాడు కదా!" అని యిలా చెప్తుంటే యేం జరిగిందో వూహించుకొన్న పుల్లయ్య, ఇంట్లోకి వెళ్ళటానికి భయంవేసింది. ఆ మల్లుని అక్కడేదిరించి యెదురుగా నీలి అగపడుతున్నా వెనుకకు పరుగెత్తిపోవాలని వుబలాటపడుతున్నాడు. కానీ ఆమె ఒక చూపుతో తనను బిగించి ముందుకు లాగుతున్నట్లు అనిపించింది. అంతలోనే కొడుకుమీద అమిత కోపం చిరాకు వచ్చేసాయి. నీలి అలాసంకోచంతో నిల్చున్న మొగుడు వేపు నాలుగడుగులు వేసి వచ్చింది.

"ఇంట్లో చెప్పవారెవెళ్లిందీ.? అడు యేడ్చియేడ్చి వున్నాడు. వాడు బెంగగా వున్నాడే!"

ఈ మాటలు ఆమె నోటిలోనే వున్నాయి. రెండు వేపులనుంచీ యెవరో వస్తున్న పాదాలచప్పుడు. నీలి అటువేపు ఇంకా చూడనేలేదు. పుల్లయ్య ఆదరా బాదరాగా కాలువవేపు వెళ్లిపోతున్నాడు. వాళ్లూ అటువేపే...ఇంతలో అక్కడ వీటరి దీపాలు వెలగనారంభించాయి ఇటూ అటూ టార్చిలైట్లతో పోలీసులు. నీలి కిదంతా అయోమయం అనిపించింది. అంతా ఒక భయంకరమైన కలలాతోచింది. ఆమె కాళ్ళు గజగజ వణక నారంభించాయి. ఇంతలో కేకలు. "పట్టుకో దొంగని!" అని వినిపించాయి.

"ఎవ్వరా దొంగ?"

తన మొగుడా! తన మొగుడా దొంగ! తను దొంగ తాలూకు పెళ్ళాన్నా!—కాదు కాదు—ఇదంతా యేదో మాయ—ఏదో కల—ఇది నిజం కాదు.......

దొరికిపోయిన దొంగచేతులకు బేడీలు పెట్టటం ఆమె కళ్లతో చూసింది. పిచ్చంతా పోయింది. ప్రజలంతా చుట్టుముట్టారు. ఇంతమంది మధ్య తలవంచుకుని నిల్చున్నాడు దొంగ—పుల్లయ్య! మనిషోమాట మనిషోతాం! తన ఇరుగూ పొరుగూ వాళ్లు అనరాని మాటలు మాట్లాడుతున్నారు—ఆ మంచి బాబు తల బద్దలుగొట్టిన దొంగ ఆమె మొగుడు!

నీలి ఇవన్నీ వినలేకపోయింది-ఇవన్నీ కనలేకపోయింది. ఆమెకు కుంటెడపట్టుకొని సగం వచ్చి నేలకు ఒరిగిపోయింది. వెంట పరుగెత్తినా వెనుకకు త్రోయబడ్డ మల్లు ఒక్కొంతంతో గగ్గోలు పెడుతున్నాడు. దొంగతో పోలీసులు ముందుకు సాగిపోతున్నారు. వాళ్ళవేపు చూడలేక చూడలేక చూసిందీ! ఆ ప్రజ కదిలిపోతున్నారు—కదిలిపోయారు! కాళ్ళు చేతులు కొట్టుకొని కొడుకు యేడుస్తున్నాడు.

అంతా చీకటి—ఆ చీకటిలో ఏకాకి తను—ఆమెకు యెక్కడలేని దుఃఖమూ ముంచుకొచ్చింది. మళ్ళీలేచి పరుగెత్తి అయ్యని వెంబడించాలని ఉరుకుతున్న కొడుకును వారిస్తూ కుంజాటన పడుతోంది. చాల సేపటికి ఇద్దరూ అలసిపోయారు. మెల్లమెల్లగా కొడుకుని యెత్తుకొని ఇంటిలోకి నడచి కూలబడిపోయింది.

—ఇంకావుంది

---

క్రొత్తగా కారు డ్రైవ్ చేయడం నేర్చుకుంటున్న భార్య భర్తను ప్రశ్నించింది.
"ఏమండి. పైన ఆ అద్దం సరిగా అమర్చలేదండి."

"సరిగానే వుందే"

"వెనుక వచ్చే కార్లు తప్ప అందులో ఇంకేమీ కనబడడం లేదు."

## 'శ్రీకృష్ణమాయ'

[53 వ పేజి తరువాయి]

రూపొందించాయి. పుష్కలంగా ఉన్న హాస్యాన్ని, సూక్ష్మమైన జీవితరహస్యాన్ని నాగేశ్వరరావు, జమున తెరమీద అందంగా, ఠీవిగా ఆవిష్కరించారు. ఇతర నటులలో కె. వి. ఎస్. శర్మ, ఎ. వి. సుబ్బారావు, మాలతి, సూర్యకాంతం భూమికలు చిన్నవైనా ప్రశంసనీయంగా నటించారు. కుటుంబరావు హాస్యం చేశారు. సత్యభామ పాత్రను, సహజమైన లక్షణాలను సూర్యకళ అతి మెలకువగా ప్రదర్శించింది.

టి. వి. రాజుగారి సంగీతం విన సొంపుగా ఉంది మూడు నాలుగు పాటలు-ముఖ్యంగా నారదుడికి ఘంటసాల పాడిన జోలపాట, (నారదుడికి కాదనీ, ఆ పాత్రకు గాత్రం అనీ గ్రహించ ప్రార్థన) చాలా బాగున్నాయి నారదుడి హరికథ ఘట్టంలో చక చక సాగిన పద్యాలూ, పాటలూకూడా శ్రావ్యంగా ఉన్నాయి. ఈ చిత్రం పేరిట, ప్రత్యేకం చెప్పుకోతగ్గ మరొక అంశం కమల్ ఘోష్ ఛాయాగ్రహణం.

మొత్తానికి కులాసా పురుషుడి జీవితంలా ఆద్యంతం సరదాగా అక్కడక్కడ ఇబ్బందిగా, సాగిపోయే మంచి తెలుగుచిత్రం తీసిన నిర్మాతలు అభినందనీయులు.

## ఫిలింఛేంబర్ కార్యవర్గం

(50-వ పేజీ తరువాయి)

శ్రీ ఎ. రామయ్య, కార్యదర్శులుగా శ్రీ పి. ఎస్. రామకృష్ణరావు, శ్రీ డి. రామానుజం, కోశాధికారిగా శ్రీ కె. ఎస్. నారాయణ అయ్యంగార్, ఎన్నికఅయ్యారు. కార్యవర్గ సభ్యులు: శ్రీయుతులు బి. నాగిరెడ్డి, ఎస్. ఎం. శ్రీరాములు నాయుడు, ఎస్. ఎస్. వాసన్, కెంపరాజ్ ఉర్స్, పి. ఎన్. పిళ్లై, ఎం. రాధాకృష్ణన్, ఎ. ఎల్. శ్రీనివాసన్, వి. సి. సుబ్బరామన్, ఎ. వి. మెయ్యప్పన్, జి. వి. రామన్, వి. శ్రీనివాసన్, టి. అశ్వత్థ నారాయణ, పళనియప్పన్, సి. ఎన్. రామానుజం, రామస్వామి, టి. వెంకటపతిరావు, ఎసి. రామచంద్రన్, కె. సుబ్రహ్మణ్యం, కె. ఎన్. పట్టభిరామన్, ఎస్. కృష్ణమూర్తి.

* * *

ట్వెంటియత్ సెంచరీ ఫాక్స్‌వారి కొత్త చిత్రం 'ది లాంగ్ హాట్ సమ్మర్' (సినిమాస్కోప్ డిలక్స్ కలర్) న్యూయార్కు, హాలివుడ్, వాషింగ్టన్ నగరాలలో విడుదలయి విమర్శకుల ప్రశంస లందుకుంది. ఆర్యన్‌వెల్స్, పాల్ న్యూమన్, జోన్ వుడ్‌వర్డ్ ఇందులో నటించారు. దీంతోపాటు విలియం ఫాక్నర్ వ్రాసిన రెండు కథల ఆధారంగా తీసిన చిన్న చిత్రాలనుకూడా చూపిస్తున్నారు. 

ప్రభా వారి 'ఆడపెత్తనం'లో రాజసులోచన

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at
The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street Madras-1 Editor S Sambhu Prasad

Regd No. M. 4479 Andhra Patrika Illustrated Weekly

ప్రతివారికీ తెలుసు—

ప్రతి
బ్రూక్ బాండ్
ప్యాకెట్టూ ఎన్నో
కప్పుల కమ్మని
టీ నిచ్చును

...మరియు త్వరితముగా
సరఫరా చేయుటచే
బ్రూక్ బాండ్ టీ
ఎల్లప్పుడూ సాటిలేని
తాజా తనము కలిగి
యుండును

...అందుకే
నిత్యమూ 550 లక్షల
కప్పుల కుపైగా
బ్రూక్ బాండ్ టీని
సేవించుచున్నారు




అందువల్లనే
అధిక సంఖ్యాకులు
ఇతర టీలకంటె
బ్రూక్
బాండ్
టీనే
సేవించుచున్నారు !

బ్రూక్ బాండ్ ఇండియా ప్రైవేట్ లిమిటెడ్